# మూడు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## సేవాసంస్థ

చన: వసుంధర

## పాములా పెంచుకున్న ద్వేషం

రచన: వి. యస్. రావ్

## నరహంతకి

రచన: సుంకరి రాంప్రసాద్

అన్వేషణ — పదమూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—163
జూలై, 1987
వెల: రు. 7-50
ఏడాది చందా: 90 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
ఏ. పీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
వి. యస్. రావ్
సుంకరి రాంప్రసాద్
విద్వాన్ శీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# సేవాసంస్థ?!

వసుంధర

డాక్టర్ సుబ్బారావు కారు దిగాడు. ఎదురుగానున్న భవనంలో ప్రవేశించాడు.

హాల్లోని పనివాడాయనకు నమస్కారించాడు.

"అయ్యగారున్నారా?" అన్నాడు సుబ్బారావు.

"ఉన్నారు. తమరు కూర్చోండి!" అన్నాడు పనివాడు.

సుబ్బారావు వాచీ చూసుకుంటూ కూర్చున్నాడు.

పనివాడు మేడెక్కి అయిదు నిమిషాల్లో తిరిగొచ్చి— "అయ్యగారు మేడమీద గదిలో వున్నారు. బాగా నీరసంగా ఉందిట. తమరినేమీ అనుకోకుండా పైకి రమ్మన్నారు—" అన్నాడు.

డాక్టరు సుబ్బారావు ఏమనుకున్నాడో తెలియదు కానీ మేడమీద గదిలోకి వెళ్ళాడు.

గదిలో మంచంమీద పడుకుని ఉన్నాడు జయప్రకాష్.

జయప్రకాష్ తెలుగువాడు కాదు. వ్యాపారరీత్యా ఆ ఊరొచ్చి స్థిరపడ్డాడు. రెండు దశాబ్దాల క్రితం ఆయనకు హిందీ తప్ప మరో భాష రాదు. ఇప్పుడాయన తెలుగు తప్ప మరో భాష మాట్లాడడు. ఆయన భాషలో ఇంగ్లీషు కలుస్తుందేమో కానీ హిందీ కలవదు.

"ఎలా వుంది వంట్లో?" అన్నాడు సుబ్బారావు.

"భరించలేని నీరసం—...."

సుబ్బారావు నిట్టూర్చాడు.

"డాక్టర్—నా జబ్బేమిటి—క్యాన్సరా?"

"కాదు...."

"ఎయిడ్సా?"

"కాదు...."

"మరేమిటి?"

"అదే నాకూ తెలియడంలేదు...."

జయప్రకాష్ భయంగా—"ఈనాటి వైద్య విజ్ఞానానికి కూడా నా జబ్బందదండా? నేను బ్రతుకుతానా?" అన్నాడు.

సుబ్బారావు మాట మారుస్తూ—"నగరంలోని ప్రముఖ డాక్టర్లందరితోటీ చర్చించాను. మీ జబ్బు గురించి కొన్ని నిర్ణయాలకు వచ్చాం....కానీ...." అని ఆగాడు.

"చెప్పండి డాక్టర్!" అన్నాడు జయప్రకాష్ ఆత్రుతగా.

"మీ జబ్బుకింకా పేరు పెట్టలేము. కానీ వైద్యం లేకపోలేదు. మొత్తం నలుగురం డాక్టర్లు కలిసి ఓ కోర్సు నిర్ణయించాం. అది తప్పక పనిచేస్తుందని నా నమ్మకం...."

"థాంక్యూ డాక్టర్! మీరు నా విషయంలో చాలా శ్రద్ధ తీసుకుంటున్నారు. వెంటనే కోర్సు ప్రారంభించండి—" అన్నాడు జయప్రకాష్.

"నేను డబ్బుకోసం వైద్యం చేయడంలేదు. నాకు తల్లిదండ్రులిచ్చిన ఆస్తిపాస్తులే ఉన్నాయి— మూడు తరాలదాకా సరిపోయేలా! జబ్బులతో పోరాడాలనే నేను వైద్య వృత్తిని చేపట్టాను. మీ జబ్బు నాకో సవాలుగా తయారయింది. ఈ విషయమై నేను చాలా పుస్తకాలు చదివాను. ఫారిన్ ప్రొఫెసర్లతో కరెస్పాండెన్సు నడిపాను. ఊళ్ళోని ప్రముఖులను సంప్రదించాను. నా కృషి ఊరికే పోలేదు. ఓ దారికి వచ్చాను. ఇక వైద్యం ప్రారంభించవచ్చు. కానీ...."

"ఊఁ" అన్నాడు జయప్రకాష్ ఆత్రుతగా.

"కోర్సు నిర్ణయించినా—అందులో కొంత రిస్కుంది. మీరో ప్రముఖ వ్యాపారవేత్త. మీ ప్రాణాలెంతో విలువైనవి. మీతో రిస్కు తీసుకోలేను—...."

"ఫరవాలేదు. తీస్కోండి డాక్టర్!" అన్నాడు జయప్రకాష్.

సుబ్బారావు మాట్లాడలేదు.

"నాకు మీమీద నమ్మకముంది డాక్టర్" అన్నాడు జయప్రకాష్.

"అందుకు థాంక్స్— కానీ ముందు నామీద నాక్కూడా నమ్మకం పెరగాలి కదా!" అన్నాడు సుబ్బారావు.

"అయితే ఏం చేయాలంటారు?" అన్నాడు జయప్రకాష్.

"మీ అదృష్టం బాగుండి రిస్కు ఫాక్టర్ తొలగి

పోయే ఉపాయం వెతుక్కుంటూ వచ్చింది. అందుకే మీ సహకారం కావాలి...." అన్నాడు సుబ్బారావు.

"నేను సహకరించనని మీకేమైనా అనుమానమా?" అన్నాడు జయప్రకాష్.

"మీ వైద్యానికి యాభై వేలు ఖర్చవుతుంది...."

జయప్రకాష్ క్షణం ఆగి— "పెద్ద మొత్తమే!" అన్నాడు.

"కానీ సరిగ్గా నెలరోజుల్లో మీ వ్యాధి పూర్తిగా నయమైపోతుంది ...."

జయప్రకాష్ మాట్లాడలేదు.

"ఈ ఖర్చులో నా ఫీజు అయిదు వేలు మాత్రమే!"

జయప్రకాష్ మాట్లాడలేదు.

"వైద్యానికి ముఖ్యం-రోగి నమ్మకం!"

"నేను మిమ్మల్ని నమ్ముతున్నాను డాక్టర్—" అన్నాడు జయప్రకాష్ చటుక్కున.

"థాంక్స్—కానీ మరో విషయం...."

"చెప్పండి—...."

"మీ వైద్యం ప్రారంభించడానికి నెలరోజులు గడువుంది. ఈలోగా మీరు మరో యాభై వేలు ఖర్చు పెట్టాలి..."

"మరో యాభై వేలా?" జయప్రకాష్ నోరావలించాడు.

"అవును. మరో యాభై వేలు—"

"ఎందుకు?"

"మీకున్నలాంటి జబ్బుతోనే బాధపడుతున్న మరో రోగికి వైద్యం చేయడానికి...."

"అంటే?"

"చెప్పాలంటే అతడు గినీ పిగ్.... నేను కనిపెట్టిన కోర్సునతడిమీద ప్రయోగిస్తాను. అందువల్ల మీకేవిధమైన రిస్కూ ఉండకుండా పోతుంది...."

"డాక్టర్! మీరా జబ్బులతో పోరాడ్డంకోసమే వైద్య వృత్తిని చేపట్టానన్నారు.... మీరు కొత్త కోర్సు కనిపెట్టారు. దాన్ని నా డబ్బుతో పరీక్షిస్తారా?"

"మరి ఆ రోగి పేదవాడు...."

"ధనవంతులింకెవ్వరికీ ఇలాంటి జబ్బు లేదా?"

"వైద్య వృత్తిలో పరీక్షలకు పేదవాళ్ళే గినీ పిగ్స్...."

జయప్రకాష్‌కి తన తప్పు అర్థమయింది—"పోనీ కొత్త కోర్సు కనిపెట్టడానికి మీరు మీ డబ్బు వినియోగించలేరా?" అన్నాడు.

"నేను జబ్బులతో పోరాడేది రోగుల కోసం. రోగుల కాసక్తి లేకపోతే—జబ్బులతో పోరాడ్డం నాకు సరదా కాదు—...." అన్నాడు సుబ్బారావు.

జయప్రకాష్ మాట్లాడలేదు.

"డియర్ జయప్రకాష్! మరో డాక్టరైతే మిమ్మల్ని తప్పుదారి పట్టించి ఏదో వైద్యం చేసి ఊరుకునేవాడు. మీకు డబ్బుకు డబ్బూ ఖర్చవుతుంది, రోగం నుంచి విముక్తి లభించదు. నేను డబ్బు కోసమనే వైద్యం చేయడంలేను. రోగాన్నర్థం చేసుకుని నిర్మూలించడం నాకెంతో తృప్తి నిస్తుంది. అలాగని ఉచితంగా వైద్యం చేయలేను. మీ గురించి ఆలోచిస్తున్నాను కాబట్టే త్వరగా గినీపిగ్ నెన్నుకున్నాను. త్వరగా ఆలోచించుకుని మీ నిర్ణయం చెప్పండి—...." అన్నాడు సుబ్బారావు.

"నాకొకరోజు గడువు కావాలి. నేను భాగ్యవంతుణ్ణే కావచ్చు. వైద్యానికి రెండు మాసాల్లో లక్ష రూపాయలు ఖర్చు పెట్టాలంటే ఆలోచన అవసరం లేనంత భాగ్యవంతుణ్ని మాత్రం కాను...." అన్నాడు జయప్రకాష్.

సుబ్బారావు తన జేబులోంచి ఓ కాగితం తీసి జయప్రకాష్ కందించి—"మీ గినీపిగ్ అడ్రసిందులో ఉంది. మీరు సరైన నిర్ణయం తీసుకుంటే వెళ్ళి అతణ్ని కలుసుకుని—అతడి వైద్యానికి మీరు సాయపడుతున్నట్లు చెప్పండి...." అన్నాడు.

"కొ నాలోచించుకోవాలి కదా!" అన్నాడు జయప్రకాష్.

"ఆలోచనలో ఆలస్యం చేస్తే అది మీకే ప్రమాదం. త్వరగా ఒక నిర్ణయానికి రండి...." అని వెళ్ళిపోయాడు సుబ్బారావు.

జయప్రకాష్ తన చేతిలోని కాగితం వంకే చూస్తూ ఆ అడ్రసు పదే పదే చదువుకుని నిట్టూర్చాడు.

## 2

జయప్రకాష్ అనారోగ్యం కారణంగా అతడి భార్య వ్యాపార వ్యవహారాలు చూసుకుంటోంది. ఆమె పేరు రీనా. పెద్దకొడుక్కి పెళ్ళయి కోడలు కాపురానికొచ్చినప్పటికీ—రీనాను బాగా పరీక్షగా చూస్తేతప్ప—కొత్తగా పెళ్ళయిన యువతిలా కనబడుతుంది. మొదట్నించీ వ్యాపార వ్యవహారాల్లో ఆమె భర్తకు సాయపడుతూండేది. ఆమె కారణంగానే జయప్రకాష్ ఈ నాడీ స్థాయి కెదిగాడు.

జయప్రకాష్ కిద్దరు పిల్లలు. పెద్దకొడుకు సుభాష్

కులాసా పురుషుడు. వ్యాపారమంటే అంటీ ముట్టనట్లుంటాడు. ఏదో ఉద్యోగం చేసినట్లు ఆఫీసుకు టైముకు వెళ్ళి టైముకు వచ్చేస్తూంటాడు. ఎక్కువగా సెలవులు తీసుకుంటూంటాడు. అతని ధోరణి కనిపెట్టి—తలిదండ్రులు అతడికి త్వరగా పెళ్ళి చేసేశారు. అతడి భార్య దేవయాని. ఆమెకూ యింటి వ్యవహారాలు బొత్తిగా పట్టవు. దేవయాని, సుభాష్ చిలకాగోరింకల్లా సుఖంగా జీవిస్తున్నారు.

జయప్రకాష్ రెండో కొడుకు పేరు అతుల్. అతడికి వ్యాపారమంటే ఆసక్తి ఉంది కానీ తెలివి తక్కువ. తండ్రి చాటునే ఉంటూ అతడన్నీ తెలుసుకుంటున్నాడు. ఎంత నేర్చుకున్నా అతడిలో వ్యక్తిత్వం బలపడడంలేదు. ప్రతిదానికీ తల్లో, తండ్రో సలహా యివ్వాలి. ఏదో ఒక రోజున అతడే వ్యాపారాన్నభివృద్ధి చేస్తాడని తలిదండ్రుల ఆశ. అతడికిప్పుడు ఇరవైరెండేళ్ళు. బీకాం ప్యాసయ్యాడు. వ్యాపారంలో తనంతటివాడు తానని పించుకునేదాకా పెళ్ళి చేసుకోనని ప్రతిజ్ఞ పట్టాడు.

అతుల్ కారణంగానే జయప్రకాష్ అనారోగ్యంతో ఉంటే—రీనా యింటిపట్టున ఉండకుండా—అతడితో పాటు బైటకు వెళ్ళాల్సొస్తుంది. జయప్రకాష్ సేవల కోసం ఆమె ప్రత్యేకంగా యిద్దరు మనుషుల్ని కూడా నియోగించింది. కోడలికింటి వ్యవహారాలు బొత్తిగా పట్టవని తెలిసినా—ఆమె గురించి తనూ అంతగా పట్టించుకోదు రీనా. తనకు తానై అడిగితేతప్ప బాధ్యత అప్పగించదామె ఎవరికీ.

డాక్టర్ సుబ్బారావు జయప్రకాష్‌ను కలుసుకుని మాట్లాడినప్పుడు—రీనా యింట్లో లేదు. జయప్రకాష్

ఆమె కోసం ఎదురుచూశాడు. తన వైద్యం విషయం బాధ్యత చర్చించేదాకా ఏ నిర్ణయం తీసుకోకూడదనే అతడు డాక్టర్ని గడుకడిగాడు. గడుకడిగేక కాసేపు నిద్ర పోదామనుకున్నాడాయన. కానీ యెంత ప్రయత్నించినా నిద్రపట్టలేదు. అతడి బుర్రలో మాత్రం అంతా గజిబిజిగా ఉంది.

రీనా యింటికి వచ్చి రాగానే భర్తను కలుసుకుంది.

"నీకోసమే యెదురుచూస్తున్నాను—" అన్నాడు జయప్రకాష్. ఆమెను చూసిన ఉత్సాహంలో అతడి నీరసం కూడా కాస్త తగ్గింది.

"ఏమయింది?" అంది రీనా.

జయప్రకాష్ ఆమెకు జరిగింది చెప్పాడు.

"ఇందులో ఆలోచించడాని కేముంది? వెంటనే వైద్యాని కేర్పాట్లు చేయిద్దాం. లక్షరూపాయలు మళ్ళీ సంపాదించుకోగలం కానీ...." అని ఆగింది రీనా.

"నేను లక్షరూపాయల కోసం తటపటాయించడం లేదు. డాక్టరు సుబ్బారావు సంగతి బాగా తెలుసు కాబట్టి ఆలోచనలో పడ్డాను—...." అన్నాడు జయప్రకాష్.

"సుబ్బారావుగారు మనని మోసం చేయరు. మనకు బాగా నమ్మకస్థులు ..."

"కాదనను, కానీ గినీపిగ్ విషయం నిజం కాదని నేనూహించగలను...."

"ఎందుకని?"

"అది సుబ్బారావు పద్ధతి. ఆయన మనుషుల్ని గినీపిగ్స్‌లా ఉపయోగించుకునే టైపుకాదు. నా లాంటి జబ్బుతోనే బాధపడుతున్న మరో మనిషి కాయన

వైద్యం చేస్తానన్నాడంటే—దాని అర్థం—వైద్యం మీద ఆయనకు నమ్మకముందని!" అన్నాడు జయప్రకాష్.

"అయితే ఏమంటారు?"

"తానూరికే వైద్యం చేయడు కానీ అవకాశం దొరికి నప్పుడల్లా యేదో తంత్రం పన్ని మనవంటి వారిచేత లేని వారికి వైద్యం ఖర్చులు భరించేలా చేస్తాడాయన...."

"అంటే?"

"నారాయన కాగితంమీద రాసిచ్చిన రోగి పేరు కృష్ణమూర్తి. ఆ కృష్ణమూర్తికి వైద్యం చేస్తే తప్ప నా కాయన వైద్యం చేయడు. కృష్ణమూర్తి వైద్యం ఖర్చులన్నీ నేనే భరించాలంటున్నాడు. కృష్ణమూర్తికి వైద్యం జరిపించకపోయినా, ఆయన వైద్యం చేయకున్నా—ఫర్వాలేదు. నేను బ్రతుకుతాను. ఆ సుబ్బారావు వైద్యం సరాసరి నా మీద ప్రయోగించవచ్చును...."

"యాభైవేల కోసం మీరు మీమీద రిస్కు తీసుకుంటారా?" అంది రీనా.

"ఇందులో రిస్కేమీ ఉండదు. సుబ్బారావు సంగతి బాగా తెలిసినవాణ్ని కాబట్టి చెబుతున్నాను. కృష్ణమూర్తి గురించి మనం యాభైవేలూ ఖర్చుపెట్టడం శుద్ధ దండుగ...."

రీనా ఆలోచనలో పడి—"మీరు నిజమే చెబుతున్నారు—" అంది.

"అందుకే కృష్ణమూర్తి వైద్యం ఖర్చు తప్పించుకోవాలి...."

"మీరు సుబ్బారావుగారికి—రిస్కు తీసుకుంటానని చెప్పండి...."

"చెచెబితే వినడాయన. మహా మొండిమనిషి. నేను తీసుకుంటున్నానన్నా తను రిస్కు తీసుకోనంటాడు. నా ద్వారా ఓ పేదవాడికి వైద్యం జరిపించి తీరాలంటాడు...."

"అయితే ఏం చేయాలంటారు?"

"కృష్ణమూర్తికి డబ్బాశ చూపించాలి. వైద్యం చేయించుకోనందు కైదువేలిస్తానంటే సరి. అలాంటి వాళ్ళకి ప్రాణాలకంటే డబ్బే ముఖ్యం.... అతడి ప్రాణం అయిదువేలు కాదు—ఆయిదువందలు కూడా విలువ చేయకపోవచ్చు—" అన్నాడు జయప్రకాష్.

రీనా తల అడ్డంగా వూపి—"మీరు చెప్పింది రెండు విధాల బాగోలేదు. ఓ రోగికి వైద్యం జరక్కుండా ఆపడం మనకు న్యాయం కాదు. అతడు మీకులాగే బాధ పడుతూంటే—వైద్యం వద్దంటాడనుకోను. ఆ తర్వాత సుబ్బారావుగారికి మనమీద అనుమానం వస్తుంది—" అంది.

"అయితే మరింకే ఉపాయమూ లేదా?"

రీనా ఆలోచిస్తూ—"కొన్ని స్వచ్ఛంద సేవాసంస్థలుంటాయి...." అంది.

"అంటే?"

"పేదవారి కంతుపట్టని జబ్బులొస్తే వైద్యసౌకర్యం కలుగజేసే స్వచ్ఛంద సేవలు కొన్ని ఉంటాయి. అలాంటి సంస్థలు కొన్నింటికి చందాలు కూడా యిచ్చాం మనం..."

"నువ్వు చెప్పింది బాగానే వుంది. కానీ యేదో ప్రయోజనం లేందే వాళ్ళందు కొప్పుకోరు...."

"నాకు తెలుసు. జబ్బు—అంటుపట్టనిదై ఉండడం

మొదటి వరకు. రెండోది—ఆ సంస్థ కిందుకల్ల బాగా ప్రచారం లభించి—చందాలు మరింతగా వసూలు కావాలి...." అంది రీనా—"రెండో విషయంలో సహకరించడానికి మనం కొంత సాయం చేయగలం.... ప్రచారమూ, చందాలూ కూడా...."

జయప్రకాష్ కళ్ళు మెరిశాయి—"అందుకు పదివేలు ఖర్చుపెట్టినా ఫరవాలేదు. ఇంకా మనకు నలభైవేలు లాభం...."

"నేను మన అతుల్‌తో మాట్లాడతాను—...." అంటూ లేచింది రీనా.

"త్వరగా తేల్చేయి. అవతల సుబ్బారావుకి నచ్చదు, ఇవతల నేనూ నీరసం భరించలేక పోతున్నాను...." అన్నాడు జయప్రకాష్.

## 3

"ఈ రోజుల్లో కూడా ఇలాంటివారుంటారనుకోలేదు" అంది రీనా.

"ఏమయిందీ?" అన్నాడు జయప్రకాష్.

"ఆయన పేరు వీర్రాజు. సంవత్సరం క్రితం ఆయన సొంత గానో అభిమానించే బంధువు లబ్బాయి అర్ధాంతరంగా మరణించాడు. సరైన సమయానికి వైద్యసహాయం మంది ఉంటే అతడు తప్పక జీవించి ఉండేవాడు. వీర్రాజు దీనికి చలించిపోయాడు. ఆయన బాగా ఆస్తిపరుడు. ఆ అబ్బాయి పేరు రమణ. ఆ పేరిట వీర్రాజొక స్వచ్ఛంద సేవాసంస్థను స్థాపించాడు. కృష్ణమూర్తి వివరాలు విని ఆయన వెంటనే అతడి వైద్యానికి తానేర్పాట్లు చేస్తానన్నాడు. చందా అడగలేదు. ప్రచారం కోరలేదు...."

"ఆశ్చర్యంగా ఉందే?...." అన్నాడు జయ

ప్రకాష్.

"నేను మాత్రం వెంటనే ఆయనకు వెయ్యిన్నూట పదహార్లు చందాగా యిచ్చాను. అంతకు మించి చందా తీసుకోవడం సంస్థ ఆశయాలకు విరుద్ధ మన్నా డాయన ..."

"తొందరగా పని జరగాలి...."

"మన కంటే ఆయనే తొందరపడుతున్నాడు. బహుశా ఈ రోజే వ్యవహారం తేలిపోవచ్చు— ...." అంది రీనా.

"కృష్ణమూర్తి అడ్రసాయన కిచ్చావా?"

"ఇచ్చాను. అవసరమైతే విదేశాలు కూడా పంపి అతడికి వైద్యం జరిపిస్తానన్నా డాయన— ...." అంది రీనా.

"నన్ను కూడా ఇయనకే అప్పగిస్తే—ఇంకో యాభై వేలు మిగులాయి—" అన్నాడు జయప్రకాష్ నవ్వుతూ.

"సరే—రోగి అంతస్థు విషయంలో ఆయనకు చాలా పట్టుదల ఉంది. బొత్తిగా గతిలేనివాళ్ళకే ఆయన సాయం చేస్తాడు...."

"కృష్ణమూర్తి బొత్తిగా గతిలేనివాడా?" అన్నాడు జయప్రకాష్.

"అతడి జీతం నెలకు ఆరువందలు. భార్య, రెండేళ్ళ కూతురు ఉన్నారు. సొంతు భూమి లేదు. ఓ చిన్న గదిలో అద్దెకుంటూ నెలకు వందరూపాయ లిస్తున్నాడు. అతడి భార్య కుట్టుమిషనుమీద బట్టలు కుట్టుకుంటూ—వేణ్నీళ్ళకు చన్నీళ్ళుగా కొంత సంపాదిస్తోంది. ఇద్దరికీ అయిన వాళ్ళున్నా—కాస్త దూరంగానే ఉంటారు. ఎవరి బాధ్యతలు వారివి. ఇప్పటి జబ్బువల్ల కృష్ణమూర్తి

మునుపటిలా పని చేయలేకపోతున్నాడు. కంపెనీవారుద్యోగం తీసేస్తామని బెదిరిస్తున్నారు. వాళ్ళింట్లో అంతా బెంగ పెట్టుకున్నారు—....” అంది రీనా.

జయప్రకాష్ నిట్టూర్చి—“డబ్బున్నవాళ్ళకు అనారోగ్య మొక్కటే జబ్బు. లేనివాళ్ళకు— పేదరికం చాలా పెద్ద జబ్బు—” అన్నాడు.

## 4

చిన్న పెంకుటిల్లు ముందు పెద్ద కారాగింది. కార్లోంచి దిగాడు డాక్టర్ సుబ్బారావు.

ఇంటి ముందర నలుగురు పిల్లలాడుకొంటున్నారు. సుబ్బారావును చూస్తూ వాళ్ళాట ఆపి—అతడికేసే చూస్తూండిపోయారు.

“కృష్ణమూర్తిగారుండేదీ యింట్లోనే కదూ?” అన్నాడు సుబ్బారావు.

“అవునండి—” అంటూ ఓ కుర్రవాడు దారి చూపించాడు.

సుబ్బారావు ముందుకు వెళ్ళి తలుపు తట్టపోయి ఆగిపోయాడు.

తలుపు చాలా బలహీనంగా తడితే పడిపోతుందా అన్నట్టుంది.

“కృష్ణమూర్తిగారూ!” అన్నాడతడు.

ఆ పిలుపు అదురు కా అన్నట్టు తలుపు తెరుచుకుంది.

తలుపు కవతల—ఆ తలుపుకంటె బలహీనంగా వున్న యువతి ఉంది.

“కృష్ణమూర్తిగారింట్లో లేరు—...” అందామె.

ఆమె మాట నీరసంగా వున్నా—తీయగా వుంది.

“లోపలకు రావచ్చా?” అన్నాడు సుబ్బారావు.

ఆమె తటపటాయించింది.

"నా పేరు సుబ్బారావు. నేను డాక్టర్ని...."

ఆమె పక్కకు తప్పుకుని—"మా యింట్లో మీరు కూర్చుందుకు కుర్చీ కూడా లేదు—...." అంది. అవమానపు బాధ సణిచిపెట్టుకుందుకు ప్రయత్నిస్తున్నట్లుందామె.

సుబ్బారావు లోపలకు ప్రవేశించాడు.

ఆ గదిలో ఓ బొంత నేలమీద పరిచి వుంది. దాని మీద ఓ చంటిపాప నిద్రపోతోంది.

"కృష్ణమూర్తిగారెక్కడున్నారు?" అన్నాడు సుబ్బారావు.

"ఆఫీసుకు వెళ్ళారు—"

"ఈ సమయంలోనా?"

"ఆయనకు సెలవు కావాలి. మాట్లాడ్డానికి సమయం లోనే రమ్మన్నారు!"

"సెలవెందుకు?"

"వైద్యానికి...."

"వైద్య మెవరు చేస్తారు?"

"వీరరాజుగారని ఓ మహానుభావు డందు కేర్పాటు చేస్తున్నారు."

సుబ్బారావు నిట్టూర్చి—"వైద్యానికి మీ వారు నా దగ్గర కొచ్చారు. తెలుసా మీకు?" అన్నాడు.

"తెలియదు—" అందామె.

సుబ్బారావామెకు విషయం వివరించి చెప్పాడు.

కృష్ణమూర్తి అనారోగ్యంతో బాధపడుతూ-ధర్మాసుపత్రికి వెళ్ళాడు. అక్కడ డాక్టరతణ్ని పరీక్ష చేస్తున్న సమయంలో యేదో పనిమీద అక్కడే వున్న సుబ్బారా

వరణ్ని తన నర్సింగ్ హోంకు తీసుకుని వెళ్ళి ప్రత్యేకమైన పరీక్ష చేశాడు. అతడి వైద్యానికి కొన్ని ఏర్పాట్లు కూడా చేశాడు. నిన్నటిరోజున కృష్ణమూర్తి సుబ్బారావును కలుసుకోవాల్సి ఉంది. అతడు రాలేదు. తన వైద్యానికి వేరే ఏర్పాట్లు జరుగుతున్నట్లతడు చీటీ పంపించాడు.

"ఏం జరిగిందో తెలుసుకోవాలని వచ్చాను—" అన్నాడు సుబ్బారావు.

"మూడురోజుల క్రితం వీర్రాజుగారు మా వారిని స్వయంగా కలుసుకుని డాక్టరుకి చూపించారు. ఆ డాక్టరు చాలా పరీక్షలు చేశాడు. నిన్నటిరోజు రిపోర్టు వచ్చింది. మా వారి జబ్బుకు భారతదేశంలో వైద్య సదుపాయం లేదు. విదేశాలు వెళ్ళాలి, తక్షణం వైద్యం జరక్కపోతే వారి ప్రాణాలకే ప్రమాదమట...."

"ఆ వీర్రాజుగారెవరు?"

"రమణ సేవాసంస్థ అధిపతి. పేదవారికి వైద్యసదుపాయాలేర్పాటు చేసే స్వచ్ఛంద సేవాసంస్థ వారిది...."

"వీర్రాజుగారికి మీవారెలా పరిచయమయ్యారు?"

"తెలియదు. అది బహుశా వారి అదృష్టం...."

"చూడమ్మా- నేనీ ఊళ్లో బాగా పేరున్న డాక్టర్ని. ఉచితంగా వైద్యం చేయకపోయినా డబ్బుకోసమే వైద్యమని నమ్మడంలేదు. మీవారిని పరీక్షించాను. వారికి నేను నయం చేయగలను. సరిగ్గా నెలరోజుల్లో మీవారు మామూలు మనిషవుతారు. మీవారి వైద్యానికి నేను స్వయంగా ఖర్చులు భరించదల్చుకున్నాను. ఇలాంటి పరిస్థితుల్లో వారు వేరే వైద్యానికెందుకు వెడుతున్నారో

నాకర్థం కావడంలేదు...." అన్నాడు సుబ్బారావు.

"ఆశ్చర్యంగా ఉంది. మాబోటి పేదవారి వైద్యానికిలా పేరున్నవారు పోటీలు పడుతున్నారు!" అందామె.

సుబ్బారావుకేం చెప్పాలో అర్థంకాలేదు. ఓ క్షణమాగి — "వీర్రాజుగారి విషయమే నాకాశ్చర్యంగా వుంది. ఇండియాలో వైద్యానికి వీలుండగా—విదేశాలు పంపడ మెందుకో?" అన్నాడు.

"వీర్రాజుగారికంటె నాకు మీ విషయమే ఆశ్చర్యంగా వుంది. వారు సేవాసంస్థకు అధిపతి. ఆ సంస్థ ద్వారా ఎందరో వైద్యసహాయం పొందారు. మీరేమో పేరున్న డాక్టరు. డబ్బు రాదని తెలిసీ స్వంతఖర్చులు భరించికూడా మావారికి వైద్యం చేయాలని ఎందుకనుకుంటారు?" అందామె.

"మీవారి జబ్బు—నా సమర్థతకు సవాలు—" అన్నాడు సుబ్బారావు.

అప్పుడు కృష్ణమూర్తి భార్య అన్న మాట విని సుబ్బారావాశ్చర్యపోయాడు.

"మీ సామర్థ్యాన్ని పరీక్షించుకుందుకు మావారి ప్రాణాలతో ఆడుకుందా మనుకుంటున్నారా?" అందామె.

"అలాగని ఎవరు చెప్పారు?" అన్నాడు సుబ్బారావు.

ఆమె వివరించింది.

కొత్తరకం జబ్బులు వచ్చినపుడు గొప్పవారిపైకాక పేదవారిపై వైద్యప్రయోగం చేసి ఆ ఫలితాలనుపయోగించుకుని — గొప్పవారిని ప్రమాదంనుంచి తప్పిస్తారు వైద్యులు. కృష్ణమూర్తికి వచ్చినది కొత్తరకం జబ్బు.

ఇలాంటి జబ్బుకు భారతదేశంలో వైద్యం లేనట్లే లెక్క. ఏ డాక్టరైనా స్వంత డబ్బుతో వైద్యం చేస్తానన్నాడంటే అందుకు స్వార్థపరమైన కారణముంటుందని వీర్రాజు కృష్ణమూర్తిని హెచ్చరించి తను విదేశంలో వైద్యాని కేర్పాటు చేస్తున్నానని చెప్పాడు. అందుకే సెలవు కావాలి. సెలవు వచ్చే ఏర్పాటుకూడా వీర్రాజు చేస్తానన్నాడు. ఆయనకు మంచి పలుకుబడి వుంది.

ఈ వివరాలు విన్న సుబ్బారావు ముఖంలో అలజడి కనిపించింది.

"చూడమ్మా! ఆ వీర్రాజు చెప్పింది నిజంకాదు. మీవారి జబ్బును నేను పూర్తిగా అర్థంచేసుకున్నాను. నా వైద్యం గ్యారంటీ ఫలితాలనిస్తుంది. నెలరోజుల్లో మీవారు మామూలు మనిషవుతారు. అందుకయ్యే ఖర్చు కూడా తక్కువకాదు. యాభైవేలు. అదృష్టంకొద్దీ అన్నీ కలిసొచ్చి నేను మీవారి వైద్యానికేర్పాటు చేశాను. ఈ సమయంలో పేషంటును వదులుకోవడం నాకిష్టంలేదు. ఇందువల్ల మీవారికే ఎంతో నష్టం. బాగా ఆలోచించుకోండి__" అన్నాడు సుబ్బారావు.

"మావారి వైద్యానికి మీరు యాభైవేలు ఖర్చు పెట్టడంవల్ల నాకేమి లాభం? మాకోసం మీరు పదివేలివ్వగలరా? మావారికేదైనా అయితే-నాకు జీవనోపాధి ఏర్పాటు చేయగలరా?" అందామె.

"నీ పేరేమిటమ్మా?" అన్నాడు సుబ్బారావు.

"అనసూయ__" అందామె.

"అనసూయా! నేను వైద్యుణ్ని. పిలిచి ఊరికే వైద్యం చేస్తానంటే నీకేదోలాగుంది. ఇందులో నాకు లాభముందనుకుంటే అది నీ పొరపాటు. నీ భర్త

క్షేమంకోరి చెప్పాను. వైద్యానికి తప్ప నీకు నేనేమీ దక్షిణివ్వలేను. నీ జీవనోపాధి విషయంలో హామీ ఇవ్వలేను. అలాంటి హామీలన్నీ యిచ్చి యెవరైనా వైద్యం చేస్తానంటే అది నీ అదృష్టంకావచ్చు. కానీ నన్ను వదులుకోవడం నీకు దురదృష్టంకాక మానదు. నా వైద్యాన్ని కాదనడం సిద్ధాన్నాని కాదనడంలాంటిది” అన్నాడు సుబ్బారావు.

అనసూయ మాట్లాడలేదు.

సుబ్బారావు వెళ్ళిపోయాడు.

## 5

“చాలా మంచి నిర్ణయం తీసుకున్నందుకు నిన్నభినందిస్తున్నాను....” అన్నాడు వీర్రాజు.

“మీ సాయం జీవితాంతం గుర్తుంచుకుంటాను—” అన్నాడు కృష్ణమూర్తి.

అనసూయ వారిద్దరినీ గమనిస్తోంది.

ఒక్కసారిగా తన పరిస్థితి మారినట్లే వుంది.

తమకు చిల్లర బాకీలు— ఆరేడు వందలున్నాయి. అవి తీరిపోయాయి. కుట్టుమిషను వాయిదాలింకా ఆరున్నాయి. అవి కట్టేయబడ్డాయి. ఇవన్నీకాక చేతిలో పదివేల రూపాయల రొక్కం.

కంపెనీ కృష్ణమూర్తికి నెలరోజుల సెలవు మంజూరు చేసింది. అతడికేమైనా అయితే అతడి స్థానంలో అనసూయకుద్యోగమివ్వడానికి అంగీకరించింది.

“మీరు దేవుడు—” అందామె వీర్రాజుతో.

“నీ భర్తకు ప్రాణంపోకాక—అప్పుడీమాట అను-” అన్నాడు వీర్రాజు.

“పోతున్న ప్రాణాన్ని దేవుడు కూడా ఆపలేడు,

ప్రతిఫలంగా మా బ్రతుకులకి అర్థం కల్పిస్తున్నారు. మీరు దేవుడే—" అన్నాడు కృష్ణమూర్తి.

వీర్రాజు నవ్వి—"దేవుడికంటె గొప్పది అదృష్టం. మహామహా చదువుకున్నవారికే విదేశయానం కుదరడం లేదు. నువ్వు కేవలం నీ జబ్బు కారణంగా ఇటలీ వెడుతున్నావు. ఇటలీ చాలా గొప్ప దేశం. ఎంతో చరిత్ర ఉన్న దేశం...." అన్నాడు.

అనసూయ కళ్ళొత్తుకుని— "వారిని మీరాశీర్వదించండి. ఆరోగ్యంతో తిరిగివస్తారు—" అంది.

"నా దీవెనలెప్పుడూ మనసులో ఉంటాయి. నేనుకున్నట్లుగా అన్నీ జరుగుతాయి—" అన్నాడు వీర్రాజు.

ఆ తర్వాత వీర్రాజు, కృష్ణమూర్తి కలిసి కార్లో వెళ్ళిపోయారు.

"ఆయన్ను నేను మళ్ళీ చూడాలి. ఇవే మా ఆఖరి చూపులు కాకూడదు—" అనుకుంటూ అనసూయ భగవంతుణ్ణి ప్రార్థించుకుంది.

అప్పుడు చంటిపాప నిద్రపోతోంది.

కాసేపట్లో ఆమె దగ్గరకు మళ్ళీ డాక్టర్ సుబ్బారావు వచ్చాడు.

"వారు ఇటలీ వెళ్ళిపోయారు!" అంది అనసూయ.

"ఇటలీయా?" అన్నాడు సుబ్బారావు ఆశ్చర్యంగా.

"అవును—మీకింకా వారితో పనేమిటి?"

"మీ వారినీ ఊళ్ళో పరీక్ష చేసిన డాక్టరెవరో తెలుసుకోవాలని వచ్చాను...." అన్నాడు సుబ్బారావు గంభీరంగా.

"ఎందుకు?"

"ఈ ఊళ్ళోని స్పెషలిస్టులందరూ నాకు తెలుసు,

మీ వారు వారెవర్నీ కలవలేదు. వారెవ్వర్నీ కలవకుండా అతడి జబ్బెలా పరీక్షించబడిందో నాకర్థం కావడంలేదు. అతడినిటలీ పంపాలన్న నిర్ణయానికి వచ్చిన డాక్టరెవరో తెలుసుకోవాలని నాకు చాలా కుతూహలంగా వుంది—" అన్నాడు సుబ్బారావు.

"వీర్రాజు గారినడిగితే చెప్పేవారు...."

"ఆయన్ను కలిశాను.... చెప్పలేదు...."

"అయితే నన్నడిగి ప్రయోజనంలేదు. నాకు తెలియదు...."

"మాడమ్మా—అనసూయా! ఈ వ్యవహారమంతా నాకనుమానంగా ఉంది. అసలు మీ వారు నిజంగా ఇటలీయే వెడుతున్నారా?" అన్నాడు సుబ్బారావు.

"అంటే?"

"ఇందులో ఏదైనా మోసముందని నా అనుమానం."

"మోసమెందుకుంటుంది? ఉంటే ఆందువల్ల ప్రయోజనమెవరికి? మా అప్పులు తీరాయి. వారి జబ్బు నయమవుతోంది. చేతిలో డబ్బాడుతోంది. ఇన్ని ఏర్పాట్లకు తగ్గ ప్రతిఫలం మా నుంచి ఎవరుమాత్రం పొందగలరు?" అంది అనసూయ.

"అదే—ఏ ప్రయోజనమూ లేకుండా ఎవరైనా ఇలా ఎందుకు సాయపడతారు?" అన్నాడు సుబ్బారావు.

"ఈ సందేహం మీకు రాకూడదు, మీరూ మాకిలాగే సాయపడాలనుకుంటున్నారు—" అంది అనసూయ.

"నా సంగతి తెలియక నువ్విలా మాట్లాడుతున్నావు. రాణించగల శిష్యుణ్ణి సానబెట్టాలన్న కోరిక గురువుకు సహజం. అలాగే నమ్మకంగా రోగం నయం చేయగలనను

ఉన్నప్పుడు—రోగిని వదిలిపెట్టడం వైద్యుడికిష్టముండదు. ఇక ఖర్చు సంగతంటావా? ఇలాటి జబ్బే ఓ భాగ్యవంతుడికి వచ్చింది. ఆయనకు రెట్టింపు చెప్పి—ఇద్దరికీ వైద్యం చేయాలనుకున్నాను. కానీ మీ వారు...." అని ఆగాడు సుబ్బారావు.

"ఎవరికెలా రాసిపెట్టుంటే అలా జరుగుతుంది. మావారిపట్ల మీకున్న శ్రద్ధకు అభిమానానికి థాంక్స్-" అంది అనసూయ.

"అది సరే—" అంటూ సుబ్బారావామెకో కార్డిచ్చి "ఇది నీకెప్పుడైనా అవసరపడవచ్చు. నా దగ్గరకు రావడానికి సందేహించకు.... నీకు, నీ కుటుంబానికి నావల్ల నయ్యే సాయం నేనెప్పుడైనా చేస్తాను...." అన్నాడు.

"బహుశా ఆ అవసరముండకపోవచ్చు. అయినా కార్డుంచుకుంటాను." అంది అనసూయ.

## 6

"మీరా కృష్ణమూర్తి గురించి ఎందుకంతలా ఆలోచిస్తున్నారో నాకర్థంకావడంలేదు. బెంగపడవలసింది నేను! నా గినీపిగ్ మరో దేశం వెళ్ళిపోవడంతో నేనే గినీపిగ్‌ని కావాల్సొచ్చింది....అందుకు నేను సిద్ధంగానే వున్నాను...." అన్నాడు జయప్రకాష్.

"నా బాధ అదికాదు. కృష్ణమూర్తి మోసపోతున్నారేమోనని నా భయం...." అన్నాడు సుబ్బారావు.

"ఎందుకని?"

"అతణ్ణి పరీక్షించిన డాక్టరెవరో నాకు తెలియడం లేదు. నా అనుమానం అతణ్ణి పరీక్షించిందసలు డాక్టరే కాదేమోనని!" అన్నాడు సుబ్బారావు.

"అదెలా సాధ్యం?" అన్నాడు జయప్రకాష్.

"నాకు తెలిసిన డాక్టరెవరూ అతణ్ని పరీక్ష చేయలేదు. నాకు తెలియని డాక్టరెవరూ అతణ్ని పరీక్ష చేయలేదు...."

"కానీ అతణ్ని ఇటలీ పంపుతున్నారుగా—...."

"సంధ్య ఈ ఇటలీ యెక్కణ్ణించొచ్చింది అని! వైద్యానికి అమెరికా వెడతారు. ఇంగ్లండు వెడతారు. ఫ్రాన్సు వెడతారు....జర్మనీ వెడతారు...."

"ఇటలీ కెందుకు వెళ్ళకూడదు?"

"వెళ్ళొచ్చు. అరుదుగా జరిగే విశేషమిది.... నేను తరచు మెడికల్ జర్నల్సు చూస్తూనే ఉంటాను. ఇలాంటి లక్షణాలున్న వ్యాధి గురించి ఎక్కడ రిఫరెన్సు రాలేదు. ఇటలీలో దీనికి ప్రత్యేకమైన వైద్యముందని అనుకోను. అదీకాక కృష్ణమూర్తిని పరీక్షించిన డాక్టరు-అతడికి రోగనిర్ణయమేం చేశాడో తెలుసుకోవాలి గదా! ఒకే లక్షణాల నిద్దరు డాక్టర్లు రెండురకాల వ్యాధులుగా నిర్ణయించవచ్చును...."

"అయితే నా వైద్యం విషయంలో మీ కనుమానముందా?"

"లేదు. నేను రోగ్ని నిర్ణయించడానికి ముందు ఎందరితోనో సంప్రదించాను. అయినప్పటికీ ఈ డాక్టర్ని కూడా సంప్రదిస్తే బాగుండుననిపిస్తోంది...."

జయప్రకాష్ రవంత కలవరపడ్డాడు—"వీరరాజు గారిని నేను కలుసుకుని మాట్లాడగలను. ఆ డాక్టర్ని మీకు పరిచయం చేయమంటారా?" అన్నాడు.

"అలా చేయడం మీ కూడా యెంతో మంచిది. అవసరమైతే మీరు కూడా ఇటలీ వెళ్ళొచ్చును...." అన్నాడు సుబ్బారావు.

"సరే—ఈ విషయం రీనాకు చెబుతాను—" అన్నాడు జయప్రకాష్.

సుబ్బారావు వెళ్ళిపోయాడు.

జయప్రకాష్ భార్యకు ఫోన్ చేశాడు.

"నేను వీర్రాజు గారిని కంటాక్టు చేసి డాక్టరు గురించి ఏ విషయమూ చెబుతాను—" అంది రీనా

"త్వరగా ఆ డాక్టర్ని మన సుబ్బారావుగారికి పరిచయం చేయాలి. నా వైద్యం ఆలస్య కాకూడదు కదా" అన్నాడు జయప్రకాష్.

ఆ తర్వాత రీనా వీర్రాజుకు ఫోన్ చేసింది విషయం విని ఆయన—"చూడమ్మా! ఆ డాక్టరు అజ్ఞాతంగా ఉండాలనుకొంటున్నాడు. అలాంటప్పుడు పేరు బయట పెట్టడం న్యాయం కాదుకదా!" అన్నాడు.

"డాక్టరు అజ్ఞాతంగా వుండడమెందుకు?"

"ఏవో కొన్ని సెంటిమెంట్సు కారణంగా ఆయన మా సేవాసంస కుచితంగా సాయపడుతున్నాడు. తానిలా పేదలకు సాయం చేస్తున్నట్లు పదిమందికీ తెలియడ మాయన కిష్టంలేదు. ప్రచార మిష్టంలేని మహానుభావుడే అయుండాలి. లేక తనచుట్టూ పేదరోగులీగల్లా ముసురుతారన్న భయమైనా అయుండాలి. ఇంతకీ ఆ డాక్టర్తో మీకేం పని?"

రీనా చెప్పింది.

"డాక్టరు సుబ్బారావుగారి వైద్యానికి తిరుగేముందమ్మా....మీ వారాయనవద్ద నిక్షేపంలా వైద్యం చేయించుకోవచ్చు...."

"అయితే మీరు కృష్ణమూర్తి నిటలీ పంపుతున్నారేం? ఇక్కడే వైద్యం జరిపించొచ్చుగా...."

"పరీక్షలో తేలిందాన్నిబట్టి ఆ నిర్ణయానికొచ్చాం. ఇండియాలో అతడికి వైద్యం లేదు...."

"డాక్టరు సుబ్బారావుగారు చెప్పిన ప్రకారం కృష్ణమూర్తిదీ, మా వారిదీ ఒకే జబ్బు...."

"ఒక్కోసారి పెద్ద వైద్యులు కూడా పొరబడవచ్చు...."

"తను పొరబడితే తప్పు దిద్దుకుంటానని సుబ్బారావుగారంటున్నారు. అందుకే ఆ డాక్టర్ని కలుసుకోవాలని ఆయన తాపత్రయం...."

"ప్రముఖ వైద్యులు పేదల విషయంలో చేసే తప్పులు ....గొప్పవారి విషయంలో చేయరు. నా కా నమ్మక ముంది...."

"డాక్టరు సుబ్బారావుగా రలాంటివారు కాదు...."

"కొన్ని నియమాలకు మినహాయింపు లుండవు...."

"వీర్రాజుగారూ— అవసరమైతే మా వారిని కూడా ఇటలీ పంపాలనుకొంటున్నాం. అందుకు సుబ్బారావుగారూ అంగీకరించారు...."

"అయితే ఓ పని చేద్దాం—" అన్నాడు వీర్రాజు— "మీ వారి పరీక్ష కాగితాలూ, రిపోర్టులూ నాకు పంపండి. నేనా అజ్ఞాత వైద్యుడి కవి చూపిస్తాను. ఆయన తన అభిప్రాయం చెబితే ఆ రిపోర్టు మీ కందజేస్తాను...."

రీనా కిది నచ్చింది. ఆమె అలాగే చేసింది.

ఒకే ఒక్క రోజులో అజ్ఞాత వైద్యుణ్నించి రిపోర్టు వచ్చింది. రీనా ఆ రిపోర్టును సుబ్బారావుకి చూపించింది.

సుబ్బారావా రిపోర్టు చూసి ఆశ్చర్యపోయాడు.

"మీ వారి విషయంలో ఈ అజ్ఞాత వైద్యుడు నాతో పూర్తిగా ఏకీభవించాడు—" అన్నాడు.

రీనా నిట్టూర్చి—"హమ్మయ్య—అయితే మీరిక మావారికి వైద్యం ప్రారంభించవచ్చు—" అంది.

"నేనాలోచిస్తున్న విశేషమదికాదు. ఇంత కచ్చితంగా అజ్ఞాత వైద్యుడు నా అభిప్రాయాలతో ఏకీభవించడం—కేవలం రిపోర్టులను చూడ్డంవల్ల జరుగదు. నా అభిప్రాయం వీర్రాజుకు తెలిసైనా వుండాలి. ఆ అజ్ఞాత వైద్యుడు నాకు తెలిసినవాడైనా అయుండాలి...."

"అవన్నీ మనకెందుకు? ప్రస్తుతానికి మన సమస్య తీరిందిగా...." అంది రీనా.

"సమస్య పూర్తిగా తీరినట్లుకాదు. నాకు తెలిసి మీ వారిదీ, కృష్ణమూర్తిదీ—ఒకేలాంటి కేసు. ఈ విషయంలో నేను క్షుణ్ణంగా పరీక్షలు చేశాను. నా పరీక్షలో లోపముందా? కృష్ణమూర్తి జబ్బును మీవారి జబ్బునుంచి వేరుచేసే ఆ లోపమేమిటి?"

రీనాకు విసుగొచ్చింది. ఆ విసుగును కప్పిపుచ్చుకుందుకు ప్రయత్నిస్తూ "అదెప్పుడైనా తెలుసుకోవచ్చు" అంది.

డాక్టరు సుబ్బారావు తల అడ్డంగా వూపాడు—"ఒకేలాంటి రెండు కేసుల్ని పరీక్ష చేసి—రెండూ ఒకటేనని నేను రోగనిదానం చేశాను. కానీ నావల్ల ఏదో లోపం జరిగి కృష్ణమూర్తి విషయంలో నా రోగనిదానం తప్పయింది. అలాంటి తప్పే ఆ అజ్ఞాత వైద్యుడివల్లకూడా జరిగి మీవారి విషయంలోకూడా అతడి రోగనిదానం తప్పయితే? నేనే తప్పుచేసినప్పుడతడూ తప్పుచేసే అవకాశముంది. అందుకే ఆ అజ్ఞాత వైద్యుణ్ణి కలుసుకోవాలనుకుంటున్నాను...."

"అది సాధ్యం కాకపోతే మావారికి వైద్యం ప్రారం

భించరా?"

"ప్రారంభిస్తాను. కానీ రిస్కుంటుందేమోనని భయ పడుతున్నాను ..."

రీనా సుబ్బారావును జయప్రకాష్ దగ్గరకు తీసుకుని వెళ్ళి అతడి భయం గురించి వివరించింది.

"మీ వైద్య నిదానంపై నాకు నమ్మకముంది...." అన్నాడు జయప్రకాష్ అంతా విన్నాక.

"ముందే చెప్పాను మీకు. మీకు నామీదున్న నమ్మకం నాకూ నామీదుండాలని...." అన్నాడు సుబ్బారావు.

"సుబ్బారావుగారూ! మీకూ మీ వైద్యంపై అప నమ్మకంలేదు. మీ మనసులో ఇంకేదో వుంది—" అన్నాడు జయప్రకాష్.

"చాలా కరెక్టుగా చెప్పారు...." అన్నాడు సుబ్బా రావు.

"ఏమిటి—మిమ్మల్ని బాధిస్తున్న సందేహం?"

"కృష్ణమూర్తి నిజంగా ఇటలీ వెడుతున్నాడా అని!"

"వెళ్ళకపోతే ఏం చేస్తాడు? ఇండియాలో వీరా జత జ్నేం చేసుకొంటాడు?" అన్నాడు జయప్రకాష్.

"అది తెలుసుకోవాలనే నా కుతూహలం...."

"అంతవరకూ నాకు వైద్యం చేయరా?"

"చేయడానికి నాకభ్యంతరంలేదు. కానీ నాకు తృప్తిగా ఉండదు...."

రీనా సాలోచనగా—"మరోసారి వీరాజుగారిని కంటాక్టు చేస్తాను...." అంది.

"అదే మంచిది—" అన్నాడు సుబ్బారావు.

అయితే మర్నాటికల్లా సుబ్బారావు సందేహాలు పటాపంచలైపోయాయి.

రమణ సేవాసంస్థద్వారా—వైద్యం గురించి కృష్ణమూర్తి ఇటలీ వెడుతున్న విశేషం వార్తగా ఫోటోలతో సహా వార్తాపత్రికల్లో వచ్చింది. ఎయిర్ పోర్టులో వీర్రాజా, కృష్ణమూర్తిల ప్రత్యేకమైన ఫోటోకూడా వచ్చింది.

డాక్టరు సుబ్బారావు జయప్రకాష్‌కు వైద్యం ప్రారంభించాడు.

# 7

"నెక్స్!" అన్నాడు సుబ్బారావు.

లోపలకు ప్రవేశించిందో యువతి.

సుబ్బారావామెను చూసి ఆశ్చర్యపోయాడు. ఆమె అనసూయ. కృష్ణమూర్తి భార్య....

"ఏమయిందమ్మా?" అన్నాడు సుబ్బారావు.

"నేను వైద్యంకోసం రాలేదు—" అందామె.

"ఊఁ" అన్నాడు సుబ్బారావు.

ఆమె ఓ కవరు నతడి ముందుంచి—"ఇది వారు ఇటలీ నుండి వ్రాసిన ఉత్తరం—" అంది.

"అయితే?"

"మీరొకసారి చదవండి—" అంది అనసూయ.

"ఎందుకు?"

"ఒకరోజంతా వారు రోమ్ నగరంలోని విశేషాలు చూశారు. ఆ సంతోషంలో, ఉత్సాహంలో తన జబ్బు సంగతికూడా మర్చిపోయారు...."

"అయితే?"

"ఇందులోని విశేషాలు చదివితే మీకు వారు నిజంగా ఇటలీ వెళ్ళారా అన్న అనుమానం తీరిపోతుంది—...."

"మామ్మా — నేనితరుల ఉత్తరాలు చదవను.

అందులోనూ భర్త భార్యకు రాసేది చూడనుకూడా చూడను. మీవారిటలీ వెళ్ళారని నేను నమ్ముతున్నాను."

"మీరీ ఉత్తరంకూడా చదవాలి—...."

"ఎందుకు?"

"వారు నాకు వ్రాశారు — ఈ ఉత్తరం మీకు చూపించమని!"

సుబ్బారావు నొసలు చిట్లించి — "ఎందుకు?" అన్నాడు.

"మీరు తనకు చాలా సాయం చేశారట. మీకు శ్రమ తప్పించాలనే తను రమణ సేవాసంస్థద్వారా విదేశ వైద్యానికి వెళ్ళారుట. మీవల్ల ప్రయోజనం పొందక పోయినా మిమ్మల్ని చిరకాలం గుర్తుంచుకుంటామని వ్రాశారు. ఈ ఉత్తరం మీకు చూపించమని మరీ మరీ వ్రాశారు...."

కానీ—భార్యాభర్తల ఉత్తరాలు....?!" అన్నాడు సుబ్బారావు.

"డాక్టరుగారూ! ఈ ఉత్తరాన్నిలాగూ రహస్యంగా ఉంచడం కుదరదు. రమణ సేవాసంస్థ ఈ ఉత్తరానికి ఫోటో కాపీలు తీసుకున్నారు. కాబట్టి మీరు చదవ: డానికి తటపటాయించకండి...."

సుబ్బారావు మారు మాట్లాడకుండా ఉత్తరం చదివాడు.

తన ప్రయాణపుటనుభవాలు, రోమ్‌నగర విశేషాలు విపులంగా, అందంగా వివరించాడు కృష్ణమూర్తి. ఆ ఉత్తరంలో రెండేసి వాక్యాలకోసారి రమణ సేవాసంస్థను పొగిడాడు. మధ్యలో సుబ్బారావు గురించిన ప్రసక్తి కూడా వుంది.

ఈ ఉత్తరాన్ని వీర్రాజు తన సంస్థ ప్రచారానికి వాడుకుంటాడని సుబ్బారావు కర్థమయింది. కృష్ణమూర్తి వైద్యానికో యాభై వేల రూపాయలు ఖర్చయితే అతడికి వచ్చే చందాలు లక్షల్లో వుండవచ్చు. కానీ—ఒక సత్కార్యం సత్కార్యం కాకుండా పోదు.

దేశంలో సేవాసంస్థలు చాలా ఉన్నాయి.

మన జనాభా ఎక్కువ. రోగాలూ ఎక్కువే!

కానీ సేవాసంస్థలన్నీ ఒక్కటైతే — పేదలను రోగాలబారినుండి కాపాడ్డం—ప్రమాదకరమైన రోగాల కూడా ఉచిత వైద్య సౌకర్యాన్నందచేయడం— అసాధ్యం కాదు.

కానీ అలా జరగడంలేదు.

వీర్రాజు కృష్ణమూర్తి విషయంలో ప్రత్యేకమైనశ్రద్ధ తీసుకున్నాడు ఎందుకు?

"మీ వారికి నేనసుకుంటున్న జబ్బొకటి .... రమణ సేవాసంస్థ డాక్టరు చెప్పిన జబ్బు వేరొకటి! ఇదొక్కటే నన్ను కలవరపరుస్తోంది తప్పితే వైద్యం గురించి మీ వారికి ఇటలీ వెళ్ళే అవకాశం కలిగించినందుకు నాకు చాలా సంతోషంగా వుందమ్మా.... కానీ నాకీ వార్త చెప్పడానికి చాలా శ్రమ తీసుకుని వచ్చావు...."

"ఇందులో శ్రమేముంది డాక్టరుగారూ! ఎంతో శ్రమ తీసుకుని వీర్రాజుగారు మా వారిని వైద్యం గురించి ఇటలీ పంపారు. వారి సేవాసంస్థను మీరనుమానిస్తున్నారు. నాకు చేతనైనంతలో మీలోని అనుమానాన్ని తొలగించాలనిపించింది ."

"ఇప్పుడు నాకింకే అనుమానమూ లేదు—" అన్నాడు సుబ్బారావు. అతడి చేతిలోని కృష్ణమూర్తి ఉత్తరపు

కాగితం — ఇంపోర్టెడ్ క్వాలిటీదని చెప్పకనే తెలు స్తోంది. అతడిముందు బల్లమీదున్న కవరుమీద ఇటలీ దేశపు తపాలాబిళ్ళ, ముద్రకూడా వున్నాయి. అయినప్ప టికీ సుబ్బారావు అనసూయను సంతృప్తిపరచేందుకే తనకే అనుమానమూ లేదని ఒప్పుకున్నాడు.

కానీ అనసూయ.... ఒక్క క్షణమాగి — "నాకిప్పుడు చాలా సంతోషంగా ఉంది—...." అంది.

"ఎందుకు?" అన్నాడు సుబ్బారావాశ్చర్యంగా.

"నేనీ ఉత్తరాన్ని మీకు చూపడానికి కారణమేమి టంటే — మావారు నిజంగానే ఇటలీ వెళ్ళారని తెలుసు కునేందుకిది సరిపోతుందేమో తెలుసుకుందామని!" అందామె. ఆమె గొంతులో తడి వుంది.

"అంటే?"

"మీరనుమానం వెలిబుచ్చి నప్పట్నించీ నాకూ భయంగా వుంది. మాకింత అదృష్టమా అని నమ్మలేక— అర్థంలేని అనుమానాలతో సతమతమవుతున్నాను. మీ రిప్పుడీ మాటలన్నాక నాకు తృప్తిగా వుంది. డాక్టరు గారూ! మీరు మంచివారు. మీది మంచి మనసు. మా వారు త్వరలోనే ఆరోగ్యంగా తిరిగివస్తారని ఒక్క మాట చెప్పండి. సంతృప్తిగా వెళ్ళిపోతాను—" అంది అనసూయ.

అప్పుడామెకు ఆగకుండా ఏడుపు వచ్చింది.

సుబ్బారావామెను ఓదార్చాడు.

ఆమె వెళ్ళిపోయాక—ఓ నంబరు తిప్పి — "హాలో డిటెక్టివ్ వెంకన్నగారేనా?" అన్నాడు.

"అవును—...." అందవతల గొంతు.

సుబ్బారావు తన్నుతాను పరిచయం చేసుకుని కృష్ణ

మూర్తి విషయంలో జరిగిందంతా చెప్పి — "వీర్రాజు విషయం నాకనుమానంగా వుంది. మీరు పరిశోధించాలి. ఆయనకు కృష్ణమూర్తితో ఏర్పడిన అవసరమేమిటి? రమణ సేవాసంస్థ నమ్మతగినదేనా? ఆ సంస్థ ఇతర కార్యకలాపాలేమిటి?....వగైరాలన్నీ మీరు తెలుసుకోవాలి. మీకు నేను కోరిన ఫీజిచ్చుకుంటాను...." అన్నాడు.

"మీకు వీర్రాజుమీద అపనమ్మకమెందుకు?"

"కృష్ణమూర్తిని ఇటలీ వెళ్ళమని రికమెండు చేసిన డాక్టర్ని అజ్ఞాతంగా వుంచడం, కృష్ణమూర్తి కుటుంబానికి సదుపాయాలు చేయడం, అనుమానించే నన్ను నమ్మించడానికై—కృష్ణమూర్తి భార్యనుత్తరంతోసహా పంపడం ఇవి చాలవంటారా?"

"చాలు....కానీ ఈ కేసుమీద మీకాసక్తి ఏమిటి? ఇందు గురించి మీరు పరిశోధనకై డబ్బుకూడా ఖర్చు చేయాలనెందుకు అనుకుంటున్నారు?"

"ఎందుకంటే— నేను డాక్టర్ని కనుక! కృష్ణమూర్తికి నేను రోగ నిర్ధారణ చేశాను. ఇండియాలో అతడికి నేను తప్ప ఇంకెవ్వరూ వైద్యం చేయలేరని నా గట్టినమ్మకం. ఇటలీలో అతడికి సరైన వైద్యం జరుగుతుందని నా కనిపించడంలేదు. సులభంగా వైద్యం చేసే డాక్టరిక్కడుండగా— కాదని అతణ్ని ఇటలీ పంపడం— నాకెన్నో అనుమానాలను కలిగిస్తోంది. ఆ అనుమానాలను మీ పరిశోధనే తీర్చాలి...."

"అది సరే — .... కృష్ణమూర్తి కేసైతే మాత్రం మీకేం నష్టం? అంతా స్వయంకృతాపరాధమని సరిపెట్టుకుంటే మంచిది...."

"వెంకన్నగారూ! డాక్టరుగా నా బాధనర్థం చేసుకోండి. గ్యారంటీగా నేను కృష్ణమూర్తికి నయం చేయగలను. అతణ్ని ఇటలీ పంపించి వీరరాజా పెద్ద అన్యాయం చేశాడని నా అనుమానం. కృష్ణమూర్తికక్కడ గానీ యేదైనా అయితే—రమణ సేవాసంస్థ ఆశయాలెటువంటివైనా—ఎంత గొప్పవైనా—అది హత్య అవుతుంది. వృత్తికంకితమైన యే డాక్టరుకైనా—ఒక రోగిని నయంచేసే అవకాశం వదులుకోవడం బాధగానే వుంటుంది. అదే రోగి మరో డాక్టరు చేతిలో ప్రాణాలు కోల్పోతే — అది నాబోంట్లకు భరించ శక్యంకాని విశేషం. వెంకన్నగారూ! మీరీ కేసు పరిశోధించి నిజానిజాలు తెలుసుకోండి. అంతా శుభమే జరిగి కృష్ణమూర్తి బాగుపడితే—డాక్టరుగా నేను మరిన్ని కొత్త విశేషాలు తెలుసుకోగలుగుతాను. అయితే అలా జరుగుతుందని నాకు తోచటంలేదు...." అన్నాడు సుబ్బారావు.

# 8

డిటెక్టివ్ వెంకన్న వెంటనే రంగంలోకి దిగాడు. అయితే అతడు తనీ కేసుతో ప్రత్యక్ష సంబంధం పెట్టుకోలేదు. తనకు తెలిసి వారిద్వారా వీరరాజు గురించీ రమణ సేవా సంస్థ గురించీ వాకబు చేయించాడు.

రమణ సేవాసంస్థ స్థాపించి ఏడాది కూడా కాలేదు. సంస్థద్వారా కొన్ని మంచి పనులు జరిగాయి. ప్రత్యేకించి చెప్పుకోతగ్గ విశేషం — ఇటీవల కృష్ణమూర్తిని ఇటలీ పంపడమే! ఈ సంఘటనతో సంస్థకు చాలా పేరు వచ్చింది. పదిమందికీ సంస్థ గురించి తెలిసింది. చందాలు కూడా బాగా వసూలవుతున్నాయి.

సంస్థ వ్యవస్థాపకుడు వీరరాజా గతచరిత్ర అంత మంచిది

కాదు. ఆయనకు పిల్లలు లేరు. ఓ బంధువుల కుర్రాడిని పెంచుకుంటున్నాడు. భార్య రెండో పెళ్ళికి ఒప్పుకున్నా ఆయన చేసుకోలేదు.

వీర్రాజుకు సంఘవిద్రోహక శక్తులతో పరిచయమున్నట్లు దాఖలాలున్నాయి. అయితే ఏ నేరమూ ఋజువు కాలేదు. ఆయన జైలుకు వెళ్ళలేదు. ఆయనకు చిన్న చిన్న వ్యాపారాలు, కొద్దిగా భూములు వున్నాయి. కానీ ఆదాయం చాలా ఎక్కువ. అదెలా వస్తోందీ అంటే చెప్పడం కష్టం.

ఏణ్ణర్థం క్రితం వీర్రాజు పెంపుడు కొడుకు ప్రమాదవశాత్తూ మరణించాడు. అప్పుడాయనకు విరక్తిభావం కలిగింది. కొడుకు పోయిన ఆర్నెల్లలో ఆయన సేవాసంస్థ ప్రారంభించాడు.

ఈ వివరాలన్నీ వెంకన్న రెండు రోజుల్లో సేకరించాడు. వాటినిబట్టి కృష్ణమూర్తిని ఇటలీ పంపడమొక పెద్ద విశేషంగా అతడికి తోచలేదు.

ఏ సంస్థకైనా పేరు తెచ్చుకునేందుకు అవకాశం కావాలి. కృష్ణమూర్తి జబ్బు—రమణ సేవాసంస్థకు వచ్చిన బంగారు అవకాశం. వారది వినియోగించుకున్నారు.

ఇప్పుడు కృష్ణమూర్తి గనుక పూర్తిగా నయమై వెనక్కు తిరిగివస్తే—రమణ సేవాసంస్థకు లభించే ప్రచారమింతా అంతా కాదు.

వెంకన్న అసిస్టెంట్సులో ఒకరైన రాజమ్మ—అనసూయతో స్నేహం ప్రారంభించింది. తరచుగా రాకపోకలతో—అనసూయకు తెలియకుండానే చాలా విశేషాలు సేకరిస్తూండేది. వాటిలో ఒక్కటి కూడా వెంకన్న

పరిశోధనకు పనికి వచ్చేవి కావు.

ఒక రోజున రాజమ్మ వెళ్ళేసరికి అనసూయ ఏడుస్తోంది.

"ఏం జరిగింది?" అంది రాజమ్మ ఆశ్చర్యంగా.

ఏం జరిగిందో చెప్పడానికి అనసూయకు కాసేపు పట్టింది. అది విని రాజమ్మ షాక్ తింది.

కృష్ణమూర్తిది ప్రమాదకరమైన ఆపరేషను. ఆపరేషను కభ్యంతరం లేదని ముందుగానే కృష్ణమూర్తివద్దా, అనసూయవద్దా కాగితాలు రాయించుకున్నారు.

ఆపరేషన్ జరిగింది.

కృష్ణమూర్తి చనిపోయాడు.

అనసూయ ఏడుస్తోంది.

"కబురెలా తెలిసింది?" అంది రాజమ్మ.

ఎలా తెలిసిందీ చెప్పడానికి అనసూయకు మళ్ళీ కాసేపు పట్టింది.

వీర్రాజు తను రాకుండా మనిషి ద్వారా కబురు పంపాడు.

అంతకుముందు అనసూయ చాలాసార్లు డాక్టరు సుబ్బారావు అనుమానం గురించి రాజమ్మకు చెప్పివుంది. అందుకని రాజమ్మ."మీ వారు చనిపోయుండరు. వీర్రాజుగారేదైనా నాటకమాడుతున్నారేమో!" అంది.

"అలాంటి ఆశలేమీ లేవు...."

"ఆశ్చర్యపడకు. వీర్రాజుకు మీ వారివల్లనయ్యే పనేదో వుంది. ఇటలీ అన్నాడుగానీ అక్కడికి పంపి వుండడు. నీ నుంచి గొడవలేకుండా ఉండడం కోసం నీ కాస్త డబ్బిచ్చాడాయన ఇప్పుడు మీ వారు పోయారంటున్నాడు. ఇంక నువ్వేం చేయగలవు? మనం

ఏ డిటెక్టివ్ కైనా చెప్పి ఈ విషయం ఆరా తీయిద్దాం" అంది రాజమ్మ.

"అలా ఆశపడ్డానికి లేదు. ఇటలీ నుంచి వారి శవం రేపు ఇండియాకు చేరుకుంటుంది" అంది అనసూయ.

"శవమా?"

"అవును. దహన సంస్కారా లిక్కడే జరగాలి కదా! వీర్రాజుగారు శవాన్నిక్కడకు రప్పిస్తున్నారు" అంటూ భోరున ఏడ్చింది అనసూయ.

రాజమ్మ ఇంకేమీ మాట్లాడలేదు.

## 9

పేపర్లో రమణ సేవాసంస్థ గురించి మొదటి పేజీలో వచ్చింది.

ఒక సామాన్యుడిని సామాన్య రోగం నుంచి కాపాడ్డానికి—ఇటలీలో ఆపరేషన్ ఏర్పాట్లు చేయించడమే ఒక పెద్ద విశేషం! ఆ ఆపరేషన్ ఫెయిలై అతడు చనిపోతే ఆ శవాన్ని వెనక్కు రప్పించి—అయినవారి కప్పగించటం—ఇంకా పెద్ద విశేషం...

శవం కంటె ముందు వార్త వచ్చింది.

సామాన్యుడి ప్రాణాలకే కాదు—శవానికి కూడా ప్రాముఖ్యత నిచ్చిన సంస్థ రమణ సేవాసంస్థ. మధ్యతరగతి సెంటిమెంట్లకు విలువ నిచ్చిన సంస్థ రమణ సేవాసంస్థ....

ఆ రోజు దినపత్రికల్లో మొదటి పేజీల్లో వీర్రాజు ఫోటోని చాలామంది ఉదయం లేచీలేవగానే చూశారు.

ఆ రోజు మధ్యాహ్నానికల్లా అనసూయ శవాన్ని రిసీవ్ చేసుకుంది. అందుగురించా మెను ప్రత్యేకంగా హైదరాబాదు తీసుకుని వెళ్ళాడు వీర్రాజు.

ఒక కారులో అనసూయ, ఆమె ఒడిలో చంటిపాప, పక్కనే భర్త శవం....

శవం వాసన వేయకుండా ఐసులో పెట్టబడింది.

ముందు వీర్రాజు, డ్రయివరు.

కారు హైదరాబాదు వదిలి పెట్టింది.

ఆ కారును కాస్త దూరంగా వెంబడిస్తోంది ఒక పోలీసు జీపు.

వీర్రాజు జీపును గమనిస్తున్నాడు.

ఆయనా జీపును ఎయిర్ పోర్టు వద్ద చూశాడు. తన కారు బయల్దేరాక కూడా చూశాడు.

ఇప్పుడాయనకిక సందేహం లేదు—ఆ జీపు తమనే వెంబడిస్తోంది!

“డ్రయివర్ కారాపు” అన్నాడు వీర్రాజు.

కారాగింది.

వీర్రాజు కారు దిగి పోలీసు జీపు దగ్గరకు రాగానే తనూ ఆపి “మీ రెక్కడిదాకా ప్రయాణం?” అనడిగాడు.

“విజయవాడ” అని సమాధానం వచ్చింది.

“అలాగా” అన్నాడు వీర్రాజు.

“మీ రెక్కడిదాకా?” జీపులోని పోలీసు అడిగాడు.

“విజయవాడే!” అని అబద్ధమాడాడు వీర్రాజు.

“మాతో మీకేమైనా పనుందా?” జీపులోని పోలీసు అడిగాడు.

“నేనూ మిమ్మల్నదే అడుగుదామనుకుంటున్నాను....”

“అంటే?”

“హైదరాబాదు ఎయిర్ పోర్టు నుంచీ మీరు నా వెంబడే వస్తున్నారు. నాతో ఏదైనా పనుందేమోనని

అనుమానం వచ్చింది" అన్నాడు వీర్రాజు.

"అనుమానించదగ్గ తప్పేదైనా చేశారా మీరు?"

"చేశాను" అన్నాడు వీర్రాజు.

"ఏమిటది?"

"ఒక సామాన్యుడి శవాన్ని దహన సంస్కారార్థం ఇటలీ నుంచి రప్పించి ఇండియాలోని అతడి భార్యకప్పగించాను."

"ఓహ్-మీరు వీర్రాజుగారు కదూ! మీ ఫోటో ఈ రోజు పేపర్లో ఉదయమే చూశాను. క్షమించాలి సార్!" అన్నాడు పోలీసు.

"మేము మీ వెనకాలే వస్తే మీకు రక్షణ కూడా! ఇందులో తప్పేముంది?" అన్నాడింకో పోలీసు.

"మీకేదైనా అనుమానముంటే వెంటనే నా కారు చెక్ చేయండి. కానీ ఇలా వెంబడి వస్తూంటే చూసేవాళ్ళకేదోలా వుంటుంది. నాకూ బాగుండదు" అన్నాడు వీర్రాజు.

"మీవంటి వారిని శంకించి చెక్ చేసే స్థితికి మా పోలీసు శాఖ ఇంకా దిగజారిపోలేదు సార్.... మీ మనసు కష్టపెడితే అయాం సారీ" అన్నాడా పోలీసు.

పోలీసు జీపు ముందుకు వెళ్ళిపోయింది.

వీర్రాజు జరిగింది అనసూయకు చెప్పాడు.

అనసూయ కాయన చెప్పింది బుర్ర కెక్కలేదు. ఆమె కంతా అయోమయంగా వుంది. భర్త శవం ఆమె దుఃఖాన్ని పెంచుతోంది.

కారు బయల్దేరింది.

ఆ వెనుకే కాస్త దూరంలో వెంకన్న కారు వస్తోంది. ఆ కారు గురించి వీర్రాజంతగా పట్టించుకోలేదు. ఎందు

కంటే వెంకన్నప్పుడు మారువేషంలో వున్నాడు. ఆ కారతడి స్వంతం కాదు.

పోలీసుజీపు దగ్గర జరిగిన సంభాషణ వాకీటాకీ సాయంతో వెంకన్న విన్నాడు.

నిజానికా పోలీసులు నిజం పోలీసులుకారు. వేష ధారులు....

వెంకన్న వారిని నియోగించాడు.

వీర్రాజు ప్రవర్తనలో అనుమానించతగ్గ విశేషాలుంటే కారంతా సోదా చేయించాలనుకున్నాడు, కానీ వీర్రాజు సోదా గురించి తనే ఆఫర్ చేశాడు. నిజాయితీగల పెద్ద మనిషిలా ప్రవర్తించాడు. సోదా చేయడంవల్ల పోలీసు డిపార్టుమెంటుకు చెడ్డపేరొస్తుంది.

డాక్టరు సుబ్బారావు అనుమానం నిరాధారమైనది కావచ్చు.

కాసేపటి తర్వాత వెంకన్న వీర్రాజు కారుని దాటి ముందుకు వెళ్ళిపోయాడు.

అతడి వెనుకే ఇంకో కారుంది. అదీ వీర్రాజు కారు ననుసరిస్తోంది. అందులోనూ వెంకన్న నియోగించిన మనుషులున్నారు. వారు వీలుచూసుకుని కారు నటకాయించి దోచుకునేందుకు ప్రయత్నిస్తారు. ఆ ప్రయత్నంలో కారంతా సోదా చేస్తారు—శవంతో సహా! తర్వాత వీర్రాజు గొప్పతనం తెలుసుకుని అతడికి నమస్కరించి తప్పును క్షమించమని వెళ్ళిపోతారు. ఇదీ వెంకన్న ప్లాను.

కానీ ఈ పథకం జయప్రదం కాలేదు.

వెంకన్న మనుషులు కారు నటకాయించగానే ఎక్కణ్ణించో నలుగురు మనుషులు వచ్చి వాళ్ళను తన్ని

పంపించారు.

ఈ విషయం వెంకన్నకు చాలా ఆశ్చర్యం కలిగించింది.

వాళ్ళెక్కడ్నించి వచ్చారు? ఎలా వచ్చారు?

వీర్రాజు దారి పొడుగునా తనకు రక్షణ ఏర్పాటు చేసుకున్నాడా?

అంటే అతడు నిజంగానే నేరస్థుడా?

## 10

కృష్ణమూర్తి శవం స్మశానంలో కాలి బూడిదయింది. పుర ప్రముఖు లెందరో వచ్చి ఆ దృశ్యం చూశారు.

వారిలో వెంకన్న, డాక్టర్ సుబ్బారావు కూడా వున్నారు.

పోలీసాఫీసర్లు కొందరా దృశ్యాన్ని చూడ్డాని కొచ్చారు.

ఉన్నట్లుండి ఒక వ్యక్తి తన జేబులోంచి పర్సును తీసి బూడిదలోకి విసిరాడు.

"ఏమిటిది?" అన్నారెవరో.

"అరే—చందనపు పొడి పొట్లాన్ని విసురుదామను కుని పర్సును విసిరేశాను. వెళ్ళి తెచ్చుకుంటాను...." అన్నా డా వ్యక్తి. అతడు బూడిద వైపు నడుస్తుండగా "ఆగు ఎముక లేరుకునే దాకా ఆ బూడిదను తాకడానికి లేదు" అన్నాడు వీర్రాజు.

"నా పర్సులో ఆరువందలున్నాయి. తర్వాతవి పోతేే?" అన్నాడా వ్యక్తి.

"పోతే ఆ డబ్బు నేనిస్తాను. ఇంత వ్యవహారం నడిపించి చివర్లో సెంటిమెంటు పాడుచేయడం నా కిష్టం లేదు" అన్నాడు వీర్రాజు.

ఆ వ్యక్తి ఊరుకున్నాడు.

అప్పుడు వెంకన్న ముందుకు వచ్చి "అందరూ నన్ను మన్నించాలి. ఇప్పుడు బూడిదలోనికి విసరబడ్డ పర్సులో స్మగుల్డు వజ్రాలున్నాయి. వాటి విలువ పాతిక లక్షలుంటుంది. నేనీ వ్యక్తిని చాలా సేపట్నుంచి గమనిస్తున్నాను అతడు నాకు భయపడి తాత్కాలికంగా వాటి నక్కడ దాచుకున్నాడు" అన్నాడు.

అక్కడున్న పోలీసాఫీసర్లలో చలనం ప్రారంభమయింది. వీర్రాజెంత వారించినా ప్రయోజనం లేకపోయింది.

వెంకన్న, పోలీసులు—బూడిదలో వెతకడం మొదలుపెట్టారు.

పర్సు ముందుగా దొరకలేదు. కానీ ఆ బూడిదలో వారికి పధ్నాలుగు చిన్న చిన్న సంచులు దొరికాయి. అందులో పన్నెండు సంచులలో మాదక ద్రవ్యాలున్నాయి. రెండు సంచులలో వజ్రాలున్నాయి.

తర్వాత పర్సు కూడా దొరికింది.

పర్సులో అరువందల రూపాయలు మాత్రమే ఉన్నాయి.

పర్సును బూడిదలో వేయడం వెంకన్న పథకంలో ఒక భాగం. కనపడినా గమనించకుండా బూడిదను వెదికి ఆఖరున పర్సు తీయడం కూడా వెంకన్న పథకం.

అయితే బూడిదలో లక్షల విలువైన మాదక ద్రవ్యాలు, కోట్ల విలువచేసే వజ్రాలు దొరుకుతాయని అతడు కూడా ఊహించలేదు.

"ఇలా జరుగుతుందని నా ఊహకందలేదు—" అన్నాడో పోలీసాఫీసరు.

"నా ఊహాకు అందలేదు, కానీ ఎలా జరిగిందో చెప్పగలను...." అన్నాడు వెంకన్న.

కృష్ణమూర్తి మనిషిగా ఇటలీ వెళ్ళింది వైద్యానికి కాదు. శవంగా మారడానికి. వీర్రాజు గొడవలు రాకుండా ఉంటాయని కాదరబందీ లేని పేదవాడినందుకెన్నుకున్నాడు. అతని కుటుంబానికన్ని రక్షణలూ కలిగించాడు. తన సేవాసంస్థ ప్రచారం—సమాజంలో పెద్దమనిషన్న పేరు....

ఇటలీలో జరిగిన అపరేషను—మాదక ద్రవ్యాలు, వజ్రాలు—ఉన్న సంచుల్ని కృష్ణమూర్తి శరీరంలో ప్రవేశపెట్టడానికే! ఆ సంచులు ప్రత్యేకమైన ఫైర్ ప్రూఫ్ ప్లాస్టిక్‌తో తయారుచేయబడ్డాయి. అందుకే శవం కాలినా—ఆ సంచులు బూడిదలో మిగిలిపోయాయి. ఎంతో పకడ్బందీగా యెవరూ కనుక్కోలేని విధంగా స్మగ్లింగు గురించి వీర్రాజు వేసుకున్న పథకం చివరి క్షణాల్లో బెడిసికొట్టింది.

వీర్రాజు వెంటనే కస్టడీలోకి తీసుకోబడ్డాడు. ఆ తర్వాత రమణ సేవాసంస్థ బండారమంతా బయటపడింది.

పోలీస్ కమీషనర్ స్వయంగా వెంకన్నను పిలిచి—"వెంకన్నగారూ! పోలీసు డిపార్టుమెంటుకు చెడ్డ పేరు రానివిధంగా అన్ని శ్రద్ధలూ తీసుకుని—ఓ పెద్ద స్మగ్లింగు ముఠాను పట్టిచ్చారు. మీ మేధాశక్తికి నా జోహార్లు—" అంటూ అభినందించాడు.

"ఇందులో నాదేమీ లేదు....ఒక డాక్టర్ తన వృత్తిపట్ల పాటించిన ధర్మం—ఇంతకు దారితీసింది...."

అన్నాడు వెంకన్న.

దేశంలో అవినీతి నశించాలంటే, దుర్మార్గాలు బయట పడాలంటే ప్రజలు నిజాయితీతో వృత్తిధర్మాల్ని పాటించాలి.

కానీ....

తమ సంరక్షణకై తామెనుకున్న ప్రజానాయకులే వృత్తిధర్మాన్ని పాటించనప్పుడు__దేశంలోని సేవా సంస్థలే__స్మగ్లింగుకు నిలయాలు కావడంలో ఆశ్చర్యమేముంది?

—: అయిపోయింది :—

# పాములా పెంచుకున్న ద్వేషం

ఎ. యస్. రావ్

గోడగడియారం ఒక్కసారి చప్పుడు చేసింది. ఏకాగ్రతతో టైప్ చేస్తున్న రూప ఉలిక్కిపడింది. అప్రయత్నంగా గడియారం వైపు చూసింది. అయిదున్నర. అందరూ వెళ్ళిపోయినా, అరగంట ఆలస్యమైనా తను టైప్ చేస్తూనే వుంది.

"మిస్ రూపా, ఈ స్టేట్ మెంట్ ఇవాళ పోస్టులో వెళ్ళితీరాలి. కవరింగ్ లెటర్ మీద సంతకం చేసి వుంచాను. స్టేట్ మెంట్ టైప్ చేసి, లెటర్ అటాచ్ చేసి, ఈ కవర్లో పెట్టి అతికించేయి. కుమార్ పోస్టు చేస్తాడు. ఆఫీసు తాళాలూ అతనే మా ఇంటికి పట్టుకొస్తాడు" ప్రొప్రయిటర్ గోపాల్రావు ఉత్తర్వు ఆమెకి గుర్తొచ్చింది.

ఉద్యోగంలో చేరిన మూణ్నెళ్ళకే తన జీతం వంద రూపాయలు పెంచిన ప్రొప్రయిటర్ మాటని కాదనలేక పోయింది తను. ఆఫీస్ బాయ్ కుమార్ టీ తాగి రాక

డానికి వెళ్ళాడు. మరో పదిహేను నిమిషాలు. తన పని పూర్తవుతుంది....

రూప స్టేట్‌మెంట్ చివరిపేజీ టైప్ చేయడం ప్రారంభించింది. ఎదురుగా, సీనియర్ ఎకౌంటెంట్ టేబుల్ మీదున్న టెలిఫోన్ మోగడం ప్రారంభించింది. రూప లేవలేదు. కాసేపు మోగి అదే ఆగిపోయింది. అర నిమిషం తరువాత మళ్ళా మొండిగా మోగడం ప్రారంభించింది. పని పూర్తయిందేమో కనుక్కోడానికి ప్రొప్రయిటర్ రింగ్ చేస్తూ వుండొచ్చు. రూప ఆదరా బాదరా లేచి, రిసీవర్ని అందుకుంది.

"డీలక్స్ కార్పొరేషన్...."

"రూపా?" అపరిచిత కంఠం కీచుగా ధ్వనించింది.

"యస్. ఎవరు?"

"మిస్ రూపలత?"

"ఔను. మీరెవరు?"

"మిస్ రూపలతాదేవి!" కీచుకంఠం.

"ఎవరు మీరు?" రూప విసుగూ, ఆశ్చర్యం ధ్వనించే కంఠంతో అడిగింది.

"చెప్తాను. రత్నగిరి రూపలతాదేవి .... అవునా? రైట్! అతి ముఖ్యమైన విషయం గురించి నీతో మాట్లాడాలి. తొమ్మిదింటికి నీ గదికి వస్తాను. రెడీగా వుండు!"

రూప ఉలిక్కిపడింది. తన సొంత వూరు రత్నగిరిని ఏనాడో క్రితమే తను మరిచిపోయింది. అదంతా గతం. నాలుగువందల మైళ్ళు వెనక్కి జరిగిపోయిన గతం....తను గుర్తుచేసుకోడానికి ఇష్టపడని చేదు గతం....

"వినిపించిందా?" కీచు కంఠం హెచ్చరించింది.

"ఎవరు మీరు?" రూప కంఠం వణికింది.

"చెప్పినా నీకు తెలీదు! చేయాల్సింది చేసేసి, సంగ నాచిలా ఈ నగరంలో ఆకుల మధ్య ఆకు తేలులా దాక్కున్నావు. నువ్వెక్కడ దాక్కున్నా నా కళ్ళకి కనబడుతూనే వుంటావ్!" కీచకంఠం సగర్వంగా నవ్వింది.

రూప గుండె దడదడ కొట్టుకుంది. తను రహస్యంగా వుంచిన తన గతం బాగా తెలిసినవ్యక్తి యెవరో తనతో మాట్లాడుతున్నాడు. అతని మాటల్లో, కంఠంలో స్నేహభావం లేదు....అయినా తను తొందరగా తేలి పోకూడదు.

"నువ్వెవరో పొరబడ్డావు. నన్ను ఎవరో అనుకుంటు న్నావు...."

అతను వెటకారంగా నవ్వాడు. "లాభంలేదు! నువ్వు నువ్వే అని నాకు తెలుసు నీ కథ గుప్పుమనకుండా వుండాలంటే తొమ్మిదింటికి తలుపు బార్లా తెరిచి, ఎదురు చూస్తూ కూచో...."

"నో...."

"యస్! తలుపులు తెరిచి వుంచుతావు; నా కోసం ఎదురుచూస్తావు!"

"మిస్టర్ ..." అటు వేపున డిస్కనెక్టు అయిన శబ్దం విని రూప నిట్టూర్చింది. వణుకుతున్న ఆమె చెయ్యి రిసీవర్ని పడేసింది.

తనకి తెలీకుండానే నుదురుమీద కమ్మిన చెమటని పెట కొంగుతో అద్దుకుంటూ రూప టైప్ రైటర్ ముందు కూచుంది. వణుకుతున్న వేళ్ళని టైప్ రైటర్ కీస్ మీద ఆన్చింది. స్టేట్ మెంట్ మీద అంకెలు అల్లుకుపోయి. గంతులేస్తున్నాయి. రూప కళ్ళు మూసుకుంది. ఎందుకో

ఆమె శరీరం ఒకసారి జలదరించింది.

"ఎవరతను? తన గురించి తనకి తెలిసినదంతా తెలిసిన వ్యక్తిలా వున్నాడు. తన గురించి యెవరికి యెంత తెలిసినా, తనకి ప్రమాదమే....ఏదో చప్పుడు విని రూప ఉలిక్కిపడి కళ్ళు తెరిచి చూసింది.

ఆఫీస్ బాయ్ కుమార్ నవ్వు మొహంతో వస్తున్నాడు. అతని చేతిలో పింగాణీ కప్పుంది. కప్పుమీద సాసర్ బోర్లించబడింది.

"ఆలస్యమవుతుందని మీ కోసం టీ తెచ్చాను...." అన్నాడతను వినయంగా.

"థాంక్స్, కుమార్. తలనొప్పిగా వుంది..." అంటూ రూప టీ అందుకుంది....

## 2

బస్సు దిగి రూప చకచకా నడవసాగింది.

ఫోన్ కాల్ తనని కంగారుపెట్టి, స్టేట్మెంట్ చివరి పేజీని నాలుగుసార్లు టైప్ చేసేలా చేసింది. ఇంటి ఓనర్, టీచరు, భార్యాపిల్లల్తో వేసవి సెలవులకి సొంత వూరికి వెళ్ళిపోయాడు. మేడమీది రెండు గదుల్లో వొంటరిగా వుండాలంటే, ఈ రోజెందుకో భయంగా వుంది.

పదిహేనురోజులుగా తను వొంటరిగానే వుంది. గదికి వెళ్ళొద్దనీ యే రైల్వేస్టేషన్కో వెళ్ళి రాత్రి గడపమనీ లోపల్నుంచీ యేదో బొబ్బరెడుతోంది. కానీ ....గదికి వెళ్ళక తప్పదు....

పది నిమిషాల్లో రూప మేడ మెట్లెక్కి తాళం తీసింది. తలుపుల్ని లోపలికి తోసింది. ఇరుగు పొరుగు యిళ్ళల్లోంచీ యెవరూ తన గదివేపు చూడ్డంలేదు. గుమ్మం

దాటి, తలుపు పక్కనే వున్న స్విచ్చిని కిందికి నొక్కింది రూప. ఫ్లోరసెంట్ కాంతి ఆమె భయాన్ని కొంచెం తగ్గించింది. రూప కంగారుగా టైం చూసుకుంది. పది నిమిషాల్లో తొమ్మిదవుతుంది.

రూప తలుపుల్ని మూసి, గొళ్ళెం పెట్టబోతూ ఆగింది, "తలుపులు తెరిచి వుంచుతావు!" కీచుకంఠం దర్పంగా ఆమె చెవుల్లో గింగురుమంది. రూప క్షణకాలం విగ్రహంలా నిలబడింది. గొళ్ళెం పెట్టిన తరువాత తలుపుల్ని తెరవక తప్పదు! తలుపుల్ని తెరిచి, రూప లోపలి గదిలోకి వెళ్ళింది.

బాత్‌రూంలో కెళ్ళి, మొహం కడుక్కుని తిరిగొచ్చింది. వంట చేయాలనిపించడం లేదామెకి. తన ఆకలిని కీచుకంఠం టెలిఫోన్ ద్వారా మాయం చేసేసింది. మట్టి కూజాలోని నీళ్ళని గ్లాసులోకి వొంపుకుని తాగి, ముందు గదిలోకి నడిచి అద్దం ముందు నిలబడింది రూప. నీరసంగా అవుపిస్తోన్న తన మొహాన్ని చూస్తూ తిలకం సీసా అందుకుంది.

చటుక్కున లైటు ఆరిపోయింది.

రూప గుండె ఒక్కసారి కొట్టుకోవడం మానేసింది. ఆమె వేళ్ళ మధ్య నుంచీ తిలకంసీసా కిందపడింది.

రేసుగుర్రంలా పరుగెట్టడం ప్రారంభించిన గుండెని అదుపులో పెట్టడానికి ప్రయత్నిస్తూ, మెల్లిగా వెనక్కి తిరిగింది రూప. కిటికీ గుండా వీధిలైటు కాంతి లోపలికి దూరుతోంది. తన గదిలో లైటు యెందుకు పోయింది? తటాలున, మెయిన్స్ ఆఫ్ చేయబడి వుండొచ్చని ఆమెకి అనిపించింది.

ఉలిక్కిపడి, రూప కిటికీమీద నుంచీ తన చూపుల్ని తలుపువేపు తిప్పింది. చిన్న చప్పుడుతో తలుపులు మూసుకున్నాయి. గొళ్ళెం తోయబడుతున్న చప్పుడు ఆమెకి వినిపించింది. తలుపు ముందు లీలగా ఏదో ఆకారం.

“వెరీగుడ్, తలుపులు తెరిచే వుంచావ్! ఇలాగే బుద్ధిగా నడుచుకుంటే ప్రమాదం రాదు!” కీచుకంఠం రహస్యం చెబుతున్నట్టు అంది. గొంతుక కిందినుంచీ, మెడమీంచీ శరీరం ముందూ: వెనకా—తన భయం చల్లటి చెమట కాలువల్లా సాగుతున్నట్టు రూప గ్రహించింది. నోరూ పెదవులూ ఆరిపోతున్నాయి.

“నాలుగు అడుగులు ముందుకు రా!” కీచుకంఠంలో అధికారం ధ్వనించింది. దడదడలాడుతున్న గుండెతో రూప ముందుకి నడిచింది.

“ఎడమవేపుకి రెండడుగులు కదులు!”

అప్రయత్నంగా రూప కదిలింది. ఎడంవైపుకి అతను ఎందుకు జరగమన్నాడో ఆమెకి తటాలున అర్థమైంది: కిటికీగుండా వచ్చే వెలుగు తనమీద పడుతోంది. అతను నీడలా కొంచెం కదిలాడు. వెలుగులో యేదో తళుక్కుమంది. కిటికీ వెలుగులో అతని వేళ్ళ మధ్య నాట్యం చేస్తోన్న సన్నటి కత్తిని రూప కంగారుగా చూసింది.

అతను చిన్నగా నవ్వాడు. “తిక్క వేషాలేస్తే గానీ కత్తి నిన్ను ముద్దెట్టుకోదు!”

రూప బరువుగా ఊపిరి పీల్చుకుంది. తను వెలుగులో వుంది; అతను చీకట్లో వున్నాడు. వెలుగులో వున్నా, తను చూడలేదు; అతను తనని చూడగలడు! అతని మూలంగా తనకి యిప్పుడప్పుడే యే ఆపద రాదని ఆమెకి అనిపిస్తోంది....

"ఎవరున్నావు?" వణుకుతున్న కంఠంతో ప్రశ్నించింది.

"కుండ పగలేసి యేమీ యెరగనిదానిలా వచ్చేశావ్! నీ చిన్న టౌన్‌లోని పోలీసులూ, ప్రజలూ అమాయకులు. కానీ, లోకంలో అందరూ అమాయకులు కారు!" అతని కంఠంలో ఏదో ద్వేషం ధ్వనించింది.

"నువ్వనేదేమిటో నాకు అర్థం కావట్లేదు...."

"పల్లెటూరిలాంటి ఆ టౌన్లో నటించావు. ఈ మహా పట్నంలో నటిస్తున్నావు. కానీ నా ముందు నటించలేవు! అమాయకంగా అవుపించే నీ కళ్ళ వెనకా, అందంగా అవుపించే నీ శరీరం వెనకా దాగిన కురుపుల్ని అందరికీ చూపించమంటావా? మొదట నీ ఆఫీసులో ప్రారంభిస్తాను!" అతను బెదిరింపుగా నవ్వాడు. రూప ఉక్కిరిబిక్కిరవుతూ చూసింది.

"కాడని కాలేసిన వ్యక్తి వాత పెట్టుకోవాలి! చేసిన పాపానికి ప్రాయశ్చిత్తం చెల్లించాలి! అది వసూలు చేయడానికే నిన్ను వెతుక్కుంటూ వచ్చాను!"

బ్లాక్ మెయిల్! రూప అదిరిపడింది. తన గతం గురించి అతనికి ఎంతో కొంత తెలుసని అర్థమవుతోంది. ఎంత తెలుసో తెలుసుకుంటే గాని తనకి క్షేమంగా ఉండదు....

"బ్లాక్ మెయిల్ చేయాలనుకుంటున్నావు! అది జరగాలంటే బ్లాక్ మెయిల్ చేయబడే వ్యక్తికి రెండు వుండాలి. ఒకటి: ఇతర్లకి తెలీకూడని రహస్యం. రెండు: డబ్బు. నా దగ్గర ఆ రెండూ లేవు!" రూప ధైర్యంగా అంది. ధైర్యం ఒక్కటే తన ఆస్తి. అది లేకపోతే లోకం యెప్పుడో అప్పుడు తనని జీర్ణం చేసేసుకుంటుంది.

"అమాయకత్వమే అనుకున్నా. ధైర్యం కూడా వుంది! ధైర్యం లేకపోతే 'ఆ పని' చేసివుండేదానివి కావు... ఆల్ రైట్. నువ్వు చేసిన నేరానికి అపరాధం విధిస్తున్నా. దాచుకోవాల్సిన రహస్యం, దాచుకున్న డబ్బు—రెండూ నీ దగ్గరున్నాయని నాకు తెలుసు! నెల తిరిగేసరికి తొమ్మిదివందలు నీ వొళ్ళో వాలుతున్నాయి. ఈ నెల నుండీ ప్రతీ నెలా సగం జీతం నేను తీసుకుంటాను!"

"నో! చిల్లిగవ్వ ఇవ్వను! గెటౌట్!" రూప అరిచింది.
అతను యెప్పుడు దగ్గరగా జరిగాడో ఆమె చూడలేదు. హఠాత్తుగా ఆమె చెంప పగిలినట్టనిపించింది. ఎడమ చెంప, కుడి చెంప, ఎడమ చెంప, కుడి చెంప, ఎడమ.... కుడి....

"నోరు తెరిస్తే పళ్ళు రాలతాయ్!" అతని కంఠం కోపాన్నీ విస్కీ వాసననీ ఆమె మొహంమీదకి రువ్వింది. నీడ కొద్దిగా వెనక్కి జరిగింది. అవమానంతో, బాధతో. రూప కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమె చూపు ఇంకా మందగించింది.

"పైట తీసెయ్!" అతని కంఠం కర్కశంగా ఆజ్ఞాపించింది. అతని ఆజ్ఞని మెరుపు రూపంలో ఆండర్ లైన్ చేస్తూ కత్తి తళుక్కుమంది.

ఏడుపుని దిగమింగుతూ రూప పైటని కిందికి జార్చింది. ఆవేశంతో, రొప్పుతూ కెరటంలా ఎగిసెగిసి పడుతున్న ఛాతీని కంట్రోల్ చేయడానికి ఆమె వ్యర్థప్రయత్నం చేసింది.

అతను సన్నగా విజిల్ వేశాడు. "ఈ ఊరి గాలీ, నీళ్ళూ నీకు బాగా పట్టేట్టున్నాయి. ధారాళంగా,

కంటికి నిండుగా ఎదిగావు! గుడ్. జాకెట్లోకి చేతిని పోనీ!"

రూప ఉలిక్కిపడింది. "..దే.... దేనికి?" తడబడుతూ అడిగింది.

"నువ్వనుకుంటున్న 'దానికి' కాదు! గుండెల్లో గుట్టుగా దాచుకున్న పర్సు తియ్!" సన్నగా సగర్వంగా నవ్వాడతను.

వణుకుతున్న వేళ్ళను జాకెట్ లోపలికి పోనిచ్చి చిన్న పర్సుని వెలికి లాగింది రూప.

"ఇలా విసురు!" ఆజ్ఞాపించాడతను. రూప నీడవైపు పర్సుని విసిరింది. కిందపడిన పర్సుని అతను అందుకున్నాడు. "ప్రతిమలానుంచో. కదితే కత్తి ఎక్కడ దిగుతుందో నాకే తెలీదు!"

రెండు క్షణాలు గడిచాయి. ఊపిరి బిగబట్టి, కళ్ళు చిట్లించి చూస్తోందామె. అతని చెయ్యి కిటికీ వెలుతుర్లోకి సాగింది. యాభై రూపాయలనోట్లు పట్టుకున్న అతని వేళ్ళని రూప పరిశీలనగా చూసింది. గ్లవ్స్ స్పష్టంగా అవుపిస్తోన్నాయి.

"యాభై రూపాయల నోట్లు! గుడ్. తొమ్మిది నోట్లు తీసుకుంటున్నా...." గొణుక్కుంటున్నట్టు అన్నాడతను. నోట్లు సన్నగా శబ్దం చేశాయి. తటాలున పర్సు ఆమె ఛాతీని గట్టిగా తాకి కిందపడింది. రూప ఉలిక్కిపడింది. తను పైట వేసుకోడం మరిచేపోయింది! ఆమె చెయ్యి ఆత్రంగా కదిలి పైటని కప్పింది.

"పైట తియ్యి! వేసుకోడానికి నేనింకా పర్మిషన్ ఇవ్వలేదు!" హుంకారించాడతను.

ఛండాలుడు! రూప అప్రయత్నంగా పైటని దిగ

జార్చింది. తడి ఆరుతున్న కళ్ళని చిట్లిస్తూ చూసింది. అతని రూపం లీలగా అవుపిస్తోందిప్పుడు. సన్నగా, పొడుగ్గా వున్నాడతను.

"ఇన్‌స్టాలుమెంట్ పద్ధతంటే నాకు ఇష్టం. అందుకే అప్పుడప్పుడూ డబ్బు తీసుకుంటూనవున్నాను. ఈసారి.... ఫస్టు విజిట్—పైట మాత్రం కిందికి తీయించాను. సెకండ్ విజిట్‌లో చీర పూర్తిగా తీసేయాల్సి వుంటుంది నువ్వు. ఆ తరువాత విజిట్‌లో జాకెట్. ఆ తరవాత బ్రాసియర్ .....అన్నట్టు నువ్వు బ్రాసియర్ వాడతావా? ఆ రోజుల్లో, ఆ ఊళ్లో బ్రాసియర్ వాడే దానివి కావు!" అతని కంఠం కులాసాగా నవ్వింది.

వణికిపోతూ రూప ఆశ్చర్యంగా వింటోంది. తన గురించి, ఆ రోజుల గురించి నిజంగానే తెలిసిన వ్యక్తిలా వున్నాడు; రాస్కెల్.

"బ్రాసియర్ అలవాటు లేకుండా వుంటే మరీ మంచిది! ఒక విజిట్ కలిసొస్తుంది నాకు! ఆ తరవాత విజిట్‌లో లంగా...."

"ప్లీజ్.... నా రింగులూ, డబ్బూ, ట్రాన్సిస్టర్—వున్నవన్నీ ఇచ్చేస్తాను. నన్నొదిలేయ్...." రూప ఆందోళనతో ప్రాధేయపడింది.

అతను చిన్నగా నవ్వాడు. "ఇంకా నిన్ను పట్టుకోలేదుగా, వదిలేయడానికి! మళ్ళీ సమయం చూసి కనిపిస్తాను. అవసరమైతే ఫోన్ చేస్తాను. జీతం అడ్వాన్స్ తీసుకో!"

రూప ఏదో చెప్పబోయింది. గొళ్ళెం చప్పుడు ఆమె నోరు నొక్కేసింది.

"అన్నట్టు మరిచాను. నీ గతాన్ని మరిచిపోయినట్టే

పన్నా మరిచిపో! పోలీసుల్దాకా వెళ్ళలేరని నాకు తెలుసునులే. ఎందుకేనా మంచిదని వార్నింగ్ ఇస్తున్నా. నేను వెళ్ళిపోయిన కాసేట్లో లైట్లు వెలుగుతాయి. లైట్లు వెలిగాక, అయిదునిమిషాలు కదలకుండా నుంచో!"

తలుపు తెరుచుకుంది. మూసుకుంది. రూప చెవులు రిక్కించింది. మెట్లమ్మట మెత్తటి చప్పుడు కిందికి దిగిపోతోంది. బరువుగా నిట్టూర్చి పైట వేసుకుంది. ఇంకా ఆమె శరీరం వణుకుతూనే వుంది.

చటుక్కున లైటు వెలిగింది. రూప ఉలిక్కిపడింది.

## 3

ముదురు ఆకుపచ్చరంగుచీర. అదే రంగు జాకెట్. ఆకుపచ్చ రంగు గాజులు. సన్నగా, కొంచెం పొడుగ్గా వున్న ఆకారం. కోల మొహం. గుమ్మంలో, ఫ్రేములో పెయింటింగులా నించున్న యువతిని అతను ప్రశ్నార్థకంగా చూశాడు.

"మిస్టర్ టెంపో....?" వినిపించీ వినపించకుండా అందామె. ఆమె విశాల నేత్రాల్లో యేదో బెదురు లీలగా ప్రత్యక్షమవుతోంది. డిటెక్టివ్ టెంపో సోఫాలోంచి లేచాడు.

"తటపటాయించకండి. కరెక్ట్ అడ్రెస్‌కే వచ్చారు. కుడికాలు పెట్టండి!"

ఆమె మొహమ్మీద చిరునవ్వు మెరిసింది. కళ్ళల్లోని బెదురు క్షణకాలం మాయమైంది. మెల్లిగా లోపలికి అడుగు వేసిందామె.

"మిస్టర్ టెంపో. అయామ్ రూప...."

"గ్లాడ్ టూ నో యూ! కూచోండి" డిటెక్టివ్ టెంపో సోఫా చూపించాడు. రూప కూచుంది. పర్సులోంచీ

రుమాలు తీసి నుదుర్ని అద్దుకుంది. రెప్పలెత్తి టెంపో వైపు చూసింది. ఫుల్ సూట్‌లో వున్న పొడుగాటి విగ్రహం. నవ్వుతూ వుండే పెదవులు. నవ్వుతూ వుండే కళ్ళు ఆమెవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ అతను సిగరెట్ వెలిగించాడు.

"మిస్టర్ టెంపో..... నేను ఇబ్బందుల్లో ఇరుక్కున్నాను...." రూప సన్నటి కంఠంతో ప్రారంభించి ఆగింది.

"సారీ అందమైన ఆడపిల్లలు ఆపదల్లో ఇరుక్కోరాదు!" టెంపో నవ్వుతూ అన్నాడు. రూప పళ్ళు మెరిశాయి. తన బెరుకుని ఈడిచివేయడానికి డిటెక్టివ్ టెంపో అలా మాట్లాడుతున్నాడని ఆమెకి అర్థమవుతోంది.

"రూపా, ఏమిటి కథ?"

"ఎవడో నన్ను.... నన్ను..... బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు...." అంది రూప చివరికి.

టెంపో కనుబొమలు పైకి లేచాయి. ఆమె ఎదురుగా సోఫాలో కూచుని, చెప్పమన్నట్టు చూశాడు.

"నేను పుట్టిందీ, పెరిగిందీ రత్నగిరిలో.... చిన్న సైజు టౌను.... మీకు తెలీదనుకుంటా. ఒరిస్సా బోర్డర్.... ఏడాది క్రితం ఈ ఊరు చేరాను. డీలక్స్ కార్పొరేషన్‌లో స్టెనోగా పనిచేస్తున్నా. మొన్న సాయంత్రం అయిదున్నర ప్రాంతంలో నన్నతను ఫోన్‌లో పలకరించాడు.." ఆగుతూ ఆగుతూ, రుమాలుతో నుదుర్ని అద్దుకుంటూ రూప అంతా చెప్పింది.

"రూపా, నేను క్రైమ్‌బ్రాంచి ఇన్స్‌పెక్టర్ పృథ్వీరావ్‌కి ఫోన్ చేస్తాను. వెళ్ళి అతన్ని కలుసుకో. అంతా

వివరించు. అతను...."

అటూ ఇటూ వేగంగా ఊగుతున్న రూప తలని చూస్తూ టెంపో ఆపేశాడు. ప్రశ్నార్థకంగా చూశాడు.

"మిస్టర్ టెంపో, నేను.... పోలీసుల్ని కలుసుకో లేను; కలుసుకోను.... బ్లాక్ మెయిలర్ నన్ను పీడించ డానికి నా గతంలో ఏదీ లేదని మీతో అన్నాను. అది నిజంకాదు. నిజం మీకు చెప్తాను. విని, మరిచిపోయి, గతంలోంచి పొడుచుకొస్తున్న బ్లాక్ మెయిలర్ నీడ నామీద పడకుండా చూడాలి మీరు...." రూప ఆగి, ప్రాధేయపూర్వకంగా చూసింది.

సిగరెట్ పీకని యాష్ ట్రేలో పడేసి టెంపో మౌనంగా చూశాడు.

"రత్నగిరిలో మా అక్కయ్య ఇంట్లో నేను ఉండే దాన్ని. అమ్మా నాన్నా పోయాక, అక్కయ్య నన్ను తనతో వుండమంది. మా బావ....మంచి వ్యక్తి కాదు. అన్ని వ్యసనాలూ అతన్నే ఇల్లుగా చేసుకున్నాయి. ఉద్యోగం పోగొట్టుకున్నాడు. ఉన్న కొద్దిపాటి ఆస్తీ, అక్కయ్య నగల్నీ జూదానికీ, తాగుడికీ సమర్పించేశాడు. ఇద్దరు ముగ్గురు ఆడవాళ్ళతో సంబంధం పెట్టుకున్నాడు. చివరి రోజుల్లో అక్కయ్య తాళిబొట్టు స్థానంలో పసుపు కొమ్ము కట్టుకుంది...."

"చివరి రోజులు....మీ అక్కయ్యవా?" టెంపో ప్రశ్నించాడు.

రూప తలని అడ్డంగా ఊపింది. "బావవి.... అతను చచ్చిపోయాడు. నిజం చెప్పాలంటే......హత్య చేయ బడ్డాడు...."

"హత్య? ఎవరు చేశారు? తోటి జూదగాళ్ళా?"

రూప మళ్ళీ తల అడ్డంగా తిప్పింది. రుమాలుతో నుదుర్ని అద్దుకుంది. "....నో....నో...."

డిటెక్టివ్ టెంపో ఆశ్చర్యంగా చూశాడు. ఎంతో మర్యాదగా, ఒద్దికగా అవుపిస్తున్న ఈ పిల్ల హత్య చేసిందా?

"బావ అక్కయ్య జీవితాన్ని నిత్యనరకం చేశాడు. తాగి, జూదంలో ఓడి, అవమానాలపాలై ఏ అర్థరాత్రో ఇంటికి వచ్చి అక్కయ్యని గొడ్డును బాదినట్టు బాదేవాడు.....ఆ రోజు.....రాత్రి మూడుకావస్తోంది. మేం మేడమీద గదిలో వుండేవాళ్ళం. పిట్టగోడదగ్గర చప్పుడైంది. అక్కయ్య రివాల్వర్ తెచ్చుకొమ్మంది— బావకి శత్రుభయం అధికంగా వుండేది. ఎక్కణ్నుంచో ఒక రివాల్వర్ సంపాయించుకున్నాడు. అన్నీ తెగ నమ్మినా దాన్ని మాత్రం ప్రాణంలా చూసుకునేవాడు."

రూప ఆగి, దీనంగా టెంపోని చూసింది. తిన్న తిండిని అతికష్టంమీద వాంతి చేసుకుంటున్నప్పటి ఎక్స్‌ప్రెషన్ ఆమె మొహంమీద అవుపిస్తోంది.

టెంపో సిగరెట్ వెలిగించాడు. "తరవాత?"

"ఇంటావిడ మెట్ల తలుపు తాళం వేసింది. మేడకి దగ్గరగా వంగిన వేపమానుగుండా బావ పైకి ఎక్కినట్టున్నాడు. పిట్టగోడమీదికి దాటుతున్నాడు గుడ్డివెన్నెల్లో ఆ వ్యక్తి బావ కాదనుకున్నాను. అక్కయ్య కంగారుగా అరిచింది. ఆ వ్యక్తి బావకాదని నాకు అనిపించింది. అతను....అతను... ఆ రాడీ...."

"ఏ రాడీ?" టెంపో ప్రశ్నించాడు.

"రాడీ....మా బావ ఫ్రెండు. బావలాగే వాడొక లుచ్ఛా....సారీ....బావకి నీడ వాడు. వాడు....నామీద

కన్నేశాడు. నన్ను తన భార్యగా చేస్తే కావాల్సినంత డబ్బిస్తానన్నాడు బావతో. బావ నన్ను అమ్మేయడానికి విశ్వప్రయత్నం చేశాడు. అక్కయ్య యెదురుతిరిగింది. ఆమె యెదురుతిరిగిన సందర్భం అదొక్కటే—నేనూ యెదురుతిరిగాను. చేసేదిలేక బావ తోక ముడిచేశాడు. కనీసం ముడుచుకున్నట్టు నటించాడు....” రూప ఆగింది. మెలికలు తిరిగిన కొండదారిలో భర్తీ బండిని లాగుతున్నట్టుంది ఆమె వాలకం.

“తరవాత?”

“వాడు—ఆ రౌడీ. తన ప్రయత్నం మానలేదు. ఒకటి రెండుసార్లు నన్ను కల్సుకుని, బ్రెయిన్ వాష్ చేసే ప్రయత్నం చేశాడు. లోపల్లోపల బావ ప్రోత్సాహం ఉన్నట్టు నా అనుమానం. వాడు తరచుగా నాకు ఉత్తరాలు బట్వాడా చేసేవాడు. నానుంచీ రెస్పాన్స్ లేకపోయేసరికి....పలకడానికి వీల్లేని మాటలు, బూతులూ, తిట్లూ వాడుతూ రాసేవాడు. నన్ను ఎలాగైనా లొంగదీసుకుంటానని రెండుమూడుసార్లు బెదిరిస్తూ శపథం చేశాడు కూడా....ఆ రోజు తెల్లారేలోగా మా ఇంటికి వచ్చి.....నన్ను.....నన్ను.....కలుసుకుంటానని తెలియజేశాడు....” రూప ఆగింది.

డిటెక్టివ్ టెంపో సిగరెట్ ముట్టిస్తూ, ఆమెని ఆగనిచ్చాడు. రూప మెల్లిగా ప్రారంభించింది:

“అంతరాత్రివేళ వాడే వచ్చాడని నేను అనుకున్నాను. అక్కయ్య రివాల్వర్ చూస్తే పారిపోతాడని సూచించింది. పరుగెట్టుకెళ్ళి రివాల్వర్ పట్టుకుని కిటికీ ముందు నుంచున్నాను. అతనింకా పిట్టగోడ దాటుతున్నాడు. భయం నన్ను పూర్తిగా ఆవరించుకుంది. అప్ర

యత్నంగా నా చూపుడువేలు ట్రిగ్గర్ని నొక్కింది. అతను దాదాపు మీదికి తూలిపోయాడు.... నాకు మతిపోయింది. జీవితంలో ఆ క్షణంలోనే రివాల్వర్ పట్టుకున్నాను. గురిచూడ్డం కూడా నాకు తెలీదు. కానీ.... కానీ.... అతను చచ్చిపోయాడు.... అతను.... రౌడీ కాదు.. మా బావ!" రూప టెంపో వైపు జాలిగా చూసింది.

డిటెక్టివ్ టెంపో ఆశ్చర్యంతో కళ్ళు పెద్దగా చేశాడు. తటాలున లేచి, ఆమె ముందు నిలబడి, ఆమె మొహంలోకి తదేకంగా చూశాడు.

"తరువాతేం జరిగింది?"

"రివాల్వర్‌కి బలి అయిపోయిన వ్యక్తి బావే అని అక్కయ్యా, నేనూ ఒకేసారి గుర్తించాం. కళ్ళు తిరిగి పడబోతున్న నన్ను అక్కయ్య పట్టుకుంది. హిస్టీరియా వచ్చినదానిలా ఏడుస్తున్న నన్ను ఓదార్చింది. ఆ విపత్కర పరిస్థితిలో అక్కయ్య చకచకా ఆలోచించింది. ఆమె చెప్పినట్టే చేశాను."

"మీ అక్కయ్య ఏం చెప్పింది?"

"రివాల్వర్ పిడిని చీరచెంగుతో తుడిచేసి, బావ వేళ్ళమధ్య ఇరికించమంది. చప్పుడుకి చుట్టుపక్కలవాళ్ళు మేల్కొని లైట్లు వేస్తున్నారు. అక్కయ్యతో వాదించాను. ఆమె వినిపించుకోలేదు. చివరికి ఆమె చెప్పినట్టే చేశాను. అక్కయ్య అనుకున్నట్టే అది ఆత్మహత్యగా తేల్చబడింది.... ఆఫ్‌కోర్స్ బావకి డజనుసార్లు ఆత్మహత్య చేసుకునే అవసరం, కారణం వున్నాయి."

"అయితే పోలీసుల నుంచి తప్పించుకున్నానన్న మాట!" టెంపో అన్నాడు.

"వాళ్ళు పట్టుకుంటేగా తప్పించుకోడానికి? కేసు

మూసేశారు. అక్కయ్య వాళ్ళు అత్తగారున్న పల్లెటూరికి వెళ్ళిపోయింది, ఇద్దరు పిల్లల్నీ తీసుకుని. నేను.. ఆ ఊరు వదిలేశాను. కాలక్రమాన అంతా మరిచిపోయాను" రూప వివరించింది.

డిటెక్టివ్ టెంపో ఆమెవైపు అదోలా చూశాడు. "రూపా, ఇప్పుడు నిన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్న వ్యక్తికి ఇదంతా తెలుసా?"

"తెలిసేవుండాలి. నేను భయపడే మరో రహస్యం నాకు లేదు! అయితే అతను వివరాలు చెప్పలేదు. అయినా నాకు అర్థమైంది."

డిటెక్టివ్ టెంపో సాలోచనగా ఆమె ముందు పచార్లు చేయడం ప్రారంభించాడు. చాలా కాలంగా తనని ముల్లులా గుచ్చుతూ బాధించిన నిజాన్ని మొదటిసారిగా టెంపోకి చెప్పేసి తను తొందరపడిందా? తను బావ హత్యకేసులో ఇరుక్కుంటుందా? డిటెక్టివ్ టెంపో ఈ సంగతి పోలీసులకి తెలియజేస్తాడా? రూప పచార్లు చేస్తున్న టెంపోని ఆత్రంగా చూస్తూ కంగారుగా ఆలోచిస్తోంది.

".....టెంపో గారూ..... నిజం మీకు చెప్పేశాను. పోలీసుల్ని కల్సుకునే అవకాశం నాకు లేదు....మీరు నా ఇబ్బందిని అర్థం చేసుకుని...." కటాలున తనముందు ఆగిన టెంపోని చూస్తూ రూప ఆగింది. టెంపో ఆమెని తదేకంగా చూశారు.

"రూపా, ఆ రాత్రి వేపచెట్టుమీంచి డాబామీదికి దూకింది మీ బావే అని తెలిసీ, రాక్షసుడుగా రూపొందిన తన భర్త పీడ విరగడ చేసుకోవాలన్న ఉద్దేశంతో మీ అక్కయ్య నిన్ను ఉసిగొల్పి వుండొచ్చుగా?"

రూప అదిరిపడింది. ఆశ్చర్యంగా టెంపోని చూసింది. మెల్లిగా ఆమె కళ్ళల్లో తడి మెరిసింది.

"అక్కయ్య భర్తని ద్వేషించినా, మంగళసూత్రాన్ని యెంతగానో గౌరవించింది. తన పిల్లలకి తండ్రిలేకుండా చేసే ఆలోచన దానికిరాదు! టెంపోగారూ, నేనూ బావని అసహ్యించుకున్నాను. అయితే అక్కయ్య పసుపుకుంకుమల్ని తుడిచివేయలేను!" రూప కడకంటి నుంచీ ఒక అశ్రుకణం కిందికి జారింది.

డిటెక్టివ్ టెంపో ఆమెని సానుభూతితో చూశాడు. "రూపా, నిన్ను ప్రేమించిన రౌడీ....అతని పేరు...."

"నాగరాజు...."

"నాగరాజు నిన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడు!" డిటెక్టివ్ టెంపో తటీమని అన్నాడు.

రూప చిన్నగా నవ్వింది. "టెంపోగారూ! నాగరాజు బావ మరణించిన రెండు నెల్లకి చచ్చిపోయాడు. పేకాటలో యేవో గొడవలొచ్చి, ఎవరో అతన్ని కత్తితో పొడిచేశారు! పైగా అతను లావుపాటి మనిషి. నన్ను కలుసుకున్న వ్యక్తి సన్నగా పొడుగ్గా వున్నాడు!"

డిటెక్టివ్ టెంపో ఆశ్చర్యంగా చూశాడు. రెప్ప వేయకుండా ఆమెనే చూస్తూ సిగరెట్ వెలిగించాడు. "రూపా, ఆ ఫ్లాస్కులో కాఫీ వుంది. మనిద్దరికీ నువ్వు కాఫీ ఎందుకు సర్వ్ చేయకూడదు?" నవ్వుతూ అన్నాడతను.

రూప నవ్వుతూ లేచి, రెండు కప్పుల్లో కాఫీ పోసింది. కప్పు అందుకొని టెంపో సోఫాలో కూచున్నాడు.

"మిస్టర్ టెంపో...."

డిటెక్టివ్ టెంపో ప్రశ్నార్థకంగా చూశాడు. కాఫీ కప్పుని టీపాయ్‌మీద పెట్టి రూప అతన్ని అనుమానిస్తూ చూసింది.

"అతను... రెండోసారి నన్ను కల్సుకున్నాడు."

"వాట్ ?"

"పర్సులో మిగిలిన రెండొందల్నీ గుంజుకున్నాడు. మరో నెలదాకా కనిపించనన్న వ్యక్తి వారం తిరక్కముందే, వార్నింగ్ ఇవ్వకుండా ప్రత్యక్షమయ్యాడు.... మీకు మరో భయంకరమైన విషయం చెప్పాలి..."

"రూపా, వాయిదాల పద్ధతిలో చెప్పడం మంచిది కాదు. ఒకేసారి, పూర్తిగా అంతా చెప్పాలి!"

"సారీ....వాయిదాల పద్ధతిలో....డబ్బు గుంజుకోడమే కాకుండా అతను మరో దారుణం చేస్తున్నాడు.... మొదటిసారి నా చేత్తో... నా పైటని....జార్చేశాడు.... ....రెండోసారి..... ...రెండోసారి.... ....చీర పూర్తిగా...." అకుందుక్కి రూప పీకను పట్టుకుంటున్న సిగ్గు ఆమె నోటిని నొక్కేసింది.

టెంపో ఆశ్చర్యంగా చూశాడు. "మూడోసారి.... జా....కె...ట్టు....ఇలా చేస్తానని వాగ్దానం చేశాడు" అంది రూప.

"విచిత్రమైన వ్యక్తిలా వున్నాడు!" టెంపో మెల్లిగా అన్నాడు.

"టెంపోగారూ....మూడోసారి ... నాలుగోసారి.... అతను వస్తే నేను బతకలేను...." రూప కంఠంలో ఆందోళనా. ఏడుపూ కలిసి ధ్వనించాయి.

టెంపో అర్థమైనట్టు తల పంకించాడు. తటాలున

లేచి, ఆమె ముందుకి వెళ్ళి, దగ్గరగా నిలబడ్డాడు. సానుభూతితో ఆమె కళ్ళల్లోకి చూశాడు.

"రూపా, నువ్వు విచిత్రమైన పరిస్థితిలో ఇరుక్కున్నావ్! నిజాన్ని దాచలేవు. దండోరా వేయలేవు. మీ బాబ ఆత్మహత్య 'హత్య' అని తేలేక, హత్య చేసిన వ్యక్తిని చట్టం వదలుతుందనుకోను! అతను నిన్ను మళ్ళీ యెప్పుడు కలుసుకుంటాడో తెలీదు. నీ ఇంటిమీద నిఘా ఏర్పాటు చేయడం నీకే ప్రమాదం. గుంటనక్కలా అతను అన్నీ గమనిస్తూ వుంటాడు...."

"అవును, ఆ రోజు.... నేను రివాల్వర్ పేల్చిన—నా చేతిలోని రివాల్వర్ పేలిన రోజు—డాబా ముందు వెలురుందనీ, తెలిసే బాబను కాల్చాననీ అతను అన్నాడు!"

డిటెక్టివ్ టెంపో తల పంకించాడు. "నీ విషయం, నీ గతం మనం ఆట్టే కాలం పోలీసుల్నుంచీ దాచలేం; దాచకూడదు! ఏం చేయాలో నేను ఆలోచిస్తాను. నువ్వు మామూలుగా నీ డ్యూటీ చూసుకో. ఈసారి అతను ఫోన్ చేస్తే వెంటనే నాకు తెలియజేయి. వెళ్ళిరా!"

రూప సందేహిస్తూ, లేచి నిలబడింది. తనవేపు తల పైకెత్తి దీనంగా చూస్తోన్న ఆమె విశాల నేత్రాల్లోకి డిటెక్టివ్ టెంపో సానుభూతితో చూశాడు. మెల్లగా ఆమె భుజమ్మీద చెయ్యి వేశాడు. అప్రయత్నంగా ఆమె అతని దగ్గరగా జరిగింది. టెంపో ఆమెని గుమ్మం దాకా నడిపించాడు. గడప దాటబోతూ రూప అతనివేపు తల తిప్పింది.

"మీ ఫీజు ..."

"నేను ఇంకా నీ కోసం యేమీ చేయలేదు; చెప్పు

అప్పగించి వినడం తప్పు! పని చేశాక పారిపోదాం!” టెంపో నవ్వుతూ అన్నాడు.

గుమ్మం దాటి. రూప మళ్ళా వెనక్కి తిరిగింది. “టెంపోగారూ.... అతను... నే నిక్కడికి రావడం చూస్తే....”

“చూడనీ! మరేం ఫర్వాలేదు. కంగారుపడతాడు. కోప్పడతాడు. నిన్ను బెదిరిస్తాడు. పెనాల్టీ విధిస్తాడు! అతను భయపడ్డం, కోప్పడ్డం మనకి మంచిది. అతని భయం మనకి బలం!” టెంపో నవ్వుతూ సున్నితంగా ఆమె భుజాన్ని పట్టుకుని తోశాడు. రెండడుగులు వేసి రూప మళ్ళా తిరిగి చూసింది.

టెంపో ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు.

“....మిస్టర్ టెంపో, పదునైన కత్తితో అతను నన్ను హడలగొట్టేస్తున్నాడు. అతని కంఠాన్ని ఇంతకు ముందెప్పుడూ నేను వినలేదు. పూర్తిగా కొత్త వ్యక్తి!... అయితే, అతనికి నా గురించి పూర్తిగా అంతా తెలుసు” రూప ఆగి అదోలా చూసింది.

డిటెక్టివ్ టెంపో ప్రశ్నార్థకంగా చూశాడు.

“మా ఊళ్ళో వున్న కొట్లల్లో నేను.... నేను.... బ్రాసియర్స్.... ఉపయోగించేది లేదని కూడా అతనికి తెలుసు....” రూప వెడల్పాటి రెప్పల రెక్కల్ని పెద్ద పెద్ద కళ్ళమీదికి దించి మెల్లిగా అంది.

టెంపో సన్నగా ఈల వేశాడు. సిగ్గుపడుతూ రూప అతన్ని రెప్పల సందుల్లోంచీ చూసింది.

“అయితే ప్రస్తుతం అతను నాలుగోసారి రావడం అంత మంచిది కాదనుకుంటాను!” టెంపో నవ్వుతూ

అన్నాడు.

రూప నవ్వులో సిగ్గు చిరుగంటలా ధ్వనించింది. "మూడోసారి రావడం కూడా ప్రమాదమే!"

"ఐసీ ..." టెంపో నవ్వుతూ అన్నాడు.

రూప మెట్లవేపు తిరిగింది. టెంపో చిన్నగా నిట్టూర్చాడు.

గోడ్డు మలుపు తిరిగి రూప అదృశ్య మయ్యేదాకా కిటికీ ముందు నిలబడి, టెంపో కుర్చీవేపు అడుగులేశాడు. ఆలోచనల గ్రాఫ్‌లా తయారవుతున్న నుదుర్ని అరచేత్తో రుద్దుకుంటూ కుర్చీలో కూచున్నాడు. సిగరెట్ ముట్టించి, కాళ్ళని ముందున్న టేబుల్ మీదికి ఎక్కించి, తలని కుర్చీ వెనక్కి వాల్చి, కళ్ళు మూసుకున్నాడు.

రూప ముందు నుయ్యి, వెనక గొయ్యి వున్నాయి. అంతా రచ్చకెక్కితే హత్యానేరం ఆమె మెడకి చుట్టుకుంటుంది. రహస్యంగా వుండాలనుకుంటే బ్లాక్ మెయిలర్ కత్తి ఆమె పీకకింద ఆనుతుంది!

టెంపో ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు. టేబుల్ అంచుమీదున్న రెడ్ టెలిఫోన్ని వొళ్ళోకి లాక్కున్నాడు. రిసీవర్ని తలకీ భుజానికీ మధ్య ఇరికించి, ఆలోచిస్తూ ఒక నెంబర్ డయల్ చేశాడు.

"క్రైమ్‌బ్రాంచ్ ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్!" అటువేపు కంఠం ఖంగుమంది....

# 4

కోటు తీసి, సోఫామీదికి గిరాటేసి డిటెక్టివ్ టెంపో పచార్లు ప్రారంభించాడు. రకరకాల ఆలోచనలు అతని మెదడులో, గులకరాళ్ళు రువ్విన సరస్సులో బుడగల్లా, ఒకదాన్నొకటి తరుముకుంటూ లేస్తున్నాయి. సగం

కాలిన సిగరెట్‌ని గది మూలకి విసిరి మరో సిగరెట్ వెలిగించాడు. రూప మాటలు అతని చెవుల్లో గింగురుమంటున్నాయి. ఉన్నట్టుండి మోగడం ప్రారంభించిన టెలిఫోన్ అతని ఆలోచనల్ని చెల్లాచెదరు చేసింది. రిసీవర్ అందుకుని టెంపో టేబుల్ చివర కూచున్నాడు.

"టెంపో...." అంది అటువైపు కంఠం.

"వ్హాట్!"

"టీకా తాత్పర్యాలతో అంతా చెప్పాలి! టెలిఫోన్ లాభంలేదు. నువ్వు రావాలి!" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు.

"రామాయణాన్ని మనవాళ్ళు మూడు ముక్కల్లో చెప్పారు: కట్టె. కొట్టె. తెచ్చె!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"నేనూ చెప్తాను: రెండే ముక్కల్లో. తరువాత వెయ్యి ప్రశ్నలు వేసి వేపుకు తినేస్తావ్! అంచేత...."

టెంపో రిసీవర్ని పడేసి లేచాడు.

* * *

టీ తాగేసి, సిగరెట్ ముట్టించి టెంపో 'రెడీ' అన్నట్టు పృథ్వీరావ్ వేపు చూశాడు.

"నువ్వు అడిగిన విధంగా, రత్నగిరిలోని రాళ్ళంటినీ తిరగేసి ఇన్ఫర్మేషన్ సంపాయించాను. ఇన్స్పెక్టర్ ఉపేంద్రని కాంటాక్టు చేసి..."

"పృథ్వీ, నాకు రామాయణం కావాలి; ఉపోద్ఘాతం వొద్దు!" టెంపో నవ్వుతూ అడ్డు తగిలాడు.

"పోలీసువాళ్ళు పడే శ్రమా, తీసుకునే చర్యలూ అక్కర్లేదు; రిజల్టు మాత్రం కావాలి ప్రజలకి! నువ్వూ అలాగే మాట్లాడుతున్నావ్! ఆల్ రైట్ .... ఉపోద్ఘాతా

సికి ఉపసంహారం! ఒకటి: నువ్వు చెప్పిన బావ—పేరు రామగోపాల్—ఆత్మహత్య చేసుకున్నట్టు కేసు ఫైనల్ జ్ చేయబడింది. రివాల్వర్ దొంగసొత్తు. లైసెన్స్ లేదు. నువ్వు అనుమానించినట్టే అతన్ని అంతం చేసిన బుల్లెట్ ఆ రివాల్వర్ లోంచే వచ్చిందో లేదో వాళ్ళు పట్టించుకోలేదు. సాధారణంగా అందులోంచే వచ్చి వుంటుందని అనుకున్నారు. వేలిముద్రలు మాత్రం చూశారట!" పృథ్వీరావ్ నవ్వుతూ ఆగాడు.

"గుడ్! తరవాత?"

"తరవాత, నీ సలహాను నా సలహాగా చేసి, వేప చెట్టులో, డాబా వేపు యేదేనా బుల్లెట్ దూరిందేమో కనుక్కున్నాను.... వేపచెట్టు బోదెలో అంగుళం లోతులో ఇరుక్కుపోయిన బుల్లెట్ వుంది!" పృథ్వీరావ్ ఉద్రేకంతో అన్నాడు. "టెంపో యెలా ఊహించావ్?"

"ట్రేడ్ సీక్రెట్!" టెంపో హుషారుగా నవ్వాడు. "ఊ, కానీ, రెండో పాయింటు!"

"నాగరాజు.—నాగరాజు, నాగులు, నాగేంద్ర, నాగవర్మ వగైరా నాగుపాములకి సంబంధించిన పేర్లతో చెలామణీ అయ్యాడు. మా డిపార్టుమెంట్ కి రెగ్యులర్ కస్టమర్. పిక్ నిక్ లో పేకాడుతూ గొడవలో పడ్డాడు. ఎవడో ఆవేశం ఆపుకోలేక అతన్ని పొడిచేశాడు. అంతా పారిపోయారు. మా డిపార్టుమెంటూ, రత్నగిరి ప్రజలూ—వీళ్ళకి సంబంధించినంతవరకూ అతను చచ్చిపోయాడు.

కానీ....ఆర్నెల్ల తరువాత అతను రత్నగిరిలో ప్రత్యక్షమయ్యాడు. కత్తిపోటుతో అతను చావలేదు, బోర్డర్ దాటి యెలాగో ఒరిస్సా చేరుకున్నాడు.

వైద్యంతో కోలుకున్నాడు. అతను తిరిగొచ్చిన నెలలో, అతన్ని చంపినంత పని చేసిన గూండా చెట్టుకి ఉరేసుకు చచ్చాడు. పోలీసులు నాగరాజుని అనుమానించారు కానీ, అప్పటికే అతను గాల్లో కలిసిపోయాడు!"

"వెరీగుడ్! ఇంకా?...." టెంపో ఉద్రేకంతో అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ మళ్ళీ ప్రారంభించాడు. టెంపో చెవులప్పగించాడు.

అరగంట తరువాత, టెంపో ఆవేశంతో లేచి నిలుచున్నాడు. పృథ్వీరావ్‌ని మెరిసే కళ్ళతో చూశాడు.

"పృథ్వీరావ్, త్వరలో ఒక బ్లాక్ మెయిలర్‌ని నువ్వు అరెస్టు చేయబోతున్నావ్. కాచుకో!"

పృథ్వీరావ్ ఏదో అడగబోయాడు. డిటెక్టివ్ టెంపో టెలిఫోన్ రిసీవర్ని అందుకొని డయల్ చేశాడు....

## 5

టెలిఫోన్ మోగింది.

తాగుతున్న కాఫీని కిందపెట్టి రూప లేచింది. ఆఫీసంతా బోసిగా వుంది. లంచవర్లో అందరూ బైటికి వెళ్ళిపోతారు; తను తప్ప. ఇకనుంచీ తను కూడా వెళ్ళిపోతే సరి....

"డీలక్స్ కార్పొరేషన్...." అందామె రిసీవర్ అందుకుని.

"రూప కావాలి..." అటువైపునుంచీ వినిపించిన కంఠాన్ని రూప పోల్చుకుంది. ఎందుకో ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది.

"టెంపోగారూ, నేనే!" అంది ఉత్సాహంగా.

"రూపా, బాగా గుర్తు చేసుకుని చెప్పు, నువ్వు రివా-ల్వర్ పేల్చినప్పుడు—అదే నీ చేతిలో రివాల్వర్ పేలినప్పుడు—మీ బావ తల ఎటువైపు వుంది?"

రూప క్షణకాలం తటపటాయించింది. "ఒక్క క్షణం.... వెనకవైపు డాబా....పడమరగా వుంది. బావ వొంగి...పిట్టగోడ దాటుతున్నాడు. తల ఉత్తరంవైపు వుందనుకుంటాను.........యస్! ఉత్తరంవైపుకి వొంగి, గోడని దాటే ప్రయత్నంలో వున్నాడు....ఎందుకు అడుగుతున్నారు?"

"రూపా, మీ బావకి మెడమీద యేవైపున గాయం అయింది?"

"ఎడంవైపున" రూప తడుముకోకుండా అంది.

"బాగా గుర్తుచేసుకో!" డిటెక్టివ్ టెంపో హెచ్చరించాడు.

"అవసరంలేదు. బావకి ఎడమవైపు మెడమీద, చెవికింద కుంకుడుకాయ సైజులో పులిపిరికాయ వుండేది. దానికి కొంచెం కిందుగా గాయమైంది. నాకు బాగా గుర్తు.... టెంపోగారూ....ఆ వివరాలన్నీ ఇప్పుడు దేనికి? అది ఆత్మహత్యగా నిర్ధారించబడింది;" రూప ఆతృతగా అంది.

"రూపా, ఇంతకాలం నీ హృదయంమీద బరువుగా కూచున్న పర్వతాన్ని దించేస్తున్నా: నువ్వు నీ బావని మర్డర్ చేయలేదు!"

"మిస్టర్ టెంపో....నిజంగా? నిజంగా....?" రూప వణికే కంఠంతో అరిచింది.

"నిజంగా. నీ బావమీద వొట్టు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"నేను... నేను....నమ్మలేకుండా వున్నాను...."

"రూపా, నువ్వు పడమరగా తిరిగి నుంచుంటే, మీ బావి గోడమీద పిల్లిలా, ఉత్తరం వేపు తిరిగి వుంటే— అతని తల ఉత్తరం వేపు వుంటే—అతని మెడ యే వైపు నీకు అవుపిస్తుంది?...." టెంపో గంభీరంగా ప్రశ్నించాడు.

అతని ప్రశ్నని జీర్ణం చేసుకోడానికి రూపకి రెండు మూడు క్షణాలు పట్టింది. "మెడ కుడిభాగం.... నావైపు వుంటుంది...."

"రైట్. రివాల్వర్ తూటా అతని మెడలో ఏవైపు దూరింది?"

"ఎడమవైపునే అని ఇందాక చెప్పాను...."

"రైట్. మెడ కుడిభాగం నీవైపుకి తిరిగివుంటే, నీ రివాల్వర్ గాయం ఎడమభాగంలో ఎలా ఏర్పడుతుంది?" డిటెక్టివ్ టెంపో గంభీరంగా ప్రశ్నించాడు.

రూప ఊపిరి పీల్చుకోడం మరిచిపోయింది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. తను అక్కయ్య పసుపు కుంకుమల్ని చెరిపివేయలేదు! "టెంపోగారూ.... మై గాడ్! అప్పట్లో, ఇప్పటిదాకా ఆ ఆలోచనే రాలేదు నాకు! మీరు చెప్తుంటే....మతిపోతోంది! అయితే.... అయితే ..."

"యస్! నీ వైపున్న భాగంలో కాకుండా, వేపచెట్టు వైపున్న మెడ భాగంలో తూటా దిగింది. అంటే, అటు వైపు నుంచీ మరేదో రివాల్వర్ పేలింది!" టెంపో కంఠంలో గాంభీర్యం జేగంటలా పలికింది.

"ఎవరు పేల్చారు?" రూప కంఠం వణికింది. "ఎక్కణ్నుంచీ పేల్చారు?"

"రూపా, ఎవరో వ్యక్తి చీకట్లో జపచెట్టు మీంచీ డాబామీదికి దాటే ప్రయత్నం చేస్తున్నాడు. రాడీ అని నువ్వు అనుకున్నావు మీ అక్కయ్య రివాల్వర్ తీసుకురమ్మంది. అప్పుడు ఆమె నీ కూడా లోపలి గది లోకి వచ్చిందా?" టింపో ప్రశ్నించాడు.

"....వచ్చింది...."

"నువ్వు రివాల్వర్ తో తిరిగొచ్చాక. అతను యింకా గోడ దాటుతూనే వున్నాడా?"

"ఆ. దాటుతూ, గోడమీదికి బోర్లా వొంగున్నాడు...."

"రూపా, రివాల్వర్ తీసుకుని తిరిగొచ్చేదాకా గోడని బల్లిలా కరుచుకుని అతను దాటుతూ, దాటుతూ వుండి పోయాడా?" టింపో కంఠంలో నవ్వు స్పష్టంగా ధ్వనించింది.

"....అనే అనుకున్నాను ..." రూప సందేహిస్తూ అంది.

టింపో సగర్వంగా నవ్వాడు. "పిట్ట గోడమీదికి చేరిన వ్యక్తి క్షణంలో డాబామీదికి దూకుతాడు. నువ్వు గదిలోకెళ్ళి తిరిగి వచ్చేంత వ్యవధి అనవసరం. అంటే నువ్వు తిరిగొచ్చేసరికి మొదటి వ్యక్తి కాకుండా రెండో వ్యక్తి గోడమీద బోర్లా వున్నాడు...

"రెండో వ్యక్తి? బావ తప్ప మరెవరూ రాలేదు పైకి!" రూప అడ్డొస్తూ అంది.

"అఫ్ కోర్స్. మొదటి వ్యక్తి చెట్టుపైకి పాకే ప్రయత్నంలో వున్న మీ బావను చూసివుంటాడు. గోడ మీంచీ, పిల్లిలా మళ్ళా కొమ్మమీదికి పాకి, అటువైపు గుబురు కొమ్మల్లోకి జారుకున్నాడు. తాగిన మైకంలో

వున్న మీ బావ చెట్టెక్కి గోడమీదికి చేరుకున్నాడు. అతను గుబురు కొమ్మల్లోంచి గుడ్లగూబలా అంతా చూస్తున్నాడు. కిటికీ ముందు నువ్వు రివాల్వర్‌తో అతనికి కనిపించివుంటావు. గురిచూసి, అతను కాల్చాడు. తూటా అందుకే నీ బావ ఎడమవైపు దూరింది!"

"టెంపోగారూ, తల తిరిగిపోతోంది! ఆ మొదటి వ్యక్తి, చెట్టుమీదున్న వ్యక్తి ఎవరు? రూప కంఠం ఆశ్చర్యంగా మారింది.

"ఆ వ్యక్తే అసలు వ్యక్తి! ఆ రాత్రివేళ, అక్కడ వెల్తురుందని నీకు చెప్పిన వ్యక్తి అతనే అయ్యుండాలి. అక్కడ వున్నవాళ్ళకి తప్ప, అక్కడ వెల్తురున్నట్టు తెలీదు!"

"టెంపోగారూ....యూ మీన్....ఇప్పుడు గుర్తొస్తోంది. రివాల్వర్ శబ్దం కాసేపు ప్రతిధ్వనించినట్టనిపించింది. ఆ ప్రతిధ్వని అతని రివాల్వర్ చప్పుడన్న మాట!"

"రూపా, ఇప్పటికి ఇది చాలు. తరువాత అంతా చెప్పుకుందాం. అర్జెంటు పనుంది!"

"అలాగే! టెంపోగారూ....చాలా చాలా చాలా థాంక్స్!" అంటూ రూప రిసీవర్ని పెట్టేసింది. ఉద్రేకంతో తనచుట్టూ చూసింది. ఆఫీసు ఖాళీగా వుంది. గొంతెత్తి అరుస్తూ, గెంతులేస్తూ తను హత్య చేయలేదని లోకానికి చాటాలనిపిస్తోందామెకి.

టెలిఫోన్ మోత ఆమె ఉద్రేకానికి ఆనకట్ట వేసింది....

రిసీవర్ అందుకుని "హాలోవ్" అంది రూప.

"రూపా, మరచాను. సాయంత్రం యింటి కెళ్ళి

శుభ్రంగా తయారై ఏడుగంటలకి నన్ను కల్సుకో. అంటే సరిగ్గా ఆరున్నరకి నువ్వు బయల్దేరాలి. ఇద్దరం వెళ్ళి ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్‌ని కల్సుకుందాం. అతనికి నీ స్టేట్‌మెంట్ కావాలి........" అన్నాడు టెంపో.

"అలాగే....తప్పకుండా....!" రూప ఉత్సాహంగా అంది.

## 6

గాలిలో తేలిపోతున్న దానిలా రూప మెట్లన్నీ ఎక్కేసింది. మరో పావుగంటలో తను బయల్దేరాలి....

తాళం తెరిచి తలుపుతోసి ముందు గదిలోకి జొరబడింది. పర్సుని టేబుల్ మీదికి విసిరింది. లోపలి గదిలోకి వేగంగా నడిచింది. ఎదురుగా గోడ అడ్డొచ్చినట్టు తటాలున ఆగింది.

కెవ్వున అరవబోతూ, బలవంతంమీద ఆపుకుంది. గోడవారగా వున్న చిన్న టేబుల్ మీద అతను కూచున్నాడు....

"వెల్‌కమ్!" అతని కంఠం కీచుగా వుంది.

మనిషిని గుర్తుపట్టలేకపోయినా, కంఠాన్ని చిటికెలో గుర్తుపట్టింది రూప. అతనే! వణుకుతున్న చేతిని వణుకుతున్న పెదవులకి అడ్డంగా పెట్టుకొని, భయాందోళనలతో చూసింది. సన్నగా వున్న అతని ఆకారం మరీ అంత పొడుగ్గా లేదు. పొడుగ్గా పెరిగిన జుట్టు చెవుల్ని కప్పేసింది.

"గుర్తుపట్టావన్న మాట! ఫరవాలేదు. మూడోసారి, నిజం చెప్పాలంటే చివరిసారి వచ్చాను!" అన్నాడతను నించుంటూ, తెల్లగా పాలిపోయిన రూప మొహంలోకి,

భయానికి పట్టిన అద్దాలా వున్న ఆమె కళ్ళల్లోకి తృప్తి కరంగా చూస్తూ ముందుకి జరిగాడు.

"ఎలా....ఎలా వచ్చావ్?" అపుకోలేని ఆశ్చర్యంతో ప్రశ్నించిందామె. తన గదుల్లోకి మెట్ల దగ్గర తలుపు తప్ప వేరే లేదు. వేసిన తాళం వేసినట్టే వుంది!

అతను సగర్వంగా నవ్వాడు. "నిన్ను ఆడించే 'కీ' నా దగ్గరున్నట్టే, నీ గదితళం తెరిచే కీ కూడా వుంది తాళం తెరిచాను. రోడ్లో వున్న బిచ్చగాణ్ని వెంట తీసుకువచ్చాను. నా భార్యని ఆటపట్టించి, తమాషా చేయాలని వాడికి చెప్పి, బైట తాళం వేసి, కిటికీగుండా తాళంచెవి విసరమన్నాను. రూపాయినోటు చూశాక, వాడు చెప్పినట్టు చేశాడు. సో, వేసిన తాళం వేసినట్టే వుంది!"

రూప అయోమయంగా చూసింది. అతని మొహం లోని ఏవో పోలికల కోసం ఆమె కళ్ళు వెతుకుతున్నాయి.

"కథ చాలా, చాలా దూరం సాగిందన్నమాట!" అతని కంఠం కటువుగా వుంది. అతని కళ్ళు వడగళ్ళలా వున్నాయి.

"ఏమిటి నీ అర్థం?....ఇంతకీ....నువ్వు ఎవ్వరు?" ధైర్యాన్ని చిక్కబట్టుకుంటూ రూప అడిగింది.

"నన్ను తిన్నగా చూసివుంటే, ఎప్పుడో గుర్తుపట్టగలిగేదానివి! నన్ను నువ్వు పూర్తిగా నిర్లక్ష్యం చేశావు. ఆల్ రైట్ ....యేమంటాడు నీ డిటెక్టివ్ బెంనా?" అతని కంఠంలో ఎగతాళి ధ్వనించింది.

"ఎవరతను?" రూప అమాయకంగా అంది.

అతను పళ్ళు కొరుకుతూ చూశాడు. "అయితే, నీ

బావను నువ్వు చంపలేదని నిరూపించబోతున్నావన్న మాట!"

రూప ఉలిక్కిపడింది. ఇతనికి ఎలా తెలుసు?

"నువ్వు చేసిందంతా, నువ్వు చేయబోయేదంతా నేను దివ్యదృష్టితో చూశాను! ఎవర్నీ కలుసుకోవద్దని హెచ్చరించాను. నిర్లక్ష్యం చేశావు. అతి తెలివి డిటెక్టివ్ ని కల్సుకున్నావ్ రూపా, పొరపాటు చేశావ్. శిక్ష అనుభవిస్తావ్ ...." అంటూ అతను ఆమె దగ్గరగా కదిలాడు. మృత్యువు తొంగిచూస్తోన్న అతని కళ్ళల్లోకి ఆమె కంగారుగా చూసింది. వణుకుతూ పక్కకి గెంతి, టేబుల్ దగ్గరగా చేరింది.

"నేను... ఎవర్నీ కలుసుకోలేదు ...." అప్రయత్నంగా అబద్ధమాడింది రూప.

అతను పకపక నవ్వాడు. అతని చెయ్యి పాంటు జేబులోకి వెళ్ళి, యివతలికి వచ్చింది, తళుక్కున మెరిసిన ఎర్రపిడి కత్తిని భయంతో చూసింది రూప. తను యింటికి రాకుండా వుంటే బావుండేది.... వణుకుతున్న శరీరాన్ని బలవంతంగా కంట్రోలు చేసుకుంటూ మరి కొంచెం వెనక్కి జరిగింది. టేబుల్ ఆమెని అడ్డుకుంది. రూప నాలుక ఎండిపోతోంది.

"ప్లీజ్ ...."

"డిటెక్టివ్ టెంపోని కల్సుకున్నావ్. గతంలో జరిగిందంతా తవ్వించావు. నీ రివాల్వర్ తూటాతో నీ బావ చావలేదని అతను కనిపెట్టాడు. మరో వ్యక్తి వాడి చావుకి కారణమన్నాడు. ఆ వ్యక్తి నేనే అని నీతో చెప్పాడు. నీకు చాలా విషయాలు తెలిశాయి. ఆ తెలుసుకోడమే నీకు ప్రాణాంతకం అయ్యింది. నువ్వు బతి

కితే....ప్రమాదం...." అంటూ అతను కత్తిని తృప్తి కరంగా చూశాడు.

రూప ఆశ్చర్యంతో వింది. ఇన్ని విషయాలు, ఇవాళ మధ్యాహ్నం తనకి తెలిసిన విషయాలు ఇతనికెలా తెలుసు? ఏదోవిధంగా మాటల్లో దింపి అతన్ని యేమార్చాలి....లేకపోతే....అతని చేతిలోని కత్తి...

"నువ్వెవరో నాకు తెలీదు. నీమీద ఎవరికీ అనుమానంలేదు. ప్లీస్....వెళ్ళిపో....ఆ గదిలో పర్సుంది.... పట్టుకుపో...."

"లాభంలేదు. నువ్వు బుకాయించలేవు. ఇంతా తెలిశాక, నీకు అంతా తెలిసినా పోయేదేమీ లేదు! కాసేపట్లో పరలోకానికి వెళ్తే నువ్వు ఎంత తెలుసుకున్నా ఫర్వాలేదు!" అంటూ అతను తన జుట్టుని పట్టుకున్నాడు. అతని చెయ్యి తటాలున కదిలింది.

అతని చేతిలోకి ఊడివచ్చిన విగ్గుని రూప నివ్వెరపోతూ చూసింది. విగ్గుని పాంటుజేబులో దోపుకుంటూ ఆమెవైపు చూసి వెటకారంగా నవ్వాడతను. కాస్సేపట్లో వెడల్పాటి మీసం అతని వేళ్ళమధ్య తగులుకుని, జేబులోకి వెళ్ళింది. రూప రెప్పలు టపటపలాడిస్తూ చూసింది. బోడిగుండు. ఆడంగి మొహం.

"కుమార్!" ఆశ్చర్యంతో అసంకల్పితంగా అరిచిందామె. అతను విజయగర్వంతో నవ్వాడు.

"యస్! కుమార్....ఇది ఇప్పటి పేరు; ఇప్పటి రూపం. నీకోసం వేటాడుతూ వచ్చి, పేరూ, ఆకారం మార్చేసుకున్నా. అప్పటి రూపం నీకు గుర్తుకురాదు. ఎందుకంటే, అప్పుడు....అప్పుడు..నువ్వు అహంకారంతో నన్ను చీపురుపుల్లలా చూశావు. గుర్తుంచుకునే చూపు

కాదది. నిన్ను నాకు కాకట్టు పెట్టి నీ బావగాడు యాభై వేలు బాకీపడ్డాడు. అడిగితే తిరగబడ్డాడు. రూపాలేదు, రూపాయిలూ లేవు చేతనైంది చేసుకొమ్మన్నాడు. ఈ నాగరాజుని మోసంచేసి యెవ్వరూ తప్పించుకోలేరు! అందుకే ఆ రోజు నీకోసం వస్తున్న నాకు నీ బావ అడ్డు తగిలాడు. పొట్టులో దాక్కుని కాల్చిపారేశాను! నీ ఆశాక్కు నువ్వు పడిన బాధా, వేసిన ప్లానూ చూశాను. హత్యని ఆత్మహత్యలా చిత్రించావు. నిన్ను మెచ్చు కుంటూ జారుకున్నాను."

ఆగి తననే చూస్తున్న అతన్ని రూప ఆశ్చర్యంగా చూసింది. కుమార్....,నాగరాజు.....చాలా మారింది అతని రూపం,

"జారుకున్నాను కానీ, నీ రూపం, నీ అందం నన్ను వెంటాడుతూనే వున్నాయి. నాకు దక్కని నీ సౌంద ర్యం, నీ ప్రేమా మరొకరికీ దక్కకూడదు! నీ అక్క మొగుడూ నీమీద కన్నేశాడు. మెల్లిగా మత్తులోకి దించి, నీ కొంప ముంచి, నీ మెడలు వొంచి నాకు ఇచ్చే స్తానన్నాడు. నాది ఎంగిలికూడు తినే ఆలోచన నాకు లేదు! వాణ్ని పైకి పంపడానికి అదికూడా ఒక కారణం!"

నాగరాజు ఆగి రెప్పలు వేయుని కళ్ళతో చూశాడు. యేదో లోకంలోంచీ మరేదో లోకంలోకి,—శూన్యం లోకి చూస్తున్నట్టున్న అతని కళ్ళు ఆమెకి వణుకు పుట్టి స్తున్నాయి.

"నీమీద కోరికలాగే, నీ జీవితంలో అడుగుపెట్ట బోయే వ్యక్తిమీద ద్వేషం పెరగసాగింది నాలో. నీకోసం యెవ్వరూ ప్రస్తుతం చేతులు చాచకపోవచ్చు. కానైనా యెవరో ఒకడు నీకోసం వస్తాడు! ఎవడికీ నువ్వు

దక్కడం నేను సహించను. అంత పిచ్చిగా నిన్ను కోరాను నేను! అయితే వాయిదాలో నిన్ను నా సొంతం చేసుకోవాలనుకున్నాను. జీవితాంతం కాకపోయినా, ఒకరోజు, ఒకసారి నిన్ను నా 'వస్తువు'గా వాడుకోవాలనుకున్నాను!" నాగరాజు రూప మొహంలోకి వెర్రిగా చూశాడు. రూప గుండె దడదడ కొట్టుకుంది.

"నో!" అప్రయత్నంగా అరిచిందామె.

అతను నిర్లక్ష్యంగా నవ్వాడు. "నా గురించి అంతా నీకు తెలిసిపోయింది. నువ్వు బతికితే నేను చస్తాను! అందుకే నా ఒరిజినల్ ప్లాన్ని మార్చేశాను. నువ్వంటే నాకు కోరికవుంది. కానీ మృత్యువుమీద ఇష్టం లేదు! డిటెక్టివ్ టింపో సహాయం తీసుకుని, నువ్వు నాకు మృత్యువయ్యావు!"

"నువ్వు అనవసరంగా అనుమానిస్తున్నావు. జరిగిందంతా మరిచిపో. హత్య నువ్వు చేసినట్టు రుజువైనా కూడా చచ్చిపోయిన బావ తిరిగిరాడు. అంతా మరిచిపోయి, నన్ను మరిచిపోయి నీ దారిన ఎటో వెళ్ళిపో. నువ్వు లేనట్టే భావించి, నా బతుకు నేను బతుకుతాను. నీ గురించి యెవ్వరికీ చెప్పను...." రూప చకచకా ఆలోచిస్తూ అంది.

నాగరాజు వికటంగా, గర్వంగా నవ్వాడు. "నీ నాగస్వరానికి ఈ నాగుపాము బుట్టలోకి దూరదు! నన్ను కాదన్న నువ్వు ఎవడితోనూ సుఖపడకూడదు. నేను జీవించాలంటే నువ్వు మరణించాలి! నా మృత్యువుకు మరణశిక్ష విధించడానికి నిశ్చయించుకున్నాను...."

"నాగరాజూ...." రూప అద్ధుతకిలింది.

అతడు కళ్ళు పెద్దవి చేస్తూ గొణిగాడు. "మొదటి సారిగా నా పేరు పలికాయి నీ పెదవులు. ఆఖరిసారి కూడా ఇదే. నిన్ను కౌగలించుకోడం నాకిష్టమే. కానీ, మృత్యువును కౌగలించుకోడం ఇష్టంలేదు. నా మృత్యువు నువ్వే!"

నాగరాజు కత్తిని వేళ్ళమధ్య బిగించి, తదేకంగా ఆమెనే చూస్తూ రెండడుగులు ముందుకి వేశాడు. రూప అసంకల్పితంగా కంపించుకుపోతూ టేబుల్‌ని తప్పుకుని వెనక్కి కదిలింది. గోడ ఆమె వీపుకి గట్టిగా తగిలింది. చెమటలు కక్కుతూ, నెత్తురుచుక్కల్లా వున్న అతని కళ్ళల్లోకి కంగారుగా చూసిందామె.

"నాగరాజా, కత్తిని కింద పడేయ్. నీ వెనక డిటెక్టివ్ టెంపో వున్నారు!" రూప ధైర్యంగా అంది.

నాగరాజు ఆమె కళ్ళల్లోకి చూశాడు. "నేను తల వెనక్కి తిప్పను. చాలా సినిమాల్లో ఈ ట్రిక్ చూశాను!" కత్తి వున్న చేతిని కొంచెం ఎడంగా జరిపి, కొద్దిగా ముందుకి వంగాడతను. అతని ఎడమచెయ్యి కూడా దూరంగా సాగింది. గుక్కపట్టుకుంటూ కబడీ ఆడుతున్న వ్యక్తిలా వున్నాడతను.

రూప గుండె రెపరెపలాడుతోంది. పెదవులు వణుకుతున్నాయి. ముందు కత్తి, వెనకగోడ! తనేం చేయాలి? ఏం చేయాలి? వేటగాడి కత్తికింద తగుల్కొన్న జింకలా ఆమె లోపల్లోపలే విలవిల్లాడిపోసాగింది. తటాలున ఆమె కళ్ళు మెరిశాయి. కలా? నిజమా?

నాగరాజా వెనక. గుమ్మంలో ప్రత్యక్షమైన డిటెక్టివ్ టెంపోనీ యూనిఫామ్‌లో వున్న వ్యక్తినీ ఆశ్చర్యంగా చూసిందామె. కళ్ళని వాళ్ళమీంచి మార్చాలి. వాడు

చూస్తే, తనమీదికి దూకేస్తాడు! చూపుల్ని గుమ్మం మీంచీ నాగరాజువైపు యమప్రయత్నంలో తిప్పింది రూప.

నాగరాజు తేలికగా నవ్వాడు. "నీ చూపులూ, నీ నటనా నన్ను యేమార్చలేవు!" అంటూ అతను కొంచెం ముందుకి కదిలాడు. గోడకి పాకుతున్న బల్లిలా రూప అలాగే పక్కకి జరగసాగింది. పళ్ళు కొరుకుతూ నాగరాజు ముందుకి దూకాడు. అతని చేతిలోని కత్తి మెరుపులా కదిలింది.

రూప తటాలున కుడివేపుకి, టేబుల్ దగ్గరగా కదిలింది. అంగుళం దూరంలో గడ్డం కిందుగా కత్తి దూసుకెళ్ళింది. నాగరాజు ఉక్రోషంలో యేదో చప్పుడు చేశాడు. అతని చెయ్యి మళ్ళీ పైకి లేచింది. రూప కళ్ళు మెరిశాయి.

డిటెక్టివ్ టొంపో చెయ్యి కత్తిలా నాగరాజు ముంజేతిమీద ఫట్ మంటూ వాలింది. అతని చేతిలోని కత్తి ఎగిరి దూరంగా పడింది.

ఊహించని సంఘటనతో ఉలిక్కిపడి నాగరాజు తటాలున వెనక్కి తిరిగాడు. టొంపో పిడికిలి సుత్తిలా అతని మొహంమీద వాలింది. టేబుల్ మీద విసురుగా పడిపోయాడు నాగరాజు. ఇన్స్పెక్టర్ చేతిలోని రివాల్వర్ అతని డొక్కలో గూటంలా గుచ్చుకుంది.

"కదిలితే శవమే అయిపోతావ్, స్కౌండ్రల్!" పృథ్వీరావ్ కంఠం ఖంగుమంది. నాగరాజు కళ్ళు నెత్తురు వర్షించేలా వున్నాయి.

రూప నివ్వెరపాటునుండీ తేరుకుని, డిటెక్టివ్

జెంపో వైపు గాలిలా దూసుకొచ్చింది. రెండు చేతుల్తో అతన్ని వాటేసుకుని పసిపిల్లలా వెక్కి వెక్కి ఏడవసాగింది.

ఆమె వీపుమీద చేతిని వేసి జెంపో ఇన్స్పెక్టర్ వైపు చిరునవ్వుతో చూశాడు. పృథ్వీరావ్ జేబులోంచి బేడీలు తీశాడు.

## 7

"మిస్టర్ జెంపో, సరిగ్గా సమయానికి దేవుడిలా వచ్చారు. లేకపోతే....ఆ రాక్షసుడు...." రూప ఆగి, జెంపో వైపు విడ్డూరంగా చూసింది.

"నన్ను ఇక్కడికి ఏడింటికి రమ్మన్నారు. నా గదికి మీరు ఎలా రాగలిగారో అర్థం కావడం లేదు!"

"నేనుకూడా అదే ఆలోచిస్తున్నా!" ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ నవ్వుతూ అన్నాడు. "ఉన్నట్టుండి నువ్వు బయలుదేరేసరికి, నాకు ఏమీ తోచలేదు!"

డిటెక్టివ్ జెంపో చిరునవ్వుతో రూపని చూశాడు. "మధ్యాహ్నం నీకు ఫోన్ చేశాను. చివర్న నువ్వు రిసీవర్ని పెట్టేశావు. నేను రిసీవర్ పడేసేలోగా మరోసారి చిన్నగా చప్పుడైంది. ఎక్స్టెన్షన్ని పెట్టేసినప్పుడు అయ్యే చప్పుడు. మన సంభాషణని, మనిద్దరం కాకుండా మూడో వ్యక్తి ఎవరో విన్నారు! అందుకే, ఆ వ్యక్తిని బోల్తా కొట్టించడానికే మళ్ళీ ఫోన్ చేశాను. ఆరున్నరకి నీ గదినుండీ బయల్దేరి క్రైమ్ బ్రాంచికి రమ్మన్నాను. నా అనుమానం నిజమైతే, ఆరున్నరలోగా అతను నిన్ను అటకాయిస్తాడనుకున్నాను. అందుకే ఇన్స్పెక్టర్ని తీసుకుని నీ గదికి వచ్చేశాను. కుమార్ నాగరాజుగా తన నిజరూపాన్ని నీకు చూపించినప్పటికే మేం ముందు

గదిలో వున్నాం!"

"మై గాడ్!" రూప ఆశ్చర్యంతో అంది.

"'అయితే, డిటెక్టివ్ టెంపో నీ వెనక వున్నారు!' అని నువ్వు వాడితో అన్నప్పుడు ఇద్దరం ఆశ్చర్యపోయాం! తెలీకపోయినా నిజం చెప్పావు!" టెంపో నవ్వుతూ అన్నాడు.

"టెలిఫోన్ డిస్కనెక్టు శబ్దం మీ చెవికి సోకకుండా వుంటే, నేను ఇప్పటికి శవంగా మారి వుండేదాన్ని!" రూప వణికే కంఠంతో అంది.

సిగరెట్ ముట్టించి టెంపో చిన్నగా నవ్వాడు. "అలా జరిగివుండదు. ఎందుకంటే మొదట నువ్వు నన్ను కలుసుకున్నప్పట్నుంచీ మీ ఆఫీసులో వ్యక్తే ఎవడో నీతో బ్లాక్ మెయిలాట ఆడుతున్నాడని నాకు అర్థమైంది...."

"వాట్! నాకే ఆ అనుమానం రాలేదు! ఎలా అనుమానించారు?" రూప కళ్ళింత చేస్తూ అడిగింది.

"నీ కథనం ప్రకారం బ్లాక్ మెయిలర్ నిన్ను కల్సుకున్న రోజే నీ జీతం వందరూపాయలు పెరిగింది. అవునా?" డిటెక్టివ్ టెంపో ప్రశ్నించాడు.

"ఔను. ఆ రోజే జీతంకూడా ఇచ్చారు. తొమ్మిది వందలు...." రూప జవాబిచ్చింది.

"ఆ రాత్రి నిన్ను కల్సుకున్న బ్లాక్ మెయిలర్ తొమ్మిదివందల్లో సగం నాలుగువందలయాభై తీసుకుంటున్నట్టు నీతో అన్నాడు...."

"కరెక్టు....అయితే...." రూప అడ్డు తగింది.

"రూపా, నీ జీతం పెరిగినట్టు ఎవరెవరికి తెలుసు?" టెంపో ప్రశ్నించాడు.

“ప్రొప్రయిటర్‌కీ నాకు. నాలుగైదు నెలలు క్రితం ఇంక్రీజ్ గురించి ఎవ్వరికీ చెప్పొద్దన్నాడాయన. నేను ఎవ్వరికీ చెప్పలేదు ...”

“అయినా, ఆ సంగతి అతనికి తెలిసింది. నీ జీతం తొమ్మిదివందలు అని నీ ఆఫీసులోని వాళ్ళకే తెలియాలి. బైటివాళ్ళకి అదే రోజు తెలీడం అసంభవం! పైగా పర్సుని నువ్వు జాకెట్లో దాచుకుంటావని అందరికీ తెలీదు!” డిటెక్టివ్ టెంపో నవ్వుతూ అన్నాడు.

రూప నివ్వెరపోతూ చూసింది. “టెంపోగారూ, ఆమాత్రం ఆలోచన కూడా నాకు తట్టలేదు! పైగా కుమార్ని బోడిగుండుతో—రోజూ చూస్తున్నా కూడా నాకు అనుమానం రాలేదు. చాలా వినయంగా వుండే వాడు!”

“నీకోసం వెతుకుతూ అతను ఈ ఊరు చేరాడు. నీ కథంతా తెలుసుకున్నాడు. నీ ఆఫీసులోనే ఉద్యోగం సంపాదించాడు....”

“ఆ ఉద్యోగం ఎలా సంపాదించాడో అర్థంకాకుండా వుంది....” అంది రూప.

“నాగరాజు గుంటనక్క. అతనొచ్చేసరికి నీ ఆఫీసులో పని చేస్తున్న రాజుని కల్సుకున్నాడు. అతన్ని మంచి చేసుకున్నాడు. తను అప్పటికే మరోచోట నౌకరీ సంపాయించాడు. ఆ యజమాని దగ్గరకు రాజుని తీసికెళ్ళాడు. తనకి బ్లడ్ కాన్సర్ వుందని డాక్టరన్నాడనీ, తన బావమరిదిని తన స్థానంలో వుంచుకొమ్మనీ ప్రాధేయపడ్డాడు. రాజుకి వెయ్యి రూపాయలిచ్చాడు.

తనకి బ్లడ్ కాన్సర్ తగులుకున్నట్టు రాజు మీ ప్రొప్రయిటర్‌తో నాటకం ఆడాడు. తన బావమరిది

కుమార్తెని తన నౌకరీలో వుంచుకొమ్మన్నాడు! ఈ డ్రామాతో నాగరాజు కుమార్తెగా మీ ఆఫీసులో చేరాడు. నాగరాజు చచ్చిపోయాడని ఖాయంగా నమ్మి వున్న నీకు, బాగా సన్నబడిన, గుండు గీయించుకున్న కుమార్తెని పోల్చుకునే అవకాశం లేకపోయింది!" డిటెక్టివ్ టెంపో వివరించాడు.

"గుడ్ గాడ్! టెంపోగారూ....ఇదంతా మీ కెలా తెలుసు?"

"మన ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ నాగరాజు చేత అర గంటలో ఆటోబయాగ్రఫీ రాయించాడు!" టెంపో నవ్వాడు. పృథ్వీరావ్ తృప్తికరంగా శృతి కలిపాడు.

"టెంపో, రూప తన బావని హత్య చేయలేదన్న అనుమానం నీకెలా కలిగింది? వేషమూనూ, బుల్లెట్.... అదంతా ఎలా ఊహించావు?" ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ ప్రశ్నించాడు.

డిటెక్టివ్ టెంపో నవ్వాడు. "ఒకటి: రూప హత్య చేశానంటోంది. ఆత్మహత్యగా దిద్దానంటోంది. బ్లాక్ మెయిలర్‌కి ఆమె హత్య చేసిందని తెలుసు. రూప దాచి పెట్టినా అసలు సంగతిని మనం చట్టం నుంచీ దాచకూడదు. రూప నా క్లయింట్ కావొచ్చు. బ్లాక్ మెయిలర్ చేతిలో క్షణక్షణం చావడం కంటే చట్టం యిచ్చే శిక్షని అనుభవించడం మంచిది. అంచేత, ఆ కేసు గురించి పూర్తి వివరాలు సేకరించే ఉద్దేశంతో నీ సహాయం అడిగాను.

"రెండు: ఆ సమయంలో అక్కడ వెల్తురున్నట్టు రూప పోలీసులకీ యెవరికీ చెప్పలేదు. అయితే అక్కడ వెల్తురున్నట్టు నాగరాజుకి యెలా తెలిసింది? అతను

అక్కడే వున్నాడు గనుక! ప్రత్యక్షంగా అక్కడున్న వ్యక్తి, రూప హత్య చేసిందని బుకాయిస్తున్న వ్యక్తి పోలీసులకి ఎందుకు చెప్పలేదు?"

"ఎందుకు?" రూప ప్రశ్నించింది.

"చెప్తే అతను ఇరుక్కుంటాడు. అతను అంత రాత్రి వేళ అక్కడ యెందుకున్నాడని పోలీసులు ప్రశ్నిస్తారు! పోలీసులు తీగ లాగితే, నేరస్థుని డొంక అంతా కదుల్తుంది!"

"కరెక్ట్!" పృథీరావ్ ఉషారుగా అన్నాడు.

"టెంపోగారూ.... మీకు నే నెంతో ఋణపడి వున్నాను. అతని ద్వేషం తలచుకుంటూంటే గుండె యింకా దడదడ లాడుతుంది!" అంది రూప.

డిటెక్టివ్ టెంపో ఆమెని తదేకంగా చూశాడు. "రూపా. నాగరాజు ద్వేషం ఒక విధంగా నీ గిల్టీ కాన్షస్‌ని పోగొట్టింది. అతను పాములా పెంచుకున్న ద్వేషం, నిన్ను అన్వేషిస్తూ అతన్ని యిక్కడికి లాక్కొచ్చింది. చివరికి ఆ ద్వేషం అతని చేత గతాన్ని తవ్వించింది. ఆ ద్వేషం అతన్నే శిక్షించింది!"

"వెల్ సెడ్!" అన్నాడు పృథ్వీరావ్. డిటెక్టివ్ టెంపో లేచాడు.

"టెంపోగారూ, మీ ఫీజు?...." రూప మెల్లిగా అంది.

"నీ జీతం తక్కువగా! నేను కూడా వాయిదాల పద్ధతిలో పనులు చేసుకుంటాను!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఇన్స్పెక్టర్ పృథ్వీరావ్ పగలబడి నవ్వాడు. రూప చెమ్మగిల్లిన కళ్ళతో టెంపోని చూసింది, తటాలున లేచి

దగ్గరగా జరిగింది. ఒక్క ఉదుటున టెంపో తలని రెండు చేతుల్లో పట్టుకుని కిందికి వంచి, అతని చెంపమీద ముద్దెట్టేసింది.

టెంపో ఆశ్చర్యంతో ఆమె మొహంలోకి చూశాడు. రూప కళ్ళు తడిగా మెరుస్తున్నాయి.

"రూపా, పొరపాటు చేశావ్. ఇన్‌స్పెక్టర్ పృథ్వీరావ్ నా కంటే ఎక్కువ శ్రమపడ్డాడు. అతని రెండు బుగ్గలమీదా నువ్వు ముద్దెట్టుకోవాల్సి వస్తుంది!" టెంపో నవ్వుతూ అన్నాడు.

ఇద్దర్నీ అర్థంకానట్టు చూస్తున్న పృథ్వీరావ్ పకపక నవ్వుతూ వుండిపోయాడు.

—: అయిపోయింది :—

# నరహంతకి

సుంకరి రాంప్రసాద్

"రాంకుమార్! మినీకాయ్ దీవుల గురించి ఎప్పుడైనా విన్నావా?"

అంతకు క్రితం టేబిల్ పై ఉంచిన ఫైలును మళ్ళీ తిరగ వేస్తూ అడిగారు సి.బి.ఐ. చీఫ్ కరుణాకర్.

"అరేబియా సముద్రంలో లక్షదీవుల క్రింద, కొంచెం నైరృతి దిశగా వెళ్తే కనిపించే దీవులేగా.... సర్!" అన్నాడు రాంకుమార్ ఆసక్తిగా.

"యూ ఆర్ షార్ప్!" రాంకుమార్ వంక మెచ్చుకోలుగా చూసారాయన.

"ఈ మధ్య ఆ దీవులలోని ప్రజలు కొన్ని విచిత్రమైన రోగాలకు గురియై మరణిస్తున్నట్లుగా ప్రభుత్వానికి సమాచారం అందింది.... రాంకుమార్,

వెంటనే అయిదుగురు డాక్టర్లున్న ఒక బృందాన్ని సర్వే నిమిత్తం ఆ దీవులకు పంపడం జరిగింది.

పదిరోజులపాటు రోగగ్రస్థులైన ప్రజలనూ, ఆ పరి

సరాలనూ, వారి అలవాట్లనూ, వారి ఆహార నియమాలను క్షుణ్ణంగా పరిశీలించారు ఆ డాక్టర్లు.

ఆ రోగుల రక్తాన్ని, మల, మూత్రాలను పరీక్షించారు. ఆ రోగుల శరీరాలలో అత్యంత విషపూరితమైన రోగాణువులను వారు కనుగొన్నారు.

'ఇన్నాళ్ళూ హాయిగా, ఆరోగ్యంగా జీవిస్తున్న ఆ ప్రజలను రోగగ్రస్థులను చేస్తున్న ఆ విషపూరితమైన రోగాణువులు వారి శరీరాలలోనికి ఎలా వస్తున్నాయి?' అన్న అంశంపై వారు విస్తృత పరిశోధనలు గావించారు.

వారి పరిశోధనల్లో తేలిన నిజం ఏమిటంటే:

మినీకాయ్ దీవుల చుట్టూ వ్యాపించి వున్న సముద్ర జలాలలో లభిస్తున్న చేపల ద్వారా ఈ చిత్రవిచిత్రమైన రోగాలు అక్కడి ప్రజలకు సంక్రమిస్తున్నాయి.

వారు వెంటనే తమ పరిశోధనా ఫలితాలను ప్రభుత్వానికి పంపారు."

"సర్! ఒక్క సందేహం!"—అతని మాటలకు అడ్డు పడుతూ అడిగాడు రాంకుమార్.

"గో అన్ మైడియర్ బోయ్!" ఆరిపోయిన పైప్‌ను తీరిగ్గా ముట్టించుకుంటూ అన్నారు కరుణాకర్.

"నాగరికతా వాసనలు కూడా సోకని ఆ మినీకాయ్ దీవులలోని జలాలనూ, జలచరాలనూ విషపూరితాలుగా చేయడానికి అక్కడ పరిశ్రమలుగాని, పట్టణాలు గాని లేవే!

మరి....ఎలా అక్కడి జలచరాలు విషపూరితాలౌతున్నాయి!" అన్నాడు రాంకుమార్.

"సరిగ్గా నీలాంటి సందేహమే ఆ వైద్యబృందానికీ

వచ్చింది రాంకుమార్!

అందుకే, ఆ దీవి పరిసరాలను మరింత విస్తృతంగా పరిశోధించాలని ఒక స్టీమ్ బోట్ లో బయలుదేరారు వారు.

కాని, మినీకాయ్ దీవులను విడిచి కొద్ది కిలోమీటర్ల దూరమైనా పోకుండానే, వారు ప్రయాణిస్తున్న స్టీమ్ బోట్ దేనికో గుద్దుకొని ముక్కలైపోయింది. ఇరవై నాలుగు గంటల తరవాత ఆ డాక్టర్ల శవాలు ఒడ్డుకు కొట్టుకు వచ్చాయి.

సముద్ర గర్భంలో ఉండే పగడపు గుట్టలకు గుద్దుకోవడంవలన ఆ ప్రమాదం జరిగి ఉంటుందని మినీకాయ్ పోలీసు అధికారులు రిపోర్టు పంపారు.

రాంకుమార్!

ఆ డాక్టర్ల దుర్మరణంతో వారు చేస్తున్న పరిశోధన మధ్యలోనే ఆగిపోయింది.

మినీకాయ్ దీవులలోని మత్స్యాలు విషపూరితాలెందుకవుతున్నాయన్న ప్రశ్న రహస్యంగానే ఉండిపోయింది.

ఆ రహస్యాన్ని ఛేదించే బాధ్యతను మన డిపార్టుమెంట్ కు అప్పగించింది మన ప్రభుత్వం.

మైడియర్ బోయ్!

స్వచ్ఛమైన ఆ సాగర జలాలను విషపూరితాలుగా చేస్తున్న శక్తి యేదో నీవు కనిపెట్టాలి.

మనం తొందరపడి ఈ విషవలయాన్ని ఛేదించకపోతే భవిష్యత్ లో మినీకాయ్ దీవులలో మానవజాతే అంతరించిపోతుందేమో!"

ఎంత అణచుకుందామన్నా, దాగని ఉద్వేగంతో కరుణాకర్ గొంతు చిన్నగా వణికింది.

"మినీకాయ్ దీవులకు నన్ను ఎప్పుడు బయలుదేర మంటారు సర్?"

రాంకుమార్ ముఖంలో స్పష్టంగా కన్పిస్తున్న దీక్ష, పట్టుదలను చూసి సంతృప్తిగా తలాడించారు కరుణాకర్.

"దట్స్ ద స్పిరిట్ మై బోయ్!

ఈ రోజు సాయంత్రమే నీ ప్రయాణం. త్రివేంద్రంకు నీ పేర ఫ్లయిట్ టిక్కెట్ రిజర్వ్ చేయించబడింది. అక్కడనుండి మనీకాయ్ దీవులకు నీవు బోట్ లో ప్రయాణించాల్సి ఉంటుంది.

నీకు కావాల్సిన సహాయ, సహకారాలందించమని త్రివేంద్రం పోలీస్ కమీషనర్ కు ఆదేశాలివ్వబడ్డాయి.

బై ద బై. ఈ ఎసైన్ మెంట్ లో మెడికల్ సైన్స్ లో పరిజ్ఞానం వున్న మనిషియొక్క సహకారం కొంత నీకు అవసరం రావచ్చు.

అందుకే డాక్టర్ మాధవిని నీతో పాటు పంపిస్తున్నాను. ఈ ఎసైన్ మెంట్ లో ఆమె నీతో పాటు కలిసి పనిచేస్తుంది."

"డాక్టర్ మాధవి అంటే....." సందేహంగా అడిగాడు రాంకుమార్.

"ఆమె త్రివేంద్రంలోని మన ఏజెంట్ రాంకుమార్! ఎ వెరీ డైనమిక్ యంగ్ గర్ల్. షి గాట్ ద డాక్టరేట్ ఇన్ ఓషనాలజీ.

అయితే ఈ ఎసైన్ మెంట్ కు ఆమెను ఎంపిక చేయడానికి మరో ప్రత్యేకమైన కారణం ఉంది."

అర్థం కానట్లు తనకంత తెల్లబోతూ చూస్తున్న రాంకుమార్ ను చూసి చిన్నగా నవ్వాడాయన.

"ఇక్కడ, నీకు మినీకాయ్ దీవుల గురించి కొంత వివ

రంగా చెప్పాల్సి వుంటుంది రాంకుమార్!

పేరుకు మినీకాయ్ దీవులు భారతప్రభుత్వ అధీనంలో వున్నా, ఆ దీవిలోని ప్రజలు, అక్కడి పాలనా యంత్రాంగం అంతా చిమన్‌భాయ్‌పటేల్ చేతిలో ఉంది.

మినీకాయ్ దీవులకు అతడు మకుటంలేని మహారాజు. అనాగరికులైన ఆ దీవిలోని ప్రజలకు అతడి మాట వేద వాక్కు.

శివుడాజ్ఞ లేనిదే చీమయినా కుట్టనట్లు, అతని అనుమతి లేనిదే క్రొత్తవారు ఆ దీవుల్లో ఒక్క అడుగు కూడా ముందుకు వేయలేరు.

అలాంటి చిమన్‌భాయి పటేలుకు స్వయంగా మేనకోడలు అవుతుంది మిస్ మాధవి."

తనతోపాటుగా మిస్ మాధవిని మినీకాయ్ దీవులకు యెందుకు పంపిస్తున్నారో అప్పుడు అర్థం అయింది రాంకుమార్‌కు.

"మిస్ మాధవి సి.బి.ఐ. ఏజెంట్ అన్న విషయం ఆమె అంకుల్‌కు, అదే చిమన్‌భాయిపటేలుకు తెలుసా సర్?" అనుమానంగా అడిగాడు రాంకుమార్.

"నో మైడియర్ బోయ్!

షి. కెప్ట్ ఇట్ సీక్రెట్లీ!

తన ఐడెంటిటీని తన కన్నతల్లి ముందు కూడా బయట పెట్టలేదామె" అన్నారు కరుణాకర్.

సంతృప్తిగా తలాడించాడు రాంకుమార్.

## 2

"ఏమ్మా మాధవీ!

ఇన్నాళ్ళకు మా అంకుల్‌ను చూడడానికి తీరిక దొరి

కిందా? నిన్ను చూస్తుంటే అమ్మను చూసినట్లే వుంది. అమ్మ ఎలా వుంది మాధవీ?" ఆప్యాయంగా మాధవి తల నిమురుతూ అన్నాడు చిమన్ భాయ్ పటేల్.

సోఫాలో ఆతని ప్రక్కనే ఒద్దికగా కూర్చుని వుంది ఆమె. వారికి కాస్త దూరంలో వినయంగా చేతులు కట్టుకొని నిలబడ్డ యువకుని కేసి అనుమానంగా చూశా రాయన.

"ఆ అబ్బాయి ఎవరమ్మా?"

"మన డ్రైవర్ అంకుల్! పేరు కుమార్. నా థీసిస్‌కు కావాల్సిన మెటీరియల్ కోసం నేను ఈ దీవి చుట్టూ సముద్రంలో ప్రయాణించాల్సి ఉంటుంది. డిఫరెంట్ ప్లేసెస్‌లో వాటర్‌నూ, ఫిషెస్‌నూ కలెక్టు చేసుకోవాలి. వీటన్నిటికీ ఎలాగూ నాకు ఒక అసిస్టెంట్ కావాలి.

అంకుల్! యూ నో! కుమార్ ఈజ్ ఏన్ ఎక్స్‌పర్ట్ ఇన్ బోటింగ్!

"అప్పుడప్పుడు నేను డిక్టేట్ చేస్తుంటే నా నోట్సులను కూడా ప్రిపేర్ చేస్తుంటాడు.

యూ నో అంకుల్! హి ఈజ్ ఎ గ్రాడ్యుయేట్! బి.యస్సీ వరకూ చదివాడు. పాపం ఎక్కడా ఉద్యోగం దొరక్క మన దగ్గర డ్రైవర్‌గా చేరాడు.

నా కన్నివిధాలుగా సహాయంగా ఉంటాడని, నాతో పాటు కుమార్‌ను కూడా తీసుకువచ్చాను అంకుల్."

తనను మెచ్చుకుంటూ మాధవి చెబుతున్న మాటలకు ఇబ్బందిగా కదిలాడు కుమార్.

"కొంత్తానికి మంచి అసిస్టెంటునే సంపాదించావు మాధవీ!"

సన్నగా వీణ తీగలు మీటినట్లు వినిపించిందో కంఠ ధ్వని.

మాధవి, కుమార్ చటుక్కున తలలు పైకెత్తి చూశారు.

ఒక అందమైన యువతి వయ్యారంగా నడుచుకుంటూ మెట్లు దిగి వస్తోంది.

తనను అంత చనువుగా పేరుపెట్టి పిలుస్తోన్న ఆ అపరిచితురాలు యెవరా అని ఆశ్చర్యంగా చూస్తోంది మాధవి.

"మీ అత్తయ్య ఆయేషా!"—ఆ యువతిని మాధవికి చూపుతూ చెప్పాడు పటేల్.

"మీకు చెప్పనేలేదు మాధవీ!

ఇటీవల బొంబాయి వెళ్ళినప్పుడు ఆయేషాతో పరిచయం కల్గింది. అప్పటి పరిస్థితులలో అనుకోకుండా మా వివాహం జరిగిపోయింది"

బట్టతలపైన మిగిలిన కాస్త నెరిసిన జుట్టునూ ఇబ్బందిగా తడుముకొంటూ అన్నాడతడు.

"నమస్తే ఆంటీ!" సోఫాలో నుండి లేచి, రెండు చేతులనూ జోడించింది మాధవి. ఆమె భుజాలను ఆప్యాయంగా నిమిరింది ఆయేషా.

తన వయసే వున్న ఆయేషాను ఆంటీ అని మన్నించటం మాధవికి, ఆమె ముందు యెంతో పెద్దదానిలా మసలటం ఆయేషాకూ.... చెప్పలేనంత యిబ్బందిగా వుంది. ఆయేషా చూపులు మళ్ళించి కుమార్‌ను నఖశిఖపర్యంతం పరిశీలించసాగింది.

పడుచు అత్తయ్య ప్రక్క, ముసలి మామయ్యగా, మేనకోడలు మాధవి ముందు నిలబడాల్సి రావటం

పటేల్ కు మరింత ఇబ్బందిగా వుంది.

అయితే వీరందరి కంటే తెగ ఇబ్బంది పడుతున్నాడు కుమార్.

ఆయేషా చూపులను భరించటం అతనికి భరించలేనంత ఇబ్బందిగా వుంది

ఆమె చూపుల్లో భేటీ పడలేక, తలను పైకెత్తి, పై కప్పుకు వ్రేలాడుతున్న షాండిలర్స్ యొక్క సౌందర్యాన్ని సీరియస్ గా అధ్యయనం చేయసాగాడతడు.

తాళి కట్టిన భర్త ప్రక్క నుండగానే పరాయి మగవాడికేసి ఆకలి చూపులు చూస్తోన్న ఆయేషా స్వభావాన్ని అంచనా వేయడానికి ప్రయత్నిస్తోన్నాడు కుమార్.

త్రివేంద్రంలో ఉన్న తన తల్లి గురించి, తన చదువు గురించి కబుర్ల మీద కబుర్లు చెప్పేస్తూ పటేల్ అంకుల్ ను ఊదరగొట్టేయసాగింది మాధవి.

ఆ క్షణంలో ఆమెను చూసినవారు ఎవరైనా, ఆమెను అమాయకురాలైన ఆడపిల్ల పాపం! అనుకుంటారు తప్ప, అనుభవజ్ఞురాలైన ఒక సి.బి.ఐ. ఏజెంట్ అని కలలో కూడా ఊహించలేరు.

అంత అద్భుతంగా తన పాత్రను పోషిస్తూంది ఆమె. ఆమెకేసి ప్రశంసాపూర్వకంగా చూశాడు కుమార్.... అలియాస్ రాంకుమార్ ద స్టార్ ఏజంట్ ఆఫ్ సి.బి.ఐ

## 3

నిశిరాత్రి నెరజాణ బిగి కౌగిట సొక్కి, సోలిన అరుణ భానునికి సుప్రభాతం పాడటానికా అన్నట్లు పక్షులు కిలకిల రావాలు చేస్తోన్నాయి.

రాత్రంతా కురిసిన మంచు, ఆకులలో నుండి బొట్లు, బొట్లుగా నేలమీదకు జాలువారుతూంది.

వస్తూ, వస్తూ, తనతో పాటుగా, రాలిన ఇప్పపూల సుగంధాన్ని తెచ్చి, ఆ తోపంతటికీ పంచి మరీ వెళ్ళిందో పిల్ల తెమ్మెర.

సంపెంగ పొదలో నుండి మెల్లగా పైకి వస్తున్న ఒక కుందేళ్ళ జంట....ఎండుటాకులపై ఏవో పాద ధ్వనులు వినిపించడంతో, చెవులు రిక్కించి ఓసారి అటూ, ఇటూ చూపులు సారించి, చెంగున మళ్ళీ పొదలలోనికి దూకేశాయి.

తల్లి ఒడిలో ఒద్దికగా కూర్చుని, బుద్ధిగా స్తన్యాన్ని గ్రోలుతున్న ఒక పిల్లకోతి....అంత ఉదయాన్నే తమ తోపులోనికి వస్తున్న ఆ ప్రాణులెవరా అని ఆశ్చర్యంగా చూసింది.

అయితే....మౌనంగా నడుచుకొంటూ వస్తోన్న ఆ యువతీయువకుల దృష్టి పరవశింపజేసే ఆ ప్రకృతి అందాలపై లేదు. వారేదో దీర్ఘంగా ఆలోచిస్తోన్నారు.

నడుస్తోన్న రాంకుమార్ ఒక్కక్షణం ఆగి, చుట్టూ చూశాడు. ఆ తోపులో తాము తప్ప మరో నరమానవుడు లేడని ధృవపరచుకొన్నాక, సంతృప్తిగా తలాడిస్తూ ప్రక్కనున్న మాధవివంక చూశాడు.

"ఇప్పుడు చెప్పండి మాధవీ! వాట్ ఆర్ యువర్ ఫైండింగ్స్?" అన్నాడతడు మెల్లగా.

వారు ఆ దీవికి వచ్చి అప్పుడే ఇరవై నాలుగు గంటలు కావస్తూంది. ఆ ముందురోజు పగలంతా ఆ దీవినంతా స్పీడ్ బోట్ పై ఒకసారి చుట్టివచ్చారు వారు. ఆ దీవి చుట్టూ వున్న సముద్రంలో నుండి వివిధ దిక్కులలో

జలాన్ని, జలచరాలను సేకరించారు.

ఆ రాత్రికి వాటిని టెస్టు చేసి, రిపోర్టు తయారుచేసి వుంచమని, మాధవితో చెప్పాడతడు. తమ ఎక్స్పెరిమెంట్ కు సంబంధించిన యే విషయాన్నీ ఆ ఇంటి పరిసరాల్లో మాట్లాడవద్దని, ఉదయాన్నే, మార్నింగ్ వాక్ సాకుతో, ఆ యింటికి కాస్త దూరంలో వున్న అడవిలోనికి వెళ్దామని, ఏ విషయాన్నయినా అక్కడ ఏకాంతంగా డిస్కస్ చేద్దామని చెప్పాడతడు.

"మన వైద్య బృందం అనుమానించినది నిజమే కుమార్! ఈ దీవి చుట్టూ వున్న సాగర జలం పూర్తిగా కలుషితం అయిపోయింది. విషతుల్యమైన ఈ జలంలో పెరుగుతున్న చేపల ద్వారానే ఇక్కడి ప్రజలకు, విచిత్రమైన ఈ రోగాలు సంక్రమిస్తున్నాయి,"

జాకెట్ లో నుండి ఒక కాగితాన్ని పైకి తీస్తూ అంది మాధవి.

"ఈ సాగర జలం ఎందుకు విషతుల్యమయిందంటారు మాధవీ?"

"జల కాలుష్యానికి యెక్కడయినా, ఎప్పుడయినా ఒకే, ఒక కారణం వుంటుంది కుమార్! అది: ప్రమాదకరమైన రసాయనాలు నదీ సాగర జలాలలో కలియడం!"

"కాని, ఈ మినీకాయ్ దీవులలోనికి రసాయనాలు ఎలా వస్తాయి మాధవీ?

నో! యింకేదో వుంది.

ఈ జల కాలుష్యానికి కారణం యింకేదో వుంది—"

పెదవులు బిగించి యేదో ఆలోచిస్తూ అన్నాడతడు.

"దన్, అలా కాకడానికి ఒకే ఒక ఛాన్స్ ఉంది" అందామె సాలోచనగా.

"ఏమిటది మాధవీ!" ఆత్రంగా అడిగాడు. రాంకుమార్.

"కాడ్మియమ్!"

"కా....డ్మి....య....మ్....!"—ఆమె పలికిన పదాన్ని ఆశ్చర్యంగా మరోసారి ఉచ్ఛరించాడు అతడు అర్థం కానట్లు ఆమెకేసి చూస్తూ.

ఆమె సాలోచనగా తల పంకించింది.

"ఈ మధ్య యేదో మేగజైన్‌లో చదివాను కుమార్!

భారతదేశం నుండి దిగుమతి అవుతోన్న చేపల ద్వారా, వాటిని వినియోగిస్తున్న తమ ప్రజలు రోగగ్రస్తులవుతున్నారని తెలిసి, ఆ చేపల దిగుమతిని నిషేధించింది ఇటలీ ప్రభుత్వం.

ఆ వార్తతో కంగారుపడింది మన ప్రభుత్వం. కొన్ని కోట్ల విదేశీ మారకద్రవ్యాన్ని వదులుకోవడం అంటే.... మాటలా!

పరిశ్రమలు విసర్జించిన రసాయనాల ప్రభావం వలన కాలుష్యమయిన సముద్రజలాలలో పట్టుబడే చేపలను విదేశాలకు ఎగుమతి చేయడాన్ని ఏనాడో నిషేధించింది మన ప్రభుత్వం.

మరి, ఇతర ప్రాంతాలలో పట్టబడ్డ చేపలు కూడా ఎందుకు విషపూరితం అవుతున్నాయి?

ప్రభుత్వ ఆదేశాల మేరకు ఈ అంశంపై సమగ్ర పరిశోధనను జరిపింది డిపార్ట్‌మెంట్ ఆఫ్ ఓషనాలజీ.

అప్పుడు బయల్పడింది ఈ 'కాడ్మియం' రహస్యం.

'కాడ్మియం' అన్నది ఒక లోహం. సముద్ర గర్భంలో కాడ్మియం లాంటి లోహాలుండే ప్రదేశాలలో, వీటి ప్రభావం వలన, అక్కడి సాగర జలాలు కలుషితమౌతున్నాయి.

ఆ జలాలలో పట్టబడే చేపలు విషపూరితాలౌతున్నాయి.

చేపలు పట్టబడే ప్రాంతాలలో కాడ్మియం లాంటి లోహాలు వుండటంవలన సముద్రజలాలు కాలుష్యంగాకుండా జాగ్రత్తలు తీసుకొంటామని మన దేశం ఇటలీ ప్రభుత్వానికి హామీ ఇచ్చింది.

దానితో చేపల దిగుమతిపై నిషేధాన్ని ఇటలీ ప్రభుత్వం తొలగించివేసింది."

"సో, యిప్పుడు మనం కూడా ఈ మినీకాయ్ దీవుల పరిసరాల్లో 'కాడ్మియం' లాంటి లోహాలు ఏవైనా నిక్షేపమై ఉన్నాయేమో పరిశోధించా లంటావు?" ఆమె వంక సాలోచనగా చూస్తూ అడిగాడు రాంకుమార్.

ఔనన్నట్లు తలాడించింది ఆమె.

"కాని, దానికి ముందుగా మనం యింకో పనిని చేయాలి మాధవీ!

మొదట అమాయకులైన ఈ దీవి ప్రజల ప్రాణాలను కాపాడాలి మనం. అంటే వీరు కొన్ని రోజులవరకూ, ఏ జలచరాన్నీ ఆహారంగా తీసుకోకుండా చేయాలి" అన్నాడతడు.

"దట్స్ ఇంపాజిబుల్ కుమార్!

"మినీకాయ్ దీవుల ప్రజలయొక్క ముఖ్యాహారం ఈ చేపలే! చేపలవేట వారి ప్రధానవృత్తి!

తమ వృత్తిని, భుక్తిని మానమని ఎవరు చెప్పినా

వినరు వారు."

"వింటారు మాధవీ! ఒకే, ఒక వ్యక్తి ఆజ్ఞను వారు అక్షరాలా పాటిస్తారు."

"ఎవరి ఆజ్ఞ! మా అంకుల్ దా?" ఆశ్చర్యంగా అడిగింది ఆమె.

కాదన్నట్లు అడ్డంగా తలూపాడు అతడు.

"మరి, యింకెవరు?" ఆత్రంగా అడిగింది ఆమె.

"జ....న్మ....కా....ర....ణ్...!" — ఒక్కొక్క అక్షరాన్నే ఒత్తిపలుకుతూ చెప్పాడతడు.

ఆ పేరు వింటూనే ఆశ్చర్యంతో నోరు వెళ్లబెట్టిందామె. ఆమెకు తెలుసు జన్మకారణ్ అంటే ఎవరో.

"కాని....అతడలా చెబుతాడా!" సందిగ్ధంగా అడిగింది ఆమె.

"చెప్పడు మాధవీ!

"మనమే ఈ ప్రజలకు అతనితో అలా చెప్పిస్తాం"— ఒక నిశ్చయానికి వచ్చినట్లు దృఢంగా అన్నాడతడు.

అతని ప్లాన్ ఏమిటో అర్థంగాక, అతనివంక తెల్లబోతూ చూసిందామె.

## 4

విశాలమైన ఆ పచ్చిక మైదానం మిసీకాయ్ ఆదివాస ప్రజలతో క్రిక్కిరిసి వుంది.

మైదానం అంచునున్న అడవిలో పూచిన ఎర్రని మోదుగుపూలు సంధ్యాకాలపు కెంజాయి వెలుగులో మరింతగా తళుకు లీనుతున్నాయి.

సాయంత్రపు పిల్లగాలికి గుత్తులు, గుత్తులుగా వ్రేలాడుతున్న గోల్, గోలీ పుష్పాలు మెల్లగా తలలాడిస్తు

స్నాయి.

స్త్రీలు, పురుషులు మొలలకు మాత్రం మోకాళ్ళ దిగని ముదురు రంగు వస్త్రాలను ధరించారు. స్త్రీలు వెడల్పాటి ఆకులతో కూర్చబడ్డ ఒక హారం లాంటిది మెడలో ధరించారు. ఎత్తుగా చుట్టిన వంకర ముడిలో పీయు పుష్పాలను అందంగా తురుముకొన్నారు.

మైదానం మధ్యలో—కండలు తిరిగిన యువకుడొకడు పెద్ద డోలును లయబద్ధంగా వాయిస్తున్నాడు.

ఆ డోలు చుట్టూ ఆరేడు వలయాలుగా, ఒకరి చేతులను ఒకరు పట్టుకొని నిలుచుని వున్నారు వారు. డోలు శబ్దానికి అనుగుణంగా నాట్యం చేస్తున్నారు.

నాట్యంచేసే ప్రతి వ్యక్తి చేతులలో పొడవైన కర్రలున్నాయి. నాట్యం చేసేవారు వలయంగా నిలబడి లయబద్ధంగా అడుగులు వేస్తూ తమ కర్రలతో ఎదుటి వ్యక్తి కర్రలపై కొడుతున్నారు. ఉత్సవంలో డోలు శబ్దంతో పాటు పరస్పరం తాకే కర్రల శబ్దం, స్త్రీల శ్రావ్యమైన గీతాలు.. అన్నీ కలగలసి ఒక విచిత్రమైన నాదం ఉత్పన్నమౌతోంది.

వారు పాడే పాటలు ఉత్తేజం కలిగించే శృంగార భరితమైన పాటలు.

మైదానంలో ఓ ప్రక్క, వెదురు బొంగులతో చేసిన ఆసనాలపై కూర్చుని ఆ ఉత్సవాన్ని. ఉత్సాహంగా చూస్తోన్నారు చిమన్ భాయ్ పటేల్, ఆయేషా, మాధవి, కుమార్.

నాట్యం జోరుగా సాగుతూంది.

అంతలో ....

జోరుగా మ్రోగుతున్న డోలు ఒక్కసారిగా మూగ

పోయింది. ఉత్సాహంగా నాట్యం చేస్తున్న ఆ ప్రజలు.... నాట్యాన్ని ఆపి నేలమీద మోకరిల్లి కూర్చున్నారు.

"జన్మకారణ్ .... జన్మకారణ్ ...."

ఒక్కసారిగా ఆ మైదానం అంతా 'జన్మకారణ్' అన్న ఒకే ఒక్క మాటతో హోరెత్తిపోయింది.

పశ్చిమ దిక్కునున్న అడవిలో నుండి....

ముందుగా మండుతున్న దివిటీలు పట్టుకొని యిద్దరు యువతులు నడుస్తున్నారు.

నలుగురు బలిష్ఠులైన యువకులు వెదురు బొంగులతో చేసిన తక్తాను మోసుకొని వస్తున్నారు. పులి చర్మాలతోనూ, నెమలి పింఛాలతోనూ అలంకరింపబడిన ఆ తక్తాపై ఠీవిగా కూర్చుని వున్నాడొక అరవైయేళ్ళ వృద్ధుడు.

ఎర్రని అంగీని ధరించాడతడు. మెడలో విచిత్రమైన పూసలదండలు వ్రేలాడుతున్నాయి. ముఖం నిండా ఏదో రంగులు పులమబడి వున్నాయి. తలపై పక్షి ఈకలతో చేయబడ్డ టోపీలాంటిది వుంది. తెల్లగా వెండిలా మెరుస్తోన్న నిడుపాటి గెడ్డం పిల్లగాలికి మెల్లగా ఎగురుతూంది. ఓ చేతిలో పాములా వంకీలు తిరిగిన నల్లని దండం వుంది.

"జన్మకారణ్ ....!"

విచిత్రంగా కన్పిస్తోన్న ఆ వృద్ధునివంక ఆశ్చర్యంగా కన్నులు విప్పార్చుకొని చూస్తోన్న పిల్లలతో చెప్పారు ఆ ఆదివాసులు.

మైదానం మధ్య నున్నడోలు ప్రక్కనే తక్తా కూడా దింపబడింది.

మరుక్షణం ఏడుసార్లు డోలు మ్రోగించబడింది. ఆదివాసులంతా జయజయధ్వానాలు చేశారు.

చిమన్ భాయిపటేల్ కూడా గౌరవపూర్వకంగా లేచి నిలబడ్డాడు. అతనితోపాటు అయేషా, మాధవి, కుమార్‌లు కూడా లేచి నిలబడి అభివాదం చేశారు.

వారందరి అభివాదాలను స్వీకరిస్తున్నట్లుగా చేతి లోని దండాన్ని పైకెత్తాడు జన్మకారణ్.

నైసర్గికంగా మినీకాయ్ దీవి అంతా దట్టమయిన కీకారణ్యంతో నిండివుంది. కేవలం తూర్పు దిక్కులో మాత్రం నాగరికత కాస్త అభివృద్ధి చెందింది.

దానికి కారణం: మినికాయ్ దీవికి తూర్పున వున్న కేరళ, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాల నుండి వలస వచ్చిన ప్రజలు అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకోవడం.

అలా వలస వచ్చినవారిలో చిమన్ భాయిపటేల్ ఒకడు.

ఆ కాస్త తూర్పు భాగాన్ని, మినహాయిస్తే, మిగిలిన దీవి అంతా దట్టమయిన అడవీ, కొండలూ, గుట్టలూ, ఇసుకపర్రలూను.

కేరళ అడవులలో కనిపించే చోళ నాయకులు, పణి నాయకులు అనబడే ఆదివాస తెగలను పోలిన....ఒక ఆదిమజాతి ప్రజలు వీరు.

వీరి నివాసం కీకారణ్యం.

వీరి నాయకుడు జన్మకారణ్!

జన్మకారణ్ అన్నది ఒక వ్యక్తి పేరు కాదు. అది వ్యవస్థాగతమైన వ్యావహారిక పదం.

ప్రజలను పాలించేవానిని రాచరిక వ్యవస్థలో రాజా అనీ, ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రధాని అనీ, ఫెడరల్

వ్యవస్థలో ప్రెసిడెంట్ అనే యెలా వ్యవహరిస్తారో అలాగే ఆ జాతివారు తమ నాయకుణ్ని జన్మకారణ్ అని మన్నిస్తారు.

నిజానికి చిమన్ భాయిపటేల్ పేరుకు ఆ దీవికి పెద్ద అయినా, అతని అధికారం చెల్లుబాటు అయేది కేవలం నాగరికంగా అభివృద్ధి చెందిన ఆ తూర్పు భాగం లోనే!

మిగిలిన దీవిలోని ప్రజలంతా జన్మకారణ్ ఆజ్ఞలకు లోబడి వుంటారు.

తల్పంపై నుండి లేచి నిలబడ్డాడు జన్మకారణ్. తలపై నున్న పక్షి ఈకల కిరీటాన్ని, చేతిలోని దండాన్ని తల్పంపై వుంచి మెల్లగా ముందుకు నడిచాడు.

డోలు శబ్దం మళ్ళీ మొదలయింది.

ఏడడుగులు ముందుకు నడిచి అక్కడున్న శిలాఫలకం మీద పద్మాసనం వేసుకొని కూర్చున్నాడు అతడు. ఏడుగురు ఆటవిక స్త్రీలు మట్టికుండను పట్టుకొని అతనిచుట్టూ వలయంలా ఏర్పడ్డారు.

డోలు శబ్ద వేగాన్ని పుంజుకుంది.

ఏడుకుండలలో తెచ్చిన సముద్ర జలంతో జన్మకారణ్‌ను అభిషేకించారు ఆ స్త్రీలు.

నీళ్ళోడుతున్న శరీరంతో మెల్లగా లేచి నిలబడ్డాడు అతడు. మరుక్షణం డోలు శబ్దం టక్కున ఆగిపోయింది. చీమ చిటుక్కుమంటే వినిపించేంతటి నిశ్శబ్దం ఆ మైదానాన్ని ఒక్కసారిగా ఆవహించింది.

జన్మకారణ్ యేం చెబుతాడా అని ఊపిరి బిగబట్టి మరీ, ఆత్రంగా యెదురుచూస్తున్నారు ఆ ఆదివాసులు.

అతడు ఒక్కసారి ఆ మైదానం అంతా కలియజూసాడు.

కణ కణ లాడుతున్న నిప్పులున్న కుంపటిని అతడి ముందు వుంచారు. ఏవో వ్రేళ్ళు ఆ నిప్పులపై వేశారు. తెల్లని, ఘాటైన పొగ సుళ్ళు తిరుగుతూ పైకి యెగసింది.

ఆ పొగ అతడిలో యేదో వివశత్వాన్ని కల్గించింది. అతని కన్నులు అరమోడ్పు లయ్యాయి. ఏదో ఆవేశం వచ్చినట్లు అతని శరీరం సన్నగా వణకసాగింది.

"నేస్తులూ....!"

ఎలుగెత్తి పిలిచాడతడు.

మైదానం అంచులను దాటి, అడవిలో సైతం ప్రతిధ్వనించింది అతని గొంతు. ఒక లయలా, వెల్లువలా అతని నోటి వెంట మాటలు పెల్లుబుకుతున్నాయి.

"నేస్తులూ....!

పున్నమొచ్చింది. మనల్ని గన్న అమ్మోరి జాతరొచ్చింది. ఆడండి! పాడండి!

పెంటే. పెట్టా....ఒట్టు పెట్టి జట్టు పట్టి, ఏరుమీద తేరు కట్టి....

తెప్పమీద తేలిపొండి!

"జోడుకట్టి మరలి రండి!

ఏడు రోజుల జాతర....!

ఏడుకగా జరపాలి! ఏడు రోజుల దనుక....నీట పోకరద్దు! నీట వేట లాద్దు! నీట పుట్టిన జీవిని నోట పెట్టద్దు!

ఎరుకగల మా తల్లి....ఎరుక మీనుంటాది. కట్టు తప్పేరా.... నేస్తులూ! మట్టిలో కలిసేరు."

జన్మకారణ్ మాటలు వినేసరికి నల్లగా మాడిపోయింది

ఆయేషా ముఖం.

“అంటే.... ఈ వారంరోజులూ వారు సముద్రపు వేటకు వెళ్ళరా!” ఆశ్చర్యంగా భర్తవంక చూస్తూ అడిగింది ఆమె.

“ఇందులో ఆశ్చర్యం యేముంది ఆయేషా!

ప్రతి ఏటా ఈ అమ్మవారి జాతర జరిగిన మరునాటి నుండి ఏడురోజుల వరకు వారు ఏ జలచరాలనూ ఆహారంగా తీసుకోరు. అది వారి ఆచారం.

అయితే.... నా కర్థం కానిది ఒక్కటే!

ప్రతి ఏటా కార్తీకపౌర్ణమినాడు జరిగే ఈ జాతర.... ఈ ఏడు ఒక నెలరోజులు ముందుగా... అదీ ఆకస్మాత్తుగా కేవలం ఒక్కరోజు వ్యవధిలో ఇంత ఆదరాబాదరాగా యెందుకు జరుపుతున్నారా అన్నదే నాకు అంతుపట్టటంలేదు” సాలోచనగా తలపంకిస్తూ అన్నాడు పటేల్.

అతడి మాటలకు ఆయేషా భృకుటి ముడిపడింది. ఏదో చెప్పలేని అసహనం ఆమె కళ్ళల్లో లీలగా కదలాడింది.

కాని, ఒక్కక్షణంలో తన మనసునులోని భావాలను బలవంతంగా అణచుకొని, మామూలుగా చిరునవ్వులు చిందించింది ఆమె.

అయితే, మారుతున్న ఆమె ముఖభావాలు రాంకుమార్ సునిశిత దృష్టిని మాత్రం దాటిపోలేదు.

“జన్మకారణ్ మాటలకు, ఎందుకలా హర్ట్ అయినట్లు చూసింది ఆయేషా?

ఈ ఆదివాసులు ఏడురోజులపాటు జలచరాలను ఆహారంగా తీసుకోకుంటే ఆమెకు ఒనగూడే నష్టం యేమిటి? ఆమె యెందుకలా ముఖాన్ని మాడ్చుకుంది....?”

ఇది కాదు రాంకుమార్ ను కలవర పెడుతున్నది....

"అంత త్వరగా, తృటిలో తన ముఖభావాల్ని మార్చుకో గల్గింది అంటే....ఆమె సాధారణ సంసార స్త్రీ అయి వుండదు. కాకుంటే....ఎవరామె?"—దీర్ఘంగా ఆలోచి స్తోన్నాడు రాంకుమార్.

అనుమానం అన్నది అలాంటివారికి కల్గనే కూడదు. ఒకసారి అనుమానం వచ్చాక దాని అంతు చూడనిదే నిద్రపోరు వారు.

ఆ రోజు రాత్రే త్రివేండ్రంలోని పోలీస్ కమీష నర్ ను కాంటాక్టు చేశాడతడు.

'ఆయేషా పూర్తి వివరాలను, ఆమె పుట్టుపూర్వోత్త రాలను క్షుణ్ణంగా ఎంక్వయిరీ చేసి, రిపోర్టు పంపమని' కమీషనర్ ను కోరాడతడు.

## 5

నీలి సముద్రపు అలలపై బాణంలా దూసుకుపోతూంది ఆ స్టీమ్ బోట్.

హోరుమని వీస్తున్న గాలికి ఎగురుతున్న ముంగురులను అలవోకగా సర్దుకొంటూ, రాంకుమార్ వంక చూసింది మాధవి.

"మొత్తానికి యెలాగయితేనేం, వారం రోజులపాటు ఈ దీవిలోని ప్రజలు ఏ జలచరాన్నీ ముట్టకుండా చేశావు. రియల్లీ హేట్స్ ఆఫ్ టు యూ....కుమార్!

బట్! ఎలా....?

ఎలా ఆ జన్మకారణిను మేనేజ్ చేశావు?"

—అంతవరకూ గుండెల్లో బిగబట్టుకున్న సందేహాన్ని అతని ముందు కక్కేసింది ఆమె.

స్టీమ్ బోట్ స్టీరింగ్ ను ఏకాగ్రతతో కంట్రోల్

చేస్తున్న రాంకుమార్ చిన్నగా నవ్వాడు.

"నేను ఈ దీవిలో అడుగు పెట్టినప్పటినుండి....అదే ఆలోచిస్తున్నాను మాధవీ! తాత్కాలికంగా పదిరోజుల పాటైనా ఈ దీవి ప్రజలు మత్స్యాహారాన్ని తీసుకోకుండా, వారిని ఆపాలి.

కాని....ఎలా?

ఈ దీవిలోని కొందరు వ్యక్తులను కలిసి....ఎంక్వాయిరీ ప్రారంభించాను.

చివరకు, ఈ జాతర గురించి ఒక వృద్ధుడు చెప్పాడు మాధవీ!

"ఈ జాతర... ముఖ్యంగా ఈ తెగలోని యువతీ, యువకుల వివాహాల కోసం ఉద్దేశింపబడింది. ఈ జాతర జరిగిన మరునాటి నుండి ఏడురోజుల వరకూ, క్రొత్తగా జోడు కట్టిన ఆ యువతీ, యువకులు....జనపథాలలోనికి అడుగు పెట్టరు.

ఆ జంటలు మరలి వచ్చేవరకూ, అంటే, ఏడురోజుల వరకూ వీరు యే జలచరాన్నీ నోట పెట్టరు. తాము జలచరాలను భక్షించరు కాబట్టి, తమ వారిని జలదేవత రక్షిస్తుందనీ, ఏడు రోజుల కామయాత్ర (మన భాషలో చెప్పాలీ అంటే హనీమూన్) తరువాత ఆ జంటలు క్షేమంగా వస్తారని వారి నమ్మకం.

కాని, ఈ జాతర... కార్తీక పౌర్ణమినాడు జరుగుతుంది. అంటే మరో నెలరోజుల తరువాత! '

ఆ జాతరను యిప్పుడు చేయించగలిగితే ..! మరో వారం రోజులవరకూ వారు విషపూరితాలైన జలచరాలను తినకుండా ఆపవచ్చు. వారి ప్రాణాలను రక్షించవచ్చు. మనకు కూడా ఈ ఎసైన్‌మెంట్‌ను పూర్తిచేయ

దానికి ఒక వారం రోజులపాటు గడువు దొరుకుతుంది.

కాని....ఎలా?

ఆ జాతరను యిప్పుడు వేయించటం ఎలా? తీవ్రంగా ఆలోచించసాగాను నేను.

అప్పుడు సడన్‌గా తట్టింది నాకు ఒక అద్భుతమైన ఆలోచన!" అన్నాడు రాంకుమార్.

"ఏమిటది?" కుతూహలంగా అడిగింది మాధవి.

ఇక్కడ వీరు ఇలా మాట్లాడుకొంటున్న సమయంలో....అక్కడ....

ఒక కొండ గుహలో....

చర్మపు తల్పాలపై ఎదురెదురుగా కూర్చుని వున్నారు జన్మకారణ్, ఆయేషా!

వారిద్దరి మధ్యా పెద్ద పెద్ద ఇత్తడి పళ్లేరాలలో వివిధ రకాలైన తినుబండారాలూ, మరో పళ్లెంలో ఎర్రని సిల్క్ గుడ్డలూ వున్నాయి. అవి ఆయేషా భక్తితో జన్మకారణ్‌కు సమర్పించిన కానుకలు.

ప్రకృతి సహజంగా యేర్పడిన అభ్రకపు గుహ అది. ఆ గుహ లోపలి భాగం తెల్లగా మెరుస్తూంది. గుహ లోపల ఎయిర్ కండిషన్డ్ గదిలా చల్లగా వుంది. గుహ ఉపరితలంలో ఎక్కడ నుండో సూర్యరశ్మి లోనికి ప్రసరిస్తూంది. జన్మకారణ్ నివసించే ఆ గుహను అలియాన్ అని పిలుస్తారు.

"చెప్పండి జన్మకారణ్!

ఏటా కార్తీక పౌర్ణమినాడు చేసే ఈ జాతర, ఈ ఏడు మాత్రం యెందుకు ఒక నెల రోజులు ముందుగా చేశారు?"—అత్యంత వినయాన్ని ఒలకబోస్తూ అడిగింది ఆయేషా!

"దేవర ఆన బిడ్డా!" అన్నాడు జన్మకారణ్ కళ్ళు అరమోడ్చి, భక్తితో ఆకాశంవంక రెండు చేతులనూ చాస్తూ.

అర్థం కానట్టు అతనివంక చూసిందామె.

తెల్లని గుబురు మీసాల మాటున దాక్కున్న అతని పెదవులు చిరు దరహాసంతో విచ్చుకున్నాయి.

"మొన్నటి దినాన....

సూర్యుడు నడినెత్తిన నున్నాడు. ఎండ మండి పోతోంది. ఏట సాలించి, నట్టడివి మధ్యబడి నడిసి వస్తున్నా.

దారిలో, ఓ మద్దిసెట్టు నీడలో పులి చర్మంపై కూర్చున్న ఓ యోగిని చూశాను. కళ్ళు మూసుకొని తపస్సు చేస్తుండాడా సామి.

ఆ సామికి కూసింత దూరంలో ఆరడుగుల నల్లత్రాచు పడగ విప్పి ఆడుతూంది.

నేను ఆ సామి దగ్గరకు నడిసాను. నా అడుగుల సడికి ఆ పాము జరజరా ప్రాకుకుంటూ ప్రక్క నున్న పొదల లోనికి వెళ్ళిపోయింది.

పామేంది, పాదాల ముంగిట పడగవిప్పి ఆడటమేంది అనుకుంటూ అబ్బురపడ్డాను నేను. భక్తితో ఆ సామి పాదాలకు నమస్కరించాను.

"జన్మకారణ్!

భద్రం నాయనా! ఆపద ముంచుకొస్తూంది. కాచుకో! తెలివిగా మసలుకో!" అన్నాడా సామి.

నేను అచ్చెరువున నిచ్చరబోయాను.

మూసిన కళ్ళు తెరవలేదు ఆ సామి, నన్ను పేరుపెట్టి పిలిచిండు. మున్నెన్నడూ నన్ను చూసి ఎరగడు. కాని

నన్ను గురుతు పట్టిండు.

అందునా ఆపదని చెప్పేసరికి, నాకు భయం ముంచు కు వచ్చింది.

మహిమగల మా తంత్రి అనుకుంటూ అతని ముందు మోకరిల్లాను నేను.

"చెప్పు సామీ!

ఆపదని ఎరుక చెప్పినావు. గట్టెక్కే దారీ నీవే చెప్పాలి" అన్నాను నేను చేతులు జోడించి.

ఆ సామి మెల్లగా కళ్ళు తెరిచాడు. ప్రక్క నున్న కమండలాన్ని తీసి, అందులోని జలాన్ని నేలమీద ఒంపాడు, ఏదో మంత్రాన్ని జపిస్తూ....గాలిలో చేతిని ఊపాడు. అంతే! మట్టిలో భగ్గున మంటలు పుట్టు కొచ్చాయి.

కొంత జలాన్ని నా దోసిలిలో పోశాడు. బుస బుసా పొంగుతూ సముద్రపు నురగలా మారిపోయింది—ఆ జలం.

"చూశావా బిడ్డా!

మట్టిలో మంటలు పుడుతున్నాయి. జలం పొంగులు వారుతూంది. అమృతం విషమై పోతూంది. నీ నేస్తులు రోగాలతో మరణిస్తున్నారు.

సత్యమేనా!"

నా కళ్ళల్లోనికి సూటిగా చూశాడా సామి.

నిజమే! ఈ మధ్య మా తెగవారు యేవో చిత్రమైన రోగాలపాలవుతున్నారు. మందేసినా, మాకేసినా మర ణిస్తున్నారు.

"మేలుకో బిడ్డా! నీ నేస్తులను కాచుకో!

రేపటిపొద్దున అమ్మోరి జాతర జరిపించు. జలదేవతకు

శాంతి చేయించు.

మేలు జరుగుతుంది.

కీడు తొలగుతుంది" చేయెత్తి దీవిస్తూ అన్నాడా సామి.

ఆ సామి మాట ప్రకారం జాతర జరిపించినా!" చెప్పటం ముగించాడు జన్మకారణ్.

"ఇప్పుడా స్వామి యెక్కడున్నాడు జన్మకారణ్?" ఆత్రంగా అడిగింది ఆయేషా.

తెలియదన్నట్లు పెదవి విరిచాడు అతడు. "ఆ పూట నుండి ఆ సామి అయిపు లేదమ్మా! మహిమగల తండ్రి మాయమై పోయాడు"—కనుపించని యోగికి చేతులెత్తి నమస్కరిస్తూ అన్నాడతడు.

'విద్యాగంధం ఇసుమంతైనా లేని ఈ ఆదివాసులు పరమ మూర్ఖులు. మంత్రాలనూ, మాయలనూ గ్రుడ్డిగా నమ్ముతారు వీరు.

వీరి బలహీనతలను ఆధారంగా తీసుకొని, ఎవరో వీరిని తెలివిగా మోసగించారా? అదే నిజమైతే ఈ జాతర పెల రోజులు ముందుగా జరగటంవలన వారికి వచ్చే లాభం యేమిటి?

తమకు గాని, జన్మకారణ్‌కు గాని తెలియకుండా ఒక క్రొత్త యోగి ఈ దీవిలోనికి యెలా అడుగు పెట్ట గలిగాడు? మళ్ళీ ఎవరి కంటా పడకుండా ఎలా అదృశ్య మయ్యాడు?

సంథింగ్ ఈజ్ రాంగ్ సమ్‌వేర్!

ఎక్కడో, యేదో తన ఊహాల కందనిది జరుగు తోంది. బట్ వాట్? యేమిటి? యేమిటి జరుగుతోంది?' దీర్ఘంగా ఆలోచించసాగింది ఆయేషా!

ఇక్కడ....బోట్‌లో....

జరిగిన కథంతా క్లుప్తంగా చెప్పి, "ఇంతకూ ఆ యోగి ఎవరో అడగలేం మాధవీ!" అన్నాడు రాంకుమార్.

"ఇంకెవరు? మీరే అయివుంటారు" అంది మాధవి చిలిపిగా నవ్వుతూ.

చిరునవ్వుతో తల పంకించాడతడు.

"కాని.... మట్టిలో మంటలు పుట్టటం, నీరు నురగలా మారటం....యివన్నీ...." సందేహంగా అడిగింది ఆమె.

"దోజ్ ఆర్ చీప్ కెమికల్ ట్రిక్స్ మాధవీ! ముందుగా మట్టిలో పొటాషియం పెర్మాంగనేట్‌ను కలిపి ఉంచాను. కమండలంలోని గ్లిజరిన్‌ను దానిపై చల్లేసరికి మంటలు పుట్టాయి.

మీకు తెలుసో, తెలియదో 1985 సెప్టెంబర్‌లో అనుకుంటాను....విశాఖలో యోగాశ్రమం కేస్‌ను డీల్ చేశాను. స్వామి యోగానంద సరిగ్గా ఈ రసాయనక ప్రక్రియతోనే యజ్ఞకుండంలో మంటలు పుట్టించాడు. కాని ప్రజలకు మాత్రం మంత్రాలతోనే మంటలు పుట్టించినట్లు భ్రమను కల్పించాడు.

అదృష్టవశాత్తూ నాకు ఆ ట్రిక్ గుర్తుకు వచ్చి సమయానుకూలంగా వాడుకోగల్గాను.

ఇక రెండవ ట్రిక్....

అతని చేతులలో పోసినది నీరు కాదు. హైడ్రోజన్ పెరాక్సైడ్. చర్మానికి తగిలిన వెంటనే అది స్వభావసిద్ధంగా నురుగులు క్రక్కింది.

దట్సాల్!"

"అంటే....ఆ కమండలానికి రెండు అర లున్నా యన్నమాట! ఒక అరలో గ్లిజరిన్, మరో అరలో హైడ్రోజన్ పెరాక్సైడ్ ఉండివుండాలి. ఏమ్ ఐ కరెక్ట్?" అంది మాధవి.

ఆమెవంక మెచ్చుకోలుగా చూశా డతడు.

"అదే ఈ ట్రిక్ లోని ప్రత్యేకత మాధవీ! ఒకే కమండలంలోని నీరు మట్టిలో మంటలను, అర చేతిలో నురుగులను సృష్టించబట్టే, జన్మకారణ్ ను అంత సులువుగా నమ్మించగల్గాను.

అయితే నా పట్ల జన్మకారణ్ కు మరింత నమ్మకాన్ని పెంచినది....ఆ పాము.

థాంక్స్ ఎ లాట్ టు దట్ కోబ్రా."

"అన్నట్లు మరిచేపోయాను సుమా! ఎక్కడిదా పాము కుమార్?" నవ్వుతూ అడిగింది మాధవి.

అతడు స్టయిల్ గా భుజాలను ఎగురవేశాడు.

"ఏమో! ఎలా వచ్చిందో! ఎక్కడ నుండి వచ్చిందో! నా అదృష్టం యేమిటంటే....

సరిగ్గా జన్మకారణ్ వచ్చేసరికి అది నా ముందర పడగ విప్పి ఆడుతుండడం, అతని అడుగుల సవ్వడికి పొదల లోనికి పారిపోవడం....యాదృచ్ఛికం అంటే యిదే నేమో!" అన్నాడు రాంకుమార్.

చేతి వ్రేళ్ళ కొసలతో ఫాలంమీద పడిన ముంగురులను సవరించుకొంటూ అతనివంక ఎడ్మయిరింగ్ గా చూసింది మాధవి.

# 6

అంతులేని సాగర గర్భంలో చేపల జంటలా, ఈదు

బిగుతైన స్విమ్మింగ్ సూట్లను ధరించారు వారు. కళ్ళతో సహా తల నంతటినీ కవర్ చేస్తున్న వాటర్ ప్రూఫ్ హెల్మెట్స్ పెట్టుకొన్నారు. వీపులపై బిగింపబడ్డ ఆక్సిజన్ సిలిండర్లు, పాదాలకు చేప తోకల్లాంటి వింతైన బూట్లు....మరో గ్రహంలోనికి అడుగుపెట్టడానికి తయారయిన ఆస్ట్రోనాట్స్‌లా ఉన్నాయి వారి ఆకారాలు.

వాటర్ గన్‌ను చేతితో పట్టుకొని నలుదిక్కులా పరిశీలనగా చూస్తోన్నాడు రాంకుమార్. పవర్ ఫుల్ వాటర్ ప్రూఫ్ కెమేరాతో ఫోటోలు తీస్తోంది మాధవి.

అయితే తాము అన్వేషిస్తున్నది లభ్యం కాలేదన్న నిరుత్సాహం వారి ముఖాలలో దోబూచులాడుతోంది.

'ఇక చాలు. పైకి పోదాం' అన్నట్లు సైగ చేశాడు రాంకుమార్. అంగీకారంగా తలాడించింది ఆమె.

కాళ్ళను చక చకా కదిలిస్తూ నీటిపైకి ఈదడం ప్రారంభించారు వారు.

అంతలో ఒక్కసారిగా నీటిలో కల కలం బయలు దేరింది. అంతవరకూ వారిచుట్టూ అల్లరిగా తిరుగుతున్న అందమైన చిన్న చిన్న చేపలు భయంతో కకావికలై పారిపోయాయి.

ఏం జరిగిందో అర్థంగాక తెల్లబోయి చూస్తోన్నారు వారు. ఏదో భూతం లాంటి ఆకారం శరవేగంగా తమ వైపు దూసుకురావడం లీలగా కనిపించింది వారికి. కేవలం రెండు క్షణాలలో వారిని సమీపించిందా ఆకారం.

గుహ లాంటి నోరు తెరచుకొని, తెల్లని కోరలు సాచి, జల రాక్షసిలా వస్తోన్న పన్నెండు అడుగుల

మాధవి.

వాటర్ గన్ ను ఆ షార్క్ కు ఎయిమ్ చేశాడు రాంకుమార్. కాని గురిపెట్టలేనంత దగ్గరగా వచ్చేసింది అది. మరో క్షణంలో అది తమను ఎటాక్ చేస్తుంది అనగా, ఏం చేయాలో తోచక, చటుక్కున మాధవితో పాటుగా క్రిందకు డైవ్ చేశాడతడు. సరిగ్గా వారి తలలపై నుండి దూసుకుపోయింది అది.

పది గజాలు ముందుకు వెళ్ళాక, గిరుక్కున వెనుతిరిగింది ఆ షార్క్. ఎరపై తన గురి తప్పినందుకు మరింత మండిపడుతూ ముందుకు దూసుకువచ్చింది.

క్రిందకు డైవ్ చేసిన రాంకుమార్ చటుక్కున సర్దుకొని కూర్చున్నాడు. తెల్లని షార్క్ పొట్ట భాగం కనిపించింది అతనికి. అంతే! ట్రిగ్గర్ ను నొక్కాడు.

పన్నెండు అంగుళాల పొడవున్న వాటర్ యారో.... ఆ షార్క్ పొట్టను చీల్చుకొంటూ దూసుకుపోయింది.

భరించలేని బాధతో రెండు క్షణాల పాటు విల విలలాడిపోయింది అంత పెద్ద షార్క్. తెల్లని దాని పొట్ట రక్తసిక్తమై ఎర్రని రంగును సంతరించుకుంది.

భయ విహ్వలరాలై, బెరుకుగా చూస్తోన్న మాధవిని తీసుకొని, నీటి పైకి పోవడానికి ఉద్యుక్తుడయ్యాడతడు.

నీటిలో కారే రక్తం యెంత ప్రమాదకరమో అతనికి తెలుసు. రక్తం వాసనను పసిగట్టి వందలకొలదీ షార్క్ చేపలు ఒక్క సారిగా గుంపుగా వచ్చి పడతాయి. ఒక్క సారి వాటి కంటబడ్డ ప్రాణి యేదయినా, ఎంత బలమైనదయినా ప్రాణాలతో బయటపడటం కల్ల.

అంతే! తనను దెబ్బతీసిన శత్రువుపై నున్న కసినంతటినీ.... శక్తిగా మార్చుకొని ఒక్క ఉదుటన వారిమీదకు విరుచుకు పడింది ఆ షార్క్.

దెబ్బ తిన్న షార్క్ చాలా ప్రమాదకరమని అతనికి తెలుసు కాని, అది మరీ అంత వేగంగా ఎటాక్ చేస్తుందని ఊహించలేదు అతడు.

అతనికి మరోసారి గన్ను పేల్చే అవకాశం లేక పోయింది. ఆ షార్క్ యెంత వేగంగా ఎటాక్ చేసిందంటే, అతడు గన్ను ఎయిమ్ చేసేసరికి, కోరలు సాచిన గుహలాంటి దాని నోరు అతని యెదురుగా ప్రత్యక్షం అయ్యింది.

గన్ను పేల్చే వ్యవధి లేదు. తప్పించుకొనే మార్గం లేదు. ఆలోచించడానికి అవకాశం లేదు.

ఏం చేయాలో తోచక...తనను నోట కరుచుకోవడానికి తెరిచిన ఆ షార్క్ రెండు దవడల మధ్యా తన చేతిలోని వాటర్ గన్ను నిలువుగా జొనిపాడతడు.

అంగుటికి అడ్డంగా వాటర్ గన్ గుచ్చుకోవడంతో, దవడలు మూయలేక పిచ్చెక్కినట్లు చిందులేయసాగింది ఆ షార్క్. ఏదో ప్రళయం సంభవించినట్లు అక్కడి నీరంతా అల్లకల్లోలమయిపోంది.

ఆ షార్క్ వలన తమకు మరే ప్రమాదమూ లేదని తెలిసి, రిలీఫ్ గా నిట్టూర్చారు వారు.

గుండెల నిండా గాలి పీల్చుకొని పైకి ఈదడం ప్రారంభించారు వారు.

అదే సమయంలో....ఒక పెద్ద షార్క్ ల గుంపు ఆ ప్రాంతాన్ని చుట్టుముట్టింది. రక్తసిక్తమైన తమ తోటి షార్క్ చుట్టూ ఒక్కసారి ప్రదక్షిణం చేశాయి అవి,

వెంటనే కవాతు చేసినట్లు గిరుక్కున వెనుదిరిగి, కుమార్, మాధవిలను వెన్నాడటం ప్రారంభించాయి.

నీటి ఉపరితలంమీదకు వచ్చాక హాయిగా గాలి పీల్చుకొన్నారు వారు. పది అడుగుల దూరంలో నీటిపై తేలుతున్న తమ స్టీమ్‌బోట్‌ను చూడగానే.... సంతృప్తితో కూడిన చిరునవ్వులతో వారి పెదవులు విచ్చుకున్నాయి.

హుషారుగా రెండు బారలు ముందుకు వేశారు వారు. అంతే! ఎదురుగా కన్పిస్తున్న దృశ్యాన్ని చూసేసరికి వారి పెదవులమీద చిరునవ్వులు అంతరించిపోయాయి.

కొన్ని వందల షార్కులు శరవేగంగా దూసుకువస్తూ వారిని చుట్టుముడుతున్నాయి,

వారు శక్తి నంతటినీ బాహువుల్లోకి తెచ్చుకొని, ఈదటం ప్రారంభించారు. సరిగ్గా మరో రెండు అడుగుల్లో వారు స్టీమ్‌బోట్‌ను సమీపిస్తారనగా, వారిని ఎటాక్ చేశాయి ఆ షార్కులు.

మాధవి కాలి బూటును నోట చిక్కించుకుందొక షార్కు. తన కాలును ఏదో లాగుతున్నట్లు అయ్యేసరికి కెవ్వున అరిచింది ఆమె. అదే క్షణంలో ఆమె వీపుమీద నున్న ఆక్సిజన్ సిలండర్‌కున్న గొట్టాన్ని కొరికివేసింది మరో షార్కు.

ఆక్సిజన్ కనెక్షన్ తప్పిపోవటంతో గాలి అందక, ఉక్కిరిబిక్కిరయ్యింది ఆమె.

మాధవి స్థితిని గమనించి, ఒక్క అంగలో ఆమెను సమీపించాడు రాంకుమార్. అదే క్షణంలో ఆమెను ఎటాక్ చేయబోతున్నాయి రెండు సొర చేపలు. ఒక్క క్షణం అతడు ఆలస్యం చేసివుంటే, వాటి వాడి కోరలకు

బల్లై పోయి వుందేదామె.

రెండు చేతులతో బొమ్మలా ఆమెను ఎత్తి, బోటు లోనికి విసిరేశాడు అతడు. దబ్ మని మూటలా బోట్ లో పడటంతో బాధగా అరిచింది ఆమె.

అదే క్షణంలో ఆ రెండు షార్క్ లూ అతడిని ఢీ కొన్నాయి స్విమ్మింగ్ సూట్ ను చీల్చుకుంటూ, వాడి యైన వాటి కోరలు అతడి శరీరంలో దిగబడ్డాయి. మరో షార్క్ అతడి భుజాన్ని రాచుకుంటూ పోయింది. భుజాన్ని యేదో కత్తితో కోసినట్లు అతని చర్మం చీరుకు పోయింది. అతని కాలిబూటును పట్టుకొని లాగసాగింది మరో సొరచేప.

వాటి బారినుండి తప్పించుకోవడానికి విఫలయత్నం చేస్తున్నాడు అతడు.

బోటులో శెల్లకిలా పడ్డ మాధవి మెల్లగా లేచింది. రాంకుమార్ పరిస్థితిని గమనించింది.

అతడు ఆ షార్క్ లను చేతులతో విదిలించి కొడుతు న్నాడు. విదలించిన కొలదీ అవి మరీ మీద పడుతు న్నాయి. కోరలతో గాయపరుస్తున్నాయి. గాయాలతో అతని శరీరం రక్తసిక్తమై పోయింది. వాటితో పోరాడి పోరాడి పూర్తిగా అలసిపోయాడతడు.

'ఇంకో రెండు మూడు క్షణాలు. అంతే! అంతటితో తన పని అయిపోతుంది....' అనుకున్నాడతడు నిస్పృ హగా.

అంతలో....బోటును స్టార్టు చేసింది మాధవి. దడ దడమని శబ్దం చేస్తూ ఇంజన్ పనిచేయటం ప్రారంభిం చింది. ఒక్కసారిగా వినవచ్చిన ఆ శబ్దానికి భయంతో ఆ షార్క్ లు కృశ్శిపడ్డాయి.

అదే సమయంలో రాజకుమార్ వైపు బలమైన తాడును విసిరింది ఆమె. చటుక్కున ఆ తాడును అందుకున్నాడు అతడు.

అంతే! వింటిని విడిచిన బాణంలా దూసుకుపోయింది ఆ బోటు.

బోటుతో పాటుగా తాడును పట్టుకొని వేలాడు తున్న రాంకుమార్ కూడా ఆ ప్రదేశం నుండి దాటి పోయాడు. కొంతదూరం వరకూ అతడిని వెన్నాడిన షార్క్స్. ఆ బోటు వేగాన్ని అందుకోలేక వెనక్కు మరలాయి.

ప్రమాద స్థలాన్ని దాటిపోయామని నిశ్చయించు కున్నాక బోటును ఆపి, రాంకుమార్‌ను మెల్లగా బోటు లోనికి చేర్చింది ఆమె. బోట్ లోనికి చేరగానే నిస్త్రాణంగా వెనక్కు వాలిపోయాడతడు.

మాధవి సారథ్యంలో ఆ బోట్ మినీకాయ్ దీవుల వైపు అతివేగంగా దూసుకుపోతోంది. ఆలోచనల తేరుపై ఆమె మనసు అంతకన్నా వేగంగా పరుగులు తీస్తోంది.

'తాము ఆ దీవి నలుదిక్కులా సాగర గర్భంలో సైతం క్షుణ్ణంగా పరిశోధించారు. కాని, యెక్కడా అనుమానాస్పదమయిన దేమీ తారసపడలేదు తమకు.

విచిత్రం యేమిటంటే ..

ఆ వైద్యబృందం ప్రయాణించిన బోటు దేనికయితే గుద్దుకొని, వారు మరణించారని చెప్పబడుతూందో, ఆ పగడపు గుట్టలలాంటి వేవీ ఆ దీవి పరిసరాలలో సైతం ఎక్కడా కానరాలేదు తమకు.

అంటే .... అది ప్రమాదం కాదా?

కాకుంటే .... ఆ వైద్యబృందం యెలా మరణించారు?

ఎవరో వారిని బలవంతంగా చంపి వుండాలి.

ఎందుకు?

వారిని చంపాల్సిన అవసరం ఎవరికుంది? ఈ దీవిలోని జలం ఎందుకు విషపూరితం అయ్యిందో పరిశోధించడానికి సిద్ధం అయ్యారు వారు.

వారి పరిశోధనలవలన ఎవరికి నష్టం?' తీవ్రంగా ఆలోచిస్తోంది మాధవి.

'తన అంచనా తప్పు కాకుంటే వారేదో ప్రమాదకరమైన రహస్యాన్ని కనిపెట్టి వుండాలి. అది వారి పెదవి దాటకూడదని వారినీ పృథ్వి నుండే దాటించే కారు శత్రువులు!' అనుకుంది ఆమె బాధగా నిట్టూరుస్తూ.

ఆలోచనల్లో తేలియాడుతున్న ఆమె కరకేంగా తమ బోటును సమీపిస్తున్న స్టీమ్‌బోట్‌ను గమనించలేదు.

రైఫిల్ రేంజ్‌లోనికి రాగానే, వార్నింగ్ కూడా లేకుండా కాల్పులు ప్రారంభించారు ఆ బోటులోని వ్యక్తులు.

'ఢాం!' అంటూ రైఫిల్స్ మ్రోగటంతో ఉలిక్కిపడి చూసింది ఆమె. కందిరీగలా ఝుంకారం చేస్తూ ఆమె చెవి ప్రక్కనుండి గాలిలో దూసుకుపోయింది ఒక బుల్లెట్.

ఛటుక్కున తలను క్రిందకు వంచిందామె. బుల్లెట్స్ వర్షపు చినుకుల్లా వారి బోటుపై కురియసాగాయి.

బోటు వేగాన్ని పెంచిందామె. పాములా మెలికలు త్రిప్పుతూ జిగ్, జాగ్‌గా బోటును నడపసాగిందామె. కాని, పట్టువదలని విక్రమార్కుడిలా వారి బోటును వెన్నాడుతూనే వుంది ఆ బోటు.

రైఫిల్స్ మ్రోతలకు ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు

రాంకుమార్. లేని ఓపికను తెచ్చుకొని మెల్లగా తలను పైకెత్తి చూశాడు.

శరవేగంగా తమవైపు దూసుకువస్తోన్న శత్రువుల స్పీడ్‌బోట్ కనిపించింది అతనికి. నల్లని దుస్తులను ధరించిన ఇద్దరు వ్యక్తులు డెక్ మీద నిలుచుని రైఫిల్స్‌తో కాల్పులు సాగిస్తున్నారు.

అతడు మెల్లగా క్రిందకు వంగి బోటు అడుగున వున్న స్టెన్‌గన్‌ను పైకి తీశాడు. బోటు అంచుపై రైఫిల్ బారెల్‌ను వుంచి, బోటులో దాక్కునే సూటిగా వారి వంక గురి చూశాడు. ట్రిగ్గర్ నొక్కాడు.

అంతే!

నిప్పురవ్వలు గుండెను ముక్కలు చేస్తుంటే, కెవ్వుమని కేక వేస్తూ, డెక్‌పై నుండి సముద్రంలోనికి పడిపోయాడొక వ్యక్తి. తన సహచరుని మరణాన్ని కళ్లారా చూసిన రెండవ వ్యక్తి ఛటాలున డెక్ పై నుండి బోటులోనికి దూకేశాడు.

రాంకుమార్ వంక మెచ్చుకోలుగా చూసింది మాధవి. నీరసంగా నవ్వాడతడు.

వారి చూపుల కలయికలో....వారి బోటు వేగం రవ్వంత తగ్గింది. ఒక వ్యక్తి మరణించడంతో శత్రువులు వెనుకంజ వేస్తారనుకున్నారు వారు. ఆ అదాటులో ఒక్క క్షణంసేపు నిర్లక్ష్యంగా వున్నారు వారు.

అదే వారు చేసిన తప్పు!

ఆ ఒక్క క్షణాన్ని శత్రువులు సద్వినియోగం చేసుకొన్నారు. టార్పెడోలా దూసుకుంటూ వచ్చి వీరి బోటును తాకింది శత్రువుల బోటు.

అంతే!

ఆ తాకిడికి నిలువుగా చీలిపోయింది వీరి పడవ. ముక్కలయిన ఆ బోటులో నుండి తృళ్ళి....సముద్రంలోని పడ్డారు రాంకుమార్, మాధవి.

ఆ శైద్యబృందం ఎలా మరణించారో అప్పుడు అర్థం అయింది ఆమెకు.

'అంటే....వారి బోటు కూడా తమలాగే....' అనుకొంది ఆమె నీటిలో మునక వేస్తూ.

ఎగిరి నీటిలో ఫ్లాట్ గా పడటంవలన తల దిమ్మెర పోయిందామెకు. ఏదో చెక్కబల్లతో మోదినట్లు ఆమె శరీరావయవాలు బాధతో మూలిగాయి. ఆక్సిజన్ సిలిండర్ కనెక్షన్ను షార్క్ కొరికివేయటంవలన, ఆ గొట్టం ద్వారా సముద్రపు నీరు ఒక్కసారిగా ఆమె ముక్కులోనికి ప్రవేశించి, ఉక్కిరి బిక్కిరయ్యింది ఆమె.

అదే క్షణంలో....పది అడుగుల పొడవున్న పెద్ద చేప ఒకటి నోరు తెరుచుకొంటూ ఆమెను సమీపించింది.

అంతే!

భయంతో చిన్నగా కేక వేస్తూ మూర్ఛపోయిందామె.

## 7

బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ కళ్ళు తెరిచిన రాంకుమార్ ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరయ్యాడు.

తాను వున్నది సాగర గర్భంలో కాదు. తన శరీరాన్ని యే పిరానాలూ, షార్క్ లూ కొరికి తింటూండటంలేదు. అందంగా,విశాలంగా ఉన్న ఒక గదిలో.... మెత్తని కుషన్ బెడ్ పై హాయిగా పడుకొని వున్నాడతడు.

జరిగిన సంఘటనను గుర్తుకు తెచ్చుకోడానికి ప్రయత్నించాడతడు.

శత్రువుల బోటు తమ బోటును ఢీకొన్న వెంటనే తృళ్ళిపడ్డాడు అతడు. ఆ అదటుకు అతని తల బోటు అంచుకు తగిలింది. కళ్ళ ముందు వేయి మెరుపులు ఒకే సారి మెరిసినట్లనిపించింది అతనికి.

నల్లని చీకటి పరదా లేవో తన కళ్ళ ముందు జారి పడుతుంటే, బోటులో నుండి జారి, సముద్రంలోనికి పడటం మాత్రం....లీలగా గుర్తుంది అతనికి.

'అంతే! ఆ తరువాత ఏం జరిగింది?

సముద్ర గర్భంలో నుండి ఈ గదిలోనికి ఎలా వచ్చాడు తను?

ఎవరు? ఎవరు తనను రక్షించారు?'

అతని మనసులో సముద్రపు కెరటాల్లా ఎగిసిపడుతున్న ప్రశ్న అన్నింటికీ సమాధానంగా ఆ గది తలుపులు తెరుచుకున్నాయి.

ఆ గదిలోకి ప్రవేశించిన అందమయిన యువతిని చూసి ఆశ్చర్యంతో నోరు తెరిచాడతడు.

ఆమె....ఆయేషా!

"మీరా!" అన్నాడతడు ఆశ్చర్యంగా.

చిన్నగా నవ్విందామె.

వయ్యారంగా నడుస్తూ అతడు పడుకున్న బెడ్‌ను సమీపించింది.

"బోట్ ప్రమాదంలో చిక్కుకున్న మిమ్మల్ని చూసి, మా మనుషులు రక్షించి యిక్కడకు తీసుకువచ్చారు కుమార్!"—అతని ప్రక్కలో....ఆ పక్కపై చనువుగా కూర్చుంటూ అంది ఆయేషా.

"మరి....మాధవి?" అడిగాడతడు ఆత్రంగా బెడ్ మీద నుండి లేవడానికి ప్రయత్నిస్తూ.

"డోంట్ గెట్ అప్ ఫ్రం ద బెడ్ కుమార్! ఇంకో ఇరవై నాల్గు గంటల వరకూ, నిన్ను బెడ్ మీద నుండి లేవద్దన్నారు డాక్టర్" అంది ఆయేషా అతని భుజాలపై చేతులుంచి, సున్నితంగా వెనక్కి తోస్తూ.

మెత్తని ఆమె పయోధరాలు సుతిమెత్తగా అతని గుండెలకు హత్తుకున్నాయి. అతని కళ్ళల్లో కళ్ళు పెట్టి చిలిపిగా నవ్విందామె.

"మాధవి కనిపించటంలేదు కుమార్! ఆమె కోసం మా మనుషులు తీవ్రంగా గాలిస్తున్నారు."

ఆమె మాటలకు హతాశుడయ్యాడతడు.

"మాధవి ఏమయింది?

సముద్ర ప్రవాహంలో పడి, యింకో తీరానికి కొట్టుకు పోయిందా? లేక....ఏ షార్క్ కన్ను దృష్టిలోనో పడి...."

ఆ తరువాత ఆలోచించలేక పోయాడతడు?

ఆ ఆలోచన రావటంతోనే చేదుగా మారిపోయింది అతని నోరు.

"ఏమిటంత తీవ్రంగా ఆలోచిస్తున్నావు కుమార్!" అంది ఆయేషా అతనిపై మరింత వాలుతూ.

ఇద్దరి మధ్యా యిమడలేక ఆమె ఎద పొంగులు బాధగా మూలిగాయి.

పెదవులతో సున్నితంగా అతని బుగ్గలపై రాస్తూ మత్తుగా మూల్గిందామె. అలా ఆమె శరీరం అతన్ని పెనవేసుకుపోయింది.

ఆమె కళ్ళలోని కోరికను ఏనాడో గమనించా

ఊహించలేదతడు.

ఓ వంక తన కోడలు మాధవి కనిపించటం లేదని చెబుతూనే, ఆమె బ్రతికుందో లేదో కూడా తెలియని ఈ స్థితిలో కూడా....నిస్సంకోచంగా పరాయి మగాడి కౌగిలిలో కరిగిపోవడానికి సిద్ధమౌతున్నదీ అంటే.... ఈమె మామూలు ఆడదేనా?

అంతుపట్టని ఆ దీవి రహస్యానికీ, ఆయేషాకు మధ్య యేదో సంబంధం వుందని అనిపించింది అతనికి.

'ఏది ఏమయినా ఈ చిక్కు ముడులన్నీ విప్పాలంటే, ఆయేషాకు మరింత దగ్గరవ్వాలి, ఆమెను గుంతోష పెట్టాలి, ఆమెను నమ్మించాలి' అనుకున్నాడతడు ఆమె నైటీ హుక్స్‌ను తప్పిస్తూ.

అదే సమయంలో....

చల్లని గాలి హాయిగా ముఖానికి తగులుతూండటంతో మెల్లగా కళ్ళు తెరిచింది మాధవి.

తను ఎక్కడుందో, యెలా వుందో తెలిసేసరికీ భయమూ, విస్మయమూ ఒకే క్షణంలో ఆవరించుకున్నాయామెను.

నీలి సముద్రపు అలలపై బాణంలా దూసుకుపోతూంది పది అడుగుల పొడవున్న పెద్ద చేప, సరిగ్గా దాని మూపురంపై వెల్లకిలా పడుకొని వుంది ఆమె.

ఒక్క క్షణం కంగారుపడిందామె.

కాని పరీక్షగా ఆ మత్స్యాన్ని చూశాక, అది డాల్ఫిన్ అని పోల్చాక ఆమె మనసు ప్రిమితపడింది.

సాగర గర్భంలో తను మూర్ఛపోయింది ఆ మత్స్యాన్ని చూసే అనీ, తెలివి తప్పిన తనను ఆ మీనమే

ఆ డాల్ఫిన్ మెడను చేతులతో నిమిరింది ఆమె.

డాల్ఫిన్స్ స్నేహజీవులనీ, ఎన్నో సందర్భాలలో, ఎందరో మనుషులను అవి ప్రమాదాల నుండి కాపాడా యనీ పుస్తకాలలో చదువుకుంది ఆమె.

కాని నిజ జీవితంలో....తననే ఒక డాల్ఫిన్ ప్రమాదం నుండి కాపాడటం, దాని మూపురంపై కూర్చుని జలకన్యలా సాగరయానం చేయటం....నిజంగా చెప్పలేనంత థ్రిల్లింగ్ గా ఉంది ఆమెకు.

సముద్రతీరం యింకా పది, పదిహేను గజాల దూరం ఉంటుందనగా, మాధవిని క్రిందకు దింపింది ఆ డాల్ఫిన్. అక్కడ నీరు మొలలోతు వుంటుంది. అంతే!

నీటిలో నిలబడ్డ మాధవిని రాసుకుంటూ, ఆమె చుట్టూ మూడుసార్లు రౌండ్స్ కొట్టింది ఆ డాల్ఫిన్. మరోసారి ప్రేమగా ఆ మత్స్యాన్ని కౌగలించుకొంది ఆమె.

చెంగున ఎగిరి డైవ్ చేసి, అనంతమైన సాగరంలో ఈదుకుంటూ పోతున్న ఆ డాల్ఫిన్ను చూస్తుంటే, అత్యంత ఆత్మీయులైన చిరకాల మిత్రుడెవరో విడిచి వెళ్ళిపోతున్నట్లుగా బాధతో మూల్గింది ఆమె హృదయం.

ఆమెకు తెలియకుండానే రెండు కన్నీటిబొట్లు ఆమె కనుకొనల నుండి రాలిపడ్డాయి.

కనుమరుగయ్యేంతవరకూ, ఆ డాల్ఫిన్ వంకే చూస్తూ అక్కడే నిలుచుండిపోయిందామె. తరువాత మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ తీరంవైపు నడిచింది.

ఒడ్డుపై అడుగు పెడుతూనే, ఉలిక్కిపడిందామె.

తీరం వెంబడి వ్యాపించిన అడవిలో, చెట్ల చాటు నుండి అస్పష్టంగా కనిపిస్తున్నాయి కొన్ని గూడారాలు....

అవి ఆదివాసుల గుడిసెలు కావు. నాగరికులు నివసించే కాన్వాస్ గూడారాలు.

తాను చేరింది తూర్పుతీరం కాదనీ, పశ్చిమతీరం అనీ ఆమెకు తెలుసు. కానీ, నాగరికులు సంచరించని ఆ పశ్చిమ దిక్కులోనికి ఆ గూడారెలా వచ్చాయి.

అడుగుల చప్పుడు కాకుండా ఆ తోపును సమీపించింది ఆమె. చెట్ల చాటునుండి ఆ గూడారాల వంక చూసింది.

అవి మిలటరీ గూడారాల్లా వున్నాయి. వాటి మధ్య కాంప్ ఫైర్ వెలుగుతూ వుంది.

ఇండియన్ కోస్టల్ గార్డ్సు యిక్కడ కాంప్ వేసి వుంటారనుకొంది ఆమె. తూర్పుతీరం చేరడానికి వారి సహాయం కోరాలి అనుకుందామె ఆ గూడారాలవైపు అడుగు వేయబోతూ.

అంతలో....ఒక గుడారంలో నుండి ఇద్దరు సైనికులు బయటకు వచ్చారు.

వారివంక అనుమానంగా చూసింది ఆమె. ఎందుకో వారిని చూస్తుంటే ఇండియన్ సోల్జర్స్‌లా అనిపించలేదు ఆమెకు.

కాంప్ ఫైర్ దగ్గరకు వచ్చారు వారు ఏదో మాట్లాడుకొంటూ. ప్రక్కనున్న కెటిల్ నుండి, రెండు మగ్గులలో టీని వంపుకున్నారు.

కాంప్ ఫైర్ వెలుగులో వారి భుజాలపై నున్న నక్ష

అంతే! ఆమె ముఖం నల్లగా మారిపోయింది.

అర్ధచంద్రుని పై నక్షత్రపు గుర్తున్న ఎంబ్లమ్ ధరించే దళం భారత దేశంలోని చిన్న పిల్లలకు సైతం తెలుసు.

"పాకిస్తానీస్ ..!" అస్పష్టంగా తనలో తానే గొణుక్కుంది ఆమె.

"భారత భూభాగమైన మినీకాయ్ దీవుల్లో సంచరించాల్సిన అవసరం పాకిస్తాన్ సోల్జర్స్‌కు ఏముంది? ఏమిటి చేస్తున్నారు వారక్కడ?"

కుతూహలం పట్టలేక, చెట్లను చాటు చేసుకుంటూ మరి కొంతదూరం ముందుకు నడిచింది ఆమె.

అక్కడ....కొన్ని గజాల మేర అంతా కొట్టివేయబడి, నేలంతా చదును చేయబడి వుంది. ఆ ప్రదేశం చుట్టూ పెద్ద పెద్ద గోతులను తవ్వుతున్నారు కొందరు సైనికులు.

"మై గాడ్! వీరి ప్రయత్నాన్ని చూస్తుంటే, ఒక సైనిక స్థావరాన్నే నిర్మించేట్లున్నారు!" అనుకుంది ఆమె కలవరంగా వారివంక చూస్తూ.

ఇక ఆ ప్రదేశంలో వుండి, శోధించాల్సినది ఏదీ లేదనిపించింది ఆమెకు. వెంటనే తాత్సారం చేయకుండా పిల్లిలా అడుగులు వేసుకొంటూ వెనుతిరిగింది ఆమె.

అయితే అంతటితో ఆమె అదృష్టదేవత ముఖాన్ని చాటువేసింది. మూడడుగులు కూడా వేయకుండానే, ఆ సైనికుల కంట పడిందామె.

అడవిలో ఒంటరిగా సాక్షాత్కరించిన ఆడపిల్లను

చూసేసరికి, ఆశ్చర్యంతో చింకి పాటంత అయింది ఆ సైనికుని ముఖం.

"ఎవరు? ఎవరది? ఆ చెట్ల వెనుక?" అంటూ అరిచాడతడు.

అంతే! భయ విహ్వలురాయి వారివంక చూసిందామె. ఆడగాలి కోసం అలమటించిపోయే ఆ సైనికుల చేతికి చిక్కితే జరిగేదేమిటో ఆమెకు బాగా తెలుసు.

మరుక్షణం కళ్ళెం విడిచిన గుర్రంలా పరుగుతీయడం ప్రారంభించింది ఆమె.

బిగువైన స్విమ్మింగ్ సూట్ లో నుండి తోరికున్నట్లు కనిపిస్తోన్న ఆమె యవ్వన సంపదల వంక ఆశగా చూస్తూ లొట్టలు వేసుకుంటూ....ఆమెను వెన్నాడసాగారు ఆ సైనికులు.

## 8

బీప్ బీప్ మంటూ శబ్దం చేస్తూ ఆ గదిలోని ఎర్రని బల్బు మూడుసార్లు వెలుగుతూ ఆరింది.

రాంకుమార్ గుండెలపై తలవాల్చి హాయిగా పడుకొనివున్న ఆయేషా ఆ శబ్దానికి ఉలిక్కిపడి లేచింది. ఛటుక్కున మంచం దిగింది. నైటీని సర్దుకొని, వడివడిగా అడుగులు వేసుకొంటూ ఆ గది బయటకు నడిచింది.

ఆమె ప్రవర్తనకు ఆశ్చర్యపడుతూ రాంకుమార్ కూడా మంచం నుండి క్రిందకు దిగాడు.

"ఏం జరిగింది? ఆయేషా యెందుకంత కంగారుగా బయటకు వెళ్ళింది?" ఆలోచిస్తున్నాడతడు

అంతలో గది బయట యెవరివో మాటలు వినిపించాయి అతనికి. పిల్లిలా అడుగులు వేస్తూ ద్వారంవైపు

నడిచాడతడు. మూసివున్న తలుపు వెనుక నిలబడి కీ హోల్ నుండి బయటకు చూశాడు.

వరండాలో ఆయేషా ఎదురుగా నల్లని దుస్తులను ధరించిన వ్యక్తి ఒకడు నిలబడి వున్నాడు.

"మేడం!

డయాక్సిన్ కలిపిన మట్టి ఇరవై డ్రమ్ములతో ఈ రాత్రికే...." అంటూ వినయంగా ఏదో చెప్పబోతున్నాడతడు.

అంతే. ఛెళ్ళున అతని చెంప పేలిపోయింది.

"షటప్ యువర్ అగ్లీ మౌత్! ఎక్కడ ఏది మాట్లాడాలో కూడా తెలియదు. డర్టీ రాస్కెల్!" కోపంతో మండిపడుతూ అంది ఆయేషా.

"ఆ చెప్పాల్సిందేదో నా గదిలోనికి వచ్చి ఏడు" విసు విసా నడుచుకొంటూ వెళ్ళిపోతూ అంది ఆమె.

అక్కడ చెబితే తప్పేమిటో, ఆయేషా కొట్టిన ముప్పేమిటో అర్థంకాక తెల్లబోతూ చూశాడా అనుచరుడు.

ఆ అనుచరునివంక పరీక్షగా చూశాడు శాంతకుమార్.

'సముద్రంలో తమపై దాడి చేసిన వ్యక్తులు కూడా సరిగ్గా ఈ అనుచరుని లాంటి నల్లని దుస్తులనే ధరించారు. అంటే....ఆయేషా మనుషులే తమను చంపడానికి ప్రయత్నించారా?

దవడ పగలగొట్టి మరీ ఆపాల్సినంత రహస్యం ఆ అనుచరుని మాటల్లో ఏముంది?'

అతడు మరోసారి ఆ అనుచరుని మాటలను మననం చేసుకొన్నాడు.

'డయాక్సిన్ కలిపిన మట్టి ఇరవై డ్రమ్ములతో ఈ

రాత్రికే....'

ఏమిటి ఆ మాటలలోని రహస్యం?

అందులో.... 'డయాక్సిన్' అన్న మాటను ఎక్కడో విన్నట్లు అనిపించసాగింది అతనికి. తీవ్రంగా ఆలోచించ సాగాడతను. సరిగ్గా రెండు క్షణాల తరువాత గుర్తుకు వచ్చింది అతనికి ఆ మాటను యెక్కడ విన్నాడో.

జ్ఞాపకాల తెరను తొలగించుకొని ఒకరోజు ముందుకు వెళ్ళాడతడు.

బోటు ప్రమాదంలో చిక్కుకోక ముందు.

ఆ రోజు....

వారి బోటు మినీకాయ్ దీవులకు పశ్చిమ దిశలో ప్రయాణిస్తూంది. అప్పటికే మిగిలిన మూడు దిక్కుల లోనూ వారి అన్వేషణ పూర్తయింది.

"మాధవీ!

"ఈ దిక్కును కూడా కవర్ చేసేస్తే, మన అన్వేషణ పూర్తయినట్లే. ఇంతవరకూ కాడ్మియం లాంటి లోహాలేవీ మనకు ట్రేస్ కాలేదు. అంటే మనం అనుమానిస్తున్న యీ ఒక్క ఆధారమూ మట్టికొట్టుకు పోయినట్టే!

మరి ఈ జల కాలుష్యం ఎలా సంభవిస్తూంది?"— బోటును నడుపుతూ అన్నాడతను.

"అదే నేనూ ఆలోచిస్తున్నాను కుమార్!

ప్రస్తుతం దేశంలో మిక్కిలి కాలుష్యమైన నగరం బొంబాయి.

ప్రతిరోజూ 268 టన్నుల కార్బన్ మోనాక్సైడ్, 4- టన్నుల సల్ఫర్ డయాక్సైడ్, 27 టన్నుల నైట్రోజన్ ఆక్సైడ్, 37 టన్నుల హైడ్రోకార్బన్‌లు, 30

టన్నుల యితర రసాయన పదార్థాలు వాతావరణం లోనికి చేరుకొంటున్నాయి.

విషపూరితాలైన ఇన్ని రసాయన పదార్థాలు కలుస్తున్నా, బొంబాయి సాగరతీరం, మినీకాయ్ దీవులంతగా కాలుష్యం కాలేదు. అక్కడ లభిస్తున్న చేపలు ఈ దీవి చేపలంతగా విషతుల్యం కాలేదు.

అంటే.... బొంబాయిలో కంటే విషపూరితాలైన రసాయనాలేవో ఈ దీవి జలాలలో కలుస్తూ వుండాలి. ఆ అనుమానంతో నే నిన్న రాత్రి ఈ సాగర జలాలను మరోసారి పరీక్షించి చూశాను కుమార్.

ఒక కొత్త రసాయనం యొక్క లక్షణాలు కొన్ని ఈ జలాలలో లభ్యమయ్యాయి నాకు. నా అనుమానం నిజమైతే అది అత్యంత ప్రమాదకరమయిన రసాయనం.

ఆఫ్ కోర్స్! ఐ కాంట్ బి ష్యూర్ అఫ్ దట్! ఇక్కడున్న కొద్దిపాటి ఎక్విప్ మెంట్ తో.... ఆ లక్షణాలు ఆ రసాయనానివేనా లేక కానా అన్నది నిర్ధారించలేక పోయాను నేను.

అందుకే, నా అనుమానాన్ని క్లియర్ చేసుకోనేందుకు, కొంత జలాన్ని, దానితో పాటుగా నేను కనుగొన్న లక్షణాలను విపులీకరిస్తూ వ్రాయబడ్డ రిపోర్టును త్రివేంద్రంకు పంపించాను.

బహుశా! ఈ రోజు సాయంత్రానికి అక్కడ నుండి రిపోర్టు రావచ్చు" అంది ఆమె.

"అంత ప్రమాదకరమైన ఆ రసాయనం యేమిటి మాధవీ?" కుతూహలంగా అడిగా డతడు.

"డ... యా... క్సి... న్" — ఒక్కొక్క అక్షరాన్ని వత్తి పలుకుతూ అంది ఆమె.

"డయాక్సిన్?"—అర్థం కానట్లు చూశాడతడు.

చిన్నగా నవ్వి, చెప్పడం ప్రారంభించింది ఆమె. ఆమె చెబుతున్న ఒక్కొక్క మాట వింటున్న కొద్దీ ఒంటిమీద చీమలూ, జెర్రులూ ప్రాకుతున్నట్లు అనిపించ సాగింది అతనికి.

"అణుస్థావరాల్లో ఉత్పత్తి అయ్యే రేడియో ఏక్టివ్ విసర్జిత పదార్థాలలో డయాక్సిన్ ఒకటి. అత్యంత ప్రమాదకరమయిన ఈ రసాయనం సముద్రంలో చేరితే సముద్రపు నీటితో పాటు వాతావరణం కూడా కలుషితం అవుతుంది.

సముద్ర జీవులను, సముద్ర సంపదను విషతుల్యం చేసి యావత్ సముద్రాన్ని మృత్యుకూపంగా మారుస్తుంది ఈ రసాయనం.

అన్ని విషాలనూ సముద్రం హరించుకోగలదు అనే విశ్వాసంతో లక్షలు, కోట్ల టన్నుల పరిమాణంలో రకరకాల రసాయనాలు, మలమూత్రాలను సముద్రంలో కలిపేస్తున్నారు. ఇప్పటికే వాటిని మింగిన చేపల ద్వారా చిత్ర, విచిత్రమయిన కొత్త రోగాలు మనిషికి వ్యాపించి, మృత్యువును గొని తెస్తున్నాయి"—చెప్పటం ఆపి బాధగా నిట్టూర్చిందామె.

"డయాక్సిన్ లాంటి అణుస్థావర విసర్జిత పదార్థాలు కూడా సముద్రంలో కలుపబడుతుంటాయా!" ఆశ్చర్యంగా అడిగాడతడు.

అవునన్నట్లుగా తల పంకించింది ఆమె.

"విష సదృశమైన రసాయనాలను రహస్యంగా నౌకల్లో రవాణా చేసి, మరో దేశంలో ఎవరికీ తెలియకుండా పారవేసి రావటం లాంటి సంఘటనలు ఇటీవల

ఎక్కువగా జరుగుతున్నాయి.

యూరప్ దేశాల్లో అలాంటి విషపదార్థాలు మూడు కోట్ల టన్నుల వరకూ ఉత్పత్తి అవుతున్నాయి. అందులో కేవలం పదిలక్షల టన్నుల విషపదార్థాలు మాత్రం తూర్పు జర్మనీకి రవాణా అవుతాయి. ఆ పదార్థాన్ని అక్కడ నిర్వీర్యం చేసి యెవరికీ ప్రమాదం కలగకుండా జాగ్రత్తపడతారు.

మిగిలిన రెండుకోట్ల తొంభయి లక్షల టన్నులు ఎక్కడెక్కడికో రహస్యంగా రవాణా చేసి, ఆ యా దేశాల వాతావరణాన్ని కలుషితం చేస్తూన్నారనేది బహిరంగ రహస్యం

ఇలాంటి రహస్యం యిటీవల జరిగిన ఒక ఓడ ప్రమాదంలో బయటపడింది.

1984 ఆగష్టులో ....

బ్రిటీష్ నౌక ఓ లెవ్ బ్రిటానియా, ఫ్రెంచ్ నౌక మౌంట్ లూయీ ఢీకొన్నాయి. బెల్జియం సముద్ర తీరంలో జరిగిన ఆ ప్రమాదంలో ప్రాణ హాని జరగలేదు. కాని, ఫ్రెంచ్ నౌక మౌంట్ లూయీలో 41 డ్రమ్ముల డయాక్సిన్ కలిసిన మట్టి కనుగొనబడింది. ఇటలీలోని ఓ అణుసావరం నుండి ఆ పదార్థం రహస్యంగా ఫ్రాన్స్‌లోని ఓ ప్రాంతానికి రవాణా అవుతూందని....తరువాత బయటపడింది."

—అంతే!

జ్ఞాపకాల తెరలలో నుండి ఉలిక్కిపడి లేచాడతడు....

'డయాక్సిన్ కలిసిన మట్టి యిరవై డ్రమ్ములతో యీ రాత్రికి అంటే యేమిటో అప్పుడర్థం అయింది

అతనికి.

'అంటే....యిక్కడ, మినీకాయ్ దీవి ప్రాంతాలలో అరేబియా సముద్రంలో కూడా అణువిసర్జిత పదార్థాలు కలుపబడుతున్నాయన్న మాట!

అందులో భాగంగా ఇరవై డ్రమ్ములలో డయాక్సిన్ కలిసిన మట్టి ఈ రాత్రికే యిక్కడకు చేరుకుంటుంది.

ఏ దేశం యీ దారుణకృత్యానికి పాల్పడుతోంది?'- అతడు ఒక్క క్షణం పాటు ఆలోచించాడు.

నైసర్గికంగా చూస్తే, అరేబియా సముద్రాన్ని వినియోగించుకోగల అవకాశం ఒక్క దక్షిణ, ఆగ్నేయ ఆసియా దేశాలకు మాత్రమే వుంది.

అంటే....శ్రీలంక, గల్ఫ దేశాలూ, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్....

పాక్ అణు శాస్త్రజ్ఞుడు డాక్టర్ అబ్దుల్ ఖాదిర్ ఖాన్—తమ దేశం అణు బాంబును తయారుచేసిందంటూ యిచ్చిన పేపర్ స్టేట్‌మెంట్ గుర్తుకు వచ్చింది అతనికి.

య్యెస్! సందేహంలేదు. ఇది పాకిస్తాన్ పనే! వారే తమ అణుస్థావరంలోని విసర్జిత పదార్థాలను అరేబియన్ సీలో డంప్ చేస్తూ ఉండాలి!'

అంతటితో అతని ఆలోచనలు అంతరించిపోయాయి. పట్టలేని ఆవేశంతో అతని రక్తం సలసలా మరిగిపోయింది.

విసురుగా తలుపును తెరచి, బయటకు అడుగుపెట్టాడతడు.

ఆ గది బయట స్టెన్ గన్‌ను ధరించిన దృఢకాయుడొకడు కాపలా ఉన్నాడనీ, తాను పారిపోవడానికి

ప్రయత్నిస్తే నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపుతాడనీ ఆ ఆవేశంలో రాంకుమార్ మరచిపోయాడు.

అయితే, ఆ దృఢకాయుడు రాంకుమార్ గుండెలకు గన్ను గురిపెట్టలేదు. చూడరానిది యేదో చూసినట్లు, ఆశ్చర్యంతో 'ఓ!' అంటూ చిన్నగా అరిచాడు అతడు.

రాంకుమార్ లాంటి ప్రొఫెషనల్స్‌కు ఆ మాత్రం వ్యవధి చాలు. అతని కుడిచేయి ఫ్లాష్‌లా లేచి ఆ దృఢకాయుని మెడకు కనెక్ట్ అయింది. అంతే! కట్టెలా బిగుసుకుపోయి, దఫ్‌మంటూ నేలమీద పడిపోయాడతడు.

కరాటే, అకిడో లాంటి మార్షల్ ఆర్ట్స్‌లో ప్రావీణ్యం ఉన్నవారు మాత్రమే ఉపయోగించగల పారలైజింగ్ స్ట్రోక్ అది. ఆ స్ట్రోక్ తగిలిన వారు మరో పన్నెండు గంటలదాకా స్పృహలోనికి రారని అతనికి తెలుసు.

అడ్డుగా పడివున్న అతడిని దాటుకుంటూ, ముందుకు అడుగు వేయబోయి, ఇంతకూ ఆ దృఢకాయుడు తనను చూసి యెందుకంతగా ఆశ్చర్యపోయినట్టూ అని, అనుమానం వచ్చి, ఒక్కసారి తన శరీరం వంక చూసుకున్నాడతడు.

అంతే!

'ఓ' అంటూ అతడు కూడా చిన్నగా అరిచాడు. సిగ్గుతో అతని ముఖం ఎర్రవారింది.

అతడు పూర్తిగా నగ్నంగా ఉన్నాడు.

## 9

పరుగెత్తి, పరుగెత్తి.. పూర్తిగా అలసిపోయిందామె. ఆయాసంతో ఆమె గుండెలు ఎగిసిపడుతున్నాయి. దాహంతో నాలుక పిడచగట్టుకుపోతూంది ముళ్ళపొదలు

గీచుకొని శరీరం మంటలు పెడుతూంది.

ఆమెకు తెలిసిపోయింది. ఇక తా ఎంతో సేపు పరుగెత్తలేనని....యింకో పది అడుగులు అంతే! అంతటితో తనలోని శక్తి హరించుకుపోతుంది.

'పిశాచాల్లా వెంటాడుతున్న ఆ పాక్ సైనికుల చేతుల్లో తను బలికావాల్సిందే!' నిస్పృహగా అనుకుంది ఆమె.

పాక్ సైనికుల అడుగుల చప్పుడు మరింత దగ్గరగా వినిపించటంతో భయంతో చిగురుటాకులా వణికిపోయింది ఆమె.

యింకో పది అడుగుల్లో వారామెను సమీపిస్తారనగా....

ఛటుక్కున ఆమెనెవరో జబ్బ పట్టుకొని ప్రక్కనున్న పొదలోనికి లాగారు. భయంతో కెవ్వుమని అరవబోయిందామె. కాని, ఠటాలున అరచేతితో ఆమె నోరును మూసాడతడు.

ఆశ్చర్యంగా అతనివంక చూసిందామె.

అతడు ఆదివాస యువకుడు. కండలు తిరిగిన దేహంతో బలిష్టంగా ఉన్నాడతడు.

'పులి నోటిలోనుండి సింహం నోటిలోనికి పడలేదు కదా తను' అనుకుంది ఆమె. అతని వంక సంశయంగా చూస్తూ.

"వెరుపొందకు దొరసానీ! పెరవారం గామునే! నేస్తులమే!"—ఆమె చెవిలో గుస, గుసలాడుతున్నట్లుగా మెల్లగా అన్నాడతడు.

దాదాపు అతనిని అనుకుంటూ అర్ధనగ్నంగా కన్పిస్తున్న తన శరీరం వంక ఇబ్బందిగా చూసుకుంది ఆమె.

కాని ఆ పొదలో కే ఓ మూల ఒద్దికగా కూర్చుని, తన వంక సిగ్గుగా చూస్తున్న ఆదివాస యువతిని చూసేసరికి ఆమె సంశయాలన్నీ పటాపంచలై పోయాయి.

ఆ పొద వంక అప్పుడు చూసిందామె పరిశీలనగా. సూర్యరశ్మికూడా సోకనంత దట్టంగా వ్యాపించిన ఆ పొదలోపల.... ఓ మూల ఆకులూ, పూవులూ మెత్తని పరుపులా పరచబడి ఉన్నాయి. ఆ పూల పక్కమీదే ఆ ఆదివాస యువతి కూర్చుని వుంది.

ఓప్రక్క గుట్టగా వేరు దగ్గ ఏవో పళ్ళూ, సొరకాయ బుర్రతో నీళ్ళూ వున్నాయి.

వారినీ, ఆ ఏర్పాట్లనూ చూసి, వారు పున్నమినాడు క్రొత్తగా జోడుకట్టిన జంట అనీ, ప్రస్తుతం (హానీమూన్ ట్రిప్) కాము యాత్రలో ఉన్నారని గ్రహించింది మాధవి.

ఆ తరువాత..

ఆకులో ఆకులై, క్రొమ్మలో క్రొమ్మలై ఆ అడవిలో మసలే ఆ ఆదివాసుల సాయంతో, ఆ సైనికుల కంటబడకుండా ఆ అడవిని దాటటం పెద్దకష్టం కాలేదామెకు.

అదేసమయంలో...

త్రివేంద్రంలోని తన కార్యాలయంలో కాలుకాలిన పిల్లిలా అటూ, ఇటూ తిరుగుతున్నాడు పోలీస్ కమీషనర్.

అతని టేబిల్ పై రెండు కాగితాలు పరచబడి ఉన్నాయి. నీట్ గా టైప్ చేయబడిన ఆ రిపోర్ట్సు వంక చూస్తున్న కొద్దీ అతనిలో అసహనం పెరిగిపోతూంది.

వాటిలో ఒకటి: మాధవి పంపిన జలంలో డయాక్సిన్ కలసి వుందనీ, ఆమె అనుమానం నిజమేనని ధృవపరుస్తూ

కెమికల్ లాబ్ వారు పంపిన రిపోర్టు.

రెండవది: ఆయేషా గురించి ఎంక్వయిరీ చేసి సి.బి.ఐ. పంపిన రిపోర్టు.

సి.బి.ఐ. రిపోర్టును చేతులలోనికి తీసుకొని, మరోసారి చదివాడతడు.

చిమన్ భాయి పటేల్ కు బొంబాయిలోని తాజ్ కోరమండల్ ఫైవ్ స్టార్ హోటల్ లో ఒక డాన్సర్ గా పరిచయం అయింది ఆమె.

తన అందంతో అతనిని ఆకర్షించింది. ఆమె వంపు, సొంపులను చూసి పిచ్చెక్కిపోయాడతడు.

అతనిని వివాహం చేసుకొని, అతనితో పాటుగా మినీకాయ్ దీవులకు వెళ్ళిపోయిందామె.

అయితే విచిత్రమైన విషయం ఏమిటంటే, చిమన్ భాయి పటేల్ బొంబాయి వచ్చేముందు, కేవలం కొన్ని రోజుల క్రితమే ఆ హోటల్ లో డాన్సర్ గా చేరిందామె.

అంతకు క్రితం ఆమె ఏం చేసేదో, యెక్కడ నుండి వచ్చిందో యెవరికీ తెలియదు.

కాని, ఆయేషా ఫోటోను చూస్తుంటే, పాకిస్తాన్ ఇంటలిజెన్స్ స్టార్ ఏజెంట్ జుబేదాకూ, ఆమెకూ చాలా దగ్గర పోలికలు కన్పిస్తున్నాయి.

అతడు రిపోర్టును చదవడం పూర్తిచేసాడు.

'అదే నిజమైతే.... పాకిస్తాన్ స్టార్ ఏజెంట్ పనిగట్టుకొని ముసలి పటేల్ ను పెళ్ళాడి, మినీకాయ్ దీవుల్లో కాపురం పెట్టిందీ అంటే....

దీని వెనుక పెద్ద గ్రంథమే ఉండాలి' అతడు తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

దీనికన్నా ఆయనను కలవర పెడుతున్నది........గత

రెండు రోజులుగా, ఎంత ప్రయత్నించినా రాంకుమార్ గాని, మాధవిగాని కాంటాక్ట్ కాకపోవటం.

'ఏమయ్యారు వీరిద్దరూ?

ఒకవేళ జరుగరానిదేమైనా జరిగి వీరుకూడా ఆ వైద్య బృందం లాగే....' ఆ తరువాత ఆలోచించే శక్తిలేక నిస్సత్తువుగా కుర్చీలో కూలబడ్డాడు అతడు.

'ఈ పరిస్థితులలో ఏం చేయాలి తను? మినీకాయ్ దీవులపై దాడిచేయాలా? లేక వారి దగ్గర నుండి మెసేజ్ వచ్చేంతవరకూ వేచి ఉండాలా?'

ఏదీ నిర్ణయించుకోలేక పోతున్నాడు అతడు.

అదే సమయంలో....ప్రాణం పోసుకుంటున్నట్లుగా అతని యెదురుగా టేబిల్ పైనున్న ఫోన్ మ్రోగటం ప్రారంభించింది.

ఆత్రంగా రిసీవర్‌ను అందుకున్నా డతడు.

రిసీవర్ గుండా వినవస్తున్న మాటలు చెవిని పడేసరికి నల్లగా మాడిపోయింది అతని ముఖం, రిసీవర్ పై అతని చేతివేళ్ళు గట్టిగా బిగుసుకున్నాయి.

"నేను వెంటనే బలగంతో బయలుదేరి వస్తున్నాను మాధవీ!

బీ ఎలర్ట్! ఉంటానూ!" అంటూ రిసీవర్‌ను క్రెడిల్ పై వుంచా డతడు.

## 10

"నో! వద్దు రజాక్!

ఆ డ్రమ్ములలోని డయాక్సిన్‌ను ఇప్పుడప్పుడే సముద్ర జలాలలో కలపవద్దు" అంది ఆయేషా.

ఆమె వంక అర్థంకానట్లు చూసాడు రజాక్ అని పిలవబడ్డ ఆ అనుచరుడు.

"ఒక వారం రోజులు ఆగాలి రజాక్! ఈ వారం రోజులూ ఈ దీవిలోని ప్రజలు ఏ జలచరాలనూ ఆహారంగా తీసుకోరు" అందామె చిన్నగా నవ్వుతూ.

ఈ దీవి ప్రజలు తీసుకొనే ఆహారానికీ, తాము సముద్రంలో కలిపే ఈ విసర్జిత రసాయనానికీ మధ్య ఉన్న బాదారాయణ సంబంధం ఏమిటో అర్థంగాక తెల్లబోతూ చూసాడతడు.

"ఈ దీవి మన స్వంతం కావాలంటే, ఈ దీవిలోని మానవజాతి అంతరించిపోవాలి రజాక్! అందుకే విష పూరితమైన ఈ డయాక్సిన్‌ను ఇక్కడి సముద్రజలాలలో కలపటం.

ఇప్పుడే మనం ఈ డయాక్సిన్‌ను ఈ సాగరజలాలలో కలిపామనుకో. ఈ విష రసాయనాన్ని మ్రింగిన చేపలు ఈ వారం రోజులలో చనిపోతాయి. చచ్చిన చేపలను ఈ దీవి ప్రజలు తినరు రజాక్!

అందుకే ఈ విషాన్ని ఫ్రెష్‌గా చేపలద్వారా వీరికి అందివ్వాలంటే....మనం మరో వారం రోజులు ఆగాలి" క్రూరంగా నవ్వుతూ అంది ఆమె.

వెంటిలేటర్ లోనుండి, లోపలకు చూస్తూ, ఆమె మాటలను వింటున్న రాంకుమార్ ఆవేశంతో వణికిపోయాడు.

"యూ దర్టీ బిచ్!" అనుకున్నాడు అతడు కసిగా పళ్ళు కొరుకుతూ.

వారం రోజులపాటు ఏ జలచరాన్నీ ఆహారంగా తీసుకోవద్దని జన్మకారణ్ ఆదేశించినప్పుడు, ఆయేషా ఎందుకు ముఖాన్ని నల్లగా మార్చుకుందో అప్పుడు అర్థం అయింది అతనికి.

"ఈ దీవి మన స్వంతం అయిననాడు దీనిని బేస్‌గా తీసుకొని, ఇండియన్ వెస్ట్రన్ కోస్టల్‌లోని ముఖ్య ప్రదేశాలపై ఎటాక్ చేయటం మనకు చాలా సులువు.... రజాక్!

అప్పుడే మన సైనికులు ఈ దీవి పశ్చిమ భాగంలో స్థావరాలను నిర్మిస్తున్నారు. ఈ మినీకాయ్ దీవి మన ఇస్లాం పతాకం క్రిందకు రావటానికి యింకెంతో కాలం పట్టదు" అంది ఆయేషా.

అంతటితో___

మినికాయ్ దీవుల రహస్యం అంతా మంచులా విడిపోయినట్లు అనిపించింది అతనికి.

యిక తను ప్రత్యక్షంగా రంగంలోనికి దిగాల్సిన సమయం వచ్చింది అనుకున్నాడతడు. వెంటిలేటర్ పైనుండి క్రిందకు దిగడానికి ఉద్యుక్తుడగుతూ...

అంతలో....

ఎందుకో యథాలాపంగా తల ఎత్తి చూసిన ఆయేషా కంటపడ్డాడు అతడు.

"కుమార్!" అంటూ ఆశ్చర్యంలో చిన్నగా అరిచింది ఆమె. మరుక్షణం రజాక్ ఠివ్వున గదిలోనుండి బయటకు పరుగెత్తాడు.

ఆయేషా తనను చూసిందని గ్రహించిన వెంటనే, ఒకక్షణం కూడా తాత్సారం చేయకుండా క్రిందకు దూకాడు రాంకుమార్. రెండడుగులు ముందుకు వేసేసరికి కాలయముడిలా నిలుచున్న రజాక్ ఎదురయ్యాడతనికి.

తన చేతిలోని స్టెన్ గన్‌ను రాంకుమార్ గుండెలకు గురిపెట్టబోతున్నాడతను. ఒక్క క్షణం రజాక్‌కు తనకూ మధ్యనున్న దూరాన్ని అంచనా వేసాడతడు.

అంతే!

నిలుచున్నవాడు, నిలుచున్నట్లుగానే గాలిలోనికి ఎగిరాడు రాంకుమార్. గుండెలు జలదరింపజేసే కుంగ్‌ఫూ షౌట్ అతడి కంఠంలోనుండి వెలువడింది. ఎడమకాలు స్ప్రింగ్‌లా మడిచి, కుడికాలును ఫ్లాట్‌గా వుంచి రివ్వున ఎగిరి రజాక్ గుండెలపై తన్నాడతడు.

రెండంగుళాల మందం ఉండే బలమైన చెక్క తలుపులను సైతం ముక్కలు చేయగల ఫ్లయింగ్ కిక్ అది.

గుండెలు పగిలి, రక్తం కక్కుకుంటూ అక్కడికక్కడే ప్రాణాలు వదిలాడు రజాక్.

రజాక్ శవం పైనుండి గెంతుకుంటూ ఆ గదిలోనికి ప్రవేశించాడతడు.

ఆశ్చర్యం!

అక్కడ ఆయేషా లేదు.

“ఎక్కడకు తప్పించుకుపోతావు ఆయేషా! ఆ దీవి ప్రజలకు నీవు చేసిన ద్రోహానికి నిన్ను చిత్రవధ చేయనిదే విడిచిపెట్టను” అనుకున్నాడు అతడు, ఆ గదిలోనుండి బయటకు వస్తూ.

అదే సమయంలో చెవులు చిల్లులు పడేలా వినిపించిందొక సైరన్ మ్రోత. పుట్టలలోనుండి వెలువడ్డ చీమల్లా ఆ భవనంలోనుండి బయటకు వచ్చారు నల్లని దుస్తులను ధరించిన ఆయేషా అనుచరులు.

వారిని మానీ, షార్పుగా లెఫ్ట్‌కు టర్న్ అయి, ఆ భవనం వెనుక భాగంవైపు పరుగెత్తాడు రాంకుమార్.

అప్పుడు అతడున్నది ఆ భవనంయొక్క మూడవ ఫ్లోర్‌లో. ఆయేషా కూడా ఆ ఫ్లోర్‌లోనే ఏదో గదిలోనో దాక్కొని ఉండాలి.

ఆ భవనం నిండా చీమల బారుల్లా తిరుగాడుతున్న ఆయేషా అనుచరులను చూశాక, ఆమె యెక్కడుందో వెదుకుదామన్న ఆలోచన అతనిలో అంతరించిపోయింది.

"ఓ.కే! బేబీ! ఈ భవనంనుండి నిన్ను ఎలా బయటికి రప్పించాలో నాకు బాగా తెలుసు" అనుకున్నాడతడు ఆ భవనం వెనుక భాగానున్న నీటి పంపును పట్టుకొని జర్రున క్రిందకు జారుతూ.

నేలమీద కాలు మోపిన మరుక్షణం గ్రౌండ్ ఫ్లోర్ లోనున్న ఒక్కొక్క గదినీ పరిశీలించటం ప్రారంభించాడతడు. సరిగ్గా అయిదు నిముషాల తరువాత అతని అన్వేషణ ఫలించింది.

ఒక గదిలో నీట్ గా పేర్చబడ్డ ఆయిల్ డ్రమ్ములను చూడగానే వికృతమైన హాసం ఒకటి అతని పెదవులపై నర్తించింది. రెండు డ్రమ్ముల మూతలను ఊడదీసి ఆయిల్ ను నేలమీద క్రుమ్మరించాడతను.

భవనం వెనుక మండుతున్న గాడి పొయ్యిలోనుండి రెండు కట్టెలను తెచ్చి, ఆ గదిలోనికి విసిరాడు.

అంతే!

భగ్గున మంటలు అంటుకున్నాయి. ఆయిల్ డ్రమ్ములు అంటుకొని బాంబుల్లా పేలటంతో, ఆ భవనం కంపించింది. నాలికలు చాస్తూ ఆ మంటలు మెల్లగా రెండవ ఫ్లోర్ లోనికి వ్యాపించసాగాయి.

మంటల్లో చిక్కుకున్న తమ భవనాన్ని చూసి కంగారుపడ్డారు ఆయేషా, ఆమె అనుచరులు.

అదే సమయంలో ఆ భవనం ముందు ఆగాయి రెండు పోలీస్ వ్యాన్ లు, ఒక జీపు. వాటిలోనుండి బిల, బిల

మంటూ దిగుతున్న స్పెషల్ పోలీస్ స్క్వాడ్ నూ, జీప్ లోనుండి క్రిందకు దిగుతున్న త్రిచంద్రం పోలీస్ కమీషనర్ నూ, మాధవినీ చూసేసరికి అయేషా ముఖం నల్లగా మాడిపోయింది.

'తన రహస్యం బయటపడిందని' గ్రహించింది ఆమె. 'ఎటాక్' అంటూ గట్టిగా అరిచింది ఆమె. ఆమె అనుచరులు పోలీసులపై తుపాకులను గురిపెట్టారు. ఆ భవనం చుట్టూ వలయంలా యేర్పడి తాము కూడా యెదురు కాల్పులను సాగించారు పోలీసులు.

పోరు ప్రారంభమయింది. తుపాకీ మ్రోతలతో ఆ దీవి దద్దరిల్లిపోయింది.

ఎవరూ ఆపే ప్రయత్నం చేయకపోవటంతో, నిరాటంకంగా ఆ భవనం అంతటా వ్యాపించసాగాయి ఆ మంటలు. వాటిని ఆపాలంటే వారు భవనంలోనుండి బయటకు రావాలి. బయటకు వస్తే పోలీసుల తుపాకీ గుళ్ళకు గురికావాలి.

తన పరిస్థితి ఇరకాటంలో పడిందని గ్రహించిందామె. ముందు ఈ భవనంలోనుండి బయటపడాలి అనుకుందామె. ఆ గదిలోని గోడకు అమర్చబడ్డ ఒక రహస్య ద్వారాన్ని తెరుస్తూ. ఆ త్రోవ భూగర్భంగుండా సాగర తీరానికి దారి తీస్తూంది.

ఒక చెట్టు చాటున నిలబడి పరిస్థితి నంతటినీ సమీక్షించుకుంటున్నారు రాంకుమార్, మాధవి, పోలీస్ కమీషనర్.

వారికి తెలుసు. ఇంకొద్ది సేపటిలో మంటల వేడికి తట్టుకోలేక అయేషా అనుచరులంతా ఆ భవనం వీడి బయటకు వచ్చేస్తారని, తమ చేతుల్లో చిక్కుకుంటారని.

అదే సమయంలో భారత సైనికదళాలు, ఆ దీవి పశ్చిమానున్న పాక్ సైనికులపై దాడిచేస్తుంటారని కూడా వారికి తెలుసు.

'మొత్తంమీద పరిస్థితి అంతా అదుపులోనికి వచ్చేసి నట్లే!' అనుకున్నాడు పోలీస్ కమీషనర్ వీరోచితంగా పోరాడుతున్న తన సిబ్బంది వంక ప్రశంసాపూర్వకంగా చూస్తూ.

అదే సమయంలో

రహస్య మార్గంగుండా సాగర తీరం చేరుకుంది ఆయేషా. సముద్రపు ఒడ్డున లంగరు వేయబడ్డ స్టీమ్‌బోట్ వైపు నడిచింది.

సరిగ్గా మూడడుగులు వేసేసరికి, ఆమె దారికి అడ్డంగా ప్రత్యక్షమయ్యాడు ఆమె భర్త చిమన్‌భాయి పటేల్. అతని చేతిలోని రివాల్వర్ సూటిగా ఆమె గుండెలకు గురిపెట్టబడి ఉంది.

"నీవు ఈ మార్గం గుండా నే వస్తావని నాకు తెలుసు ఆయేషా! అందుకే ఇక్కడ కాచాను.

నీ అందానికి బానిసనై, నీ పుట్టుపూర్వోత్తరాలు కూడా తెలుసుకోకుండా నీ మెడలో తాళికట్టాను. ఈ దీవికి నిన్ను రాణిని చేశాను.

కాని, నీవు మనిషివి కావని, అమాయకులైన ఈ దీవి ప్రజల ప్రాణాలను హరించడానికి వచ్చిన నరహంతకివని గ్రహించలేకపోయాను.

చావు రాక్షసీ....చావు!

ఈ దీవికి నావలన పట్టిన నీ శని నా చేతులతో నే విరగడ కావాలి!"

పట్టలేని ఉద్రేకంలో ఊగిపోతూ ట్రిగ్గర్ నొక్కా

డతడు.

నిలుచున్న మనిషి నిలుచున్నట్లుగానే కట్టెలా వెనక్కి వ్రాలిపోయిందామె. వెంట్రుకవాసిలో ఆమె గుండెలపైనుండి గాలిలో దూసుకుపోయింది ఆ రివాల్వర్ గుండు. నేలమీద వ్రాలిన మరుక్షణం స్ప్రింగ్‌లా పైకి లేచిందామె. తటిల్లతలా ముందుకు ఉరికింది.

అతడు మరోసారి రివాల్వర్‌ను పేల్చబోయాడు. కాని అప్పటికే విసురుగా లేచిన ఆమె కుడికాలు అతని చేతిలోని రివాల్వర్‌ను ఎగురగొట్టింది.

చేతి వ్రేళ్ళను పులిపంజాల్లా బిగించి బలంగా అతని కంఠంపై మ్రోదింది ఆమె. మార్షల్ ఆర్ట్స్‌లో టైగర్ పంచ్‌గా పేరుపొందిన ఆ స్ట్రోక్‌కు, కంఠనాళాలు త్రెగిపోయి, విగతజీవుడై నేల వాలిపోయాడు పటేల్.

అతని శవాన్ని దాటుకుంటూ స్టీమ్‌బోట్‌వైపు పరుగెత్తిందామె.

స్టీమ్‌బోట్ స్టార్టయిన శబ్దం వినిపించేసరికి ఉలిక్కిపడి చూశాడు రాంకుమార్. బోట్‌లో కూర్చున్న ఆయేషాను చూడగానే రేచుకుక్కలా సముద్ర తీరానికి పరుగెత్తాడతడు.

అప్పటికే ఆయేషా నడుపుతున్న బోటు సముద్రంలోనికి దూసుకుపోయింది. ఒడ్డున వున్న మరో స్టీమ్‌బోట్‌ను స్టార్టు చేశాడతడు.

అనంతమైన సాగరంలో ఆ రెండు బోట్లూ పోటీపడుతూ శరవేగంగా దూసుకుపోతున్నాయి.

ఎవరిదో చేయి తన భుజంమీద పడేసరికి ఉలిక్కిపడి చూశాడు రాంకుమార్. అతని వెనుకే పరుగెత్తుకుంటూ వచ్చి, ఆఖరిక్షణంలో బోట్‌లోనికి జంప్ చేసిన మాధవి,

నవ్వుతూ అతని వంక చూసింది.

ఆయేషా నడుపుతున్న బోటు సరిగ్గా పది అడుగుల దూరంలో ఉండనగా.... రాంకుమార్ మాధవికి ఏదో సైగచేశాడు. ఆమె చటుక్కున లేచి ఒక పెట్రోల్ టిన్‌ను అందుకుంది. అదేక్షణంలో ఆయేషా బోటును సమీపించింది వారి బోటు. చేతి పెట్రోల్ టిన్ మూతను ఊడదీసి బలంగా ఆ బోటుమీదకు విసిరింది ఆమె.

ఆయేషా బోటునిండా పెట్రోలు వర్షంలా చిమ్మింది. అదేక్షణంలో రాంకుమార్ రివాల్వర్‌ను పేల్చాడు. అంతే! గుప్పుమని మంటలు అంటుకున్నాయి.

మంటల్లో చిక్కుకున్న తన బోటు వంక భయంగా చూసింది ఆయేషా. మరో రెండు నిముషాల్లో పెట్రోల్ టాంక్ అంటుకొని ఆ బోటు బాంబులా పేలిపోతుందని ఆమెకు తెలుసు.

అందుకే, తాత్సారం చేయకుండా స్టీరింగ్‌ను వదలి నీటిలోనికి డైవ్ చేసిందామె.

అయితే.... ఆమె దురదృష్టం!

నూటిగా వెళ్ళి ఒక పెద్ద షార్క్. గుంపు మధ్య పడిందామె. వాడియైన వాటి శరీరపు అంచులు తగిలి ఆమె శరీరం కోసుకుపోయి రక్తం చిమ్మింది.

రక్తపు వాసన సోకడంతోనే పిచ్చెక్కిపోయాయి ఆ షార్క్‌లు. తెల్లనికోరలను చాస్తూ తనను సమీపిస్తున్న షార్క్‌లను చూసేసరికి భయంతో కంపించిపోయిందామె.

వాటి మధ్యనుండి తప్పించుకొని పోవాలని విఫల యత్నం చేసిందామె. కాని అప్పటికే ఆ షార్క్‌లు ఆమెను చుట్టుముట్టాయి. మెల్లగా ఆమె శరీరాన్ని కోరలతో చీలుస్తూ కొరుక్కు తినసాగాయి.

భరించలేని బాధతో విలవిలలాడిపోతున్న ఆయేషాను చూస్తూ....

'ప్రాణం నిలిచి ఉండగానే, శరీరంలోని ఒక్కొక్క కండనూ షార్క్స్ పీక్కుతినడం కంటే భయంకరమైన శిక్ష....బహుశ యమలోకంలో కూడా ఉండదు.

'ఆయేషా, నీలాంటి నరహంతకికి ఇదే సరైన శిక్ష!' అనుకున్నాడు రాంకుమార్.

సాగర జలాలను విషపూరితం చేసి, ఏ జలచరాల ద్వారా ఆ దీవి ప్రజల ప్రాణాలను తీద్దామని సంకల్పించిందో.....ఆ జలచరాల ద్వారానే ఆమె ప్రాణాలు పోవడం నిజంగా దైవ లీల!

—:అ యి పో యి ం ది:—

సీరియల్

## వి.యస్.రావ్



(గత సంచిక తరువాయి)

"మిస్టర్ మనోజ్ ...."

రిసెప్షనిస్టు కంఠం అతన్ని చెవిలో హెచ్చరించింది. తన ప్రశ్నకి సమాధానం దొరికింది.

"అరగంటలో అకౌంట్ వివరాలు నా గదికి పట్రండి. పే చేస్తాను" మనోజ్ నిట్టూరుస్తూ అన్నాడు.

"అరగంట..అరగంటలో క్యాష్ రెడీ చేయగలరా?" రిసెప్షనిస్టు కంఠంలో సందేహం ధ్వనించింది.

"మీకు క్యాష్ కావాలా? చెక్కా?" మనోజ్ చిరాకుగా అడిగాడు.

"క్యాష్ అవుతే మంచిది...."

"క్యాష్ ఇస్తాను."

"థాంక్యూ వెరీమచ్. అరగంటలో అక్కడుంటాను"

మనోజ్ చెవిలో ఫోన్ క్లిక్ అంది.

రిసీవర్ని పడేసి మనోజ్ చకచకా కదిలాడు. వార్డ్రోబ్‌లో, మంచంమీద పడున్న గుడ్డల్ని, బార్ రూంలో వున్న సరంజామానీ గబగబా సూట్ కేస్‌లో సర్దాడు. ఫోమ్ బెడ్‌కీ, మంచానికీ మధ్య దాచి వుంచిన కత్తిని తీసి సూట్ కేస్ అడుగు భాగంలో వుంచాడు. కోటు జేబులో వున్న రివాల్వర్ని వోసారి చూసి, కోటు తగిలించుకున్నాడు.

గదిలో తన వస్తువులేవీ లేవని తేల్చుకొని, సూట్ కేస్ తీసుకొని గదిలోంచీ ఇవతలికి నడిచాడు. నడవ చివరున్న మెట్లని సమీపించి, పైకి యెక్కడం ప్రారంభించాడు. రెండు నిమిషాల్లో, మెట్లని యెక్కి బిల్డింగ్ పైకి చేరుకున్నాడు. హోటల్ బిల్డింగ్ వెనకవైపు వున్న పిట్టగోడ ముందు ఆగి, కిందికి చూశాడు.

హోటల్ డెలివరీ వాన్, వెనక భాగంలోని గేటమ్మట అప్పుడే ముందుకు వెళ్తోంది. పరుగెట్టుకుంటూ వచ్చిన వ్యక్తి గేటు మూసేసి, సందులో ఆగిన వాన్ వైపు జోరుగా నడిచాడు. అతను ఎక్కగానే వాన్ కదిలింది.

మనోజ్ నడుముకి వున్న లెదర్ బెల్టుని ఊడదీశాడు. సూట్ కేస్ హాండిల్ గుండా పోనిచ్చి, చివరి చిల్లులో పిన్ దూర్చి, బకిల్ తగిలించాడు. పొడుగాటి రింగులా తయారైన బెల్టుని భుజానికి తగిలించాడు. నాలుగడుగులు వేసి, కిందికి పాకిన పైప్ దగ్గరగా ఆగాడు.

క్షణకాలం కింది భాగాన్ని. వెనక భాగంలో వున్న సందునీ పరీక్షగా చూశాడు. సందమ్మట ఎవరూ నడవడం లేదు. రెండువైపుల్నించీ కూడా యెవరూ సందులోకి

ప్రవేశించడం లేదు.

విరూపాక్షరావూ, మేనేజర్ గుర్నాథం — ఇద్దరూ తనని దారుణంగా మోసం చేస్తున్నారు. విరూపాక్షరావు మోసాన్ని తను మోసంతోనే జయించాలి. హోటల్ బిల్లు చెల్లించడానికి అవసరమైన పైకం తన దగ్గరుంది. కానీ తను చెల్లించడు. విశ్వాసఘాతకుడైన విరూపాక్ష రావుకి తను బుద్ధి చెప్పాలి. అందుకే తను ఈ దొడ్డిదారిని ఎన్నుకున్నాడు.

మనోజ్ నవ్వుకుంటూ పిట్టగోడమీదికి ఎక్కాడు. క్షణంలో సూట్‌కేస్‌తో బాటు గొట్టంగుండా క్రిందికి జారసాగేడు.

పాదాలు నేలని తాకాయి. మనోజ్ తటాలున వీపుని గోడకి ఆన్చి, కాసేపు నిలబడ్డాడు. తనని ఎవరూ చూట్టంలేదు! తృప్తికరంగా నిట్టూరుస్తూ, బెల్టుని ఊడదీసి, కోటుజేబులో కుక్కుకుంటూ చకచకా ప్రహరీగోడ వైపు అడుగులేశాడు.

అయిదు నిమిషాల్లో మనోజ్ హోటల్‌కీ తనకీ మధ్య రెండు సందుల్ని వదిలేసి, రోడ్డు చేరుకున్నాడు. స్లోగా వస్తున్న ఆటోరిక్షా డ్రైవర్ అతన్ని సాభిప్రాయంగా చూశాడు.

మనోజ్ ఆటోలోకి దూరాడు. రైల్వేస్టేషన్‌కి వెళ్ళమంటూ వెనక్కి వాలి, సిగరెట్ వెలిగించాడు. ఆటో కదిలింది.

* * *

మూడురోజులు గడిచిపోయాయి.

తన కర్తవ్యం గురించి ఆలోచిస్తూ మనోజ్ ఇరుకు సందులో వున్న అప్సరాలాడ్జి గదిలోనే ఉండిపోయాడు.

ఇవాళే శాస్త్రి బయటకు వెళ్ళి వస్తున్నాడు. విరూపాక్ష రావు నియమించిన వెయ్యికళ్ళు తనకోసం అనుక్షణం చూస్తూవుంటాయి.

గతంలో ఆ రాక్షసుడు చేయించిన హత్యలు మనోజ్ కి గుర్తొచ్చాయి. ఏమాత్రం వార్నింగ్ లేకుండా హఠాత్తుగా తన వీపులో కత్తి దిగేయడానికి, గుండెల్లోకి గురిచూసిన తూటా రువ్వడానికి అతను వెనుదీయడు! తను చాలా జాగ్రత్తగా వ్యవహరించాలి.

మనోజ్ టాక్సీ ఆపి, మీటర్ చెల్లించి దిగేశాడు. సిగరెట్ పీలుస్తూ తన లాడ్జి వేపు అడుగులేశాడు.

అయిదు నిమిషాల్లో గదిలో ప్రవేశించి, తలుపుమూసి, అలసటగా సోఫామీద వాలాడు. స్ట్రాంగ్ కాఫీ పంపమని రూమ్ సర్వీస్ కి ఆర్డరిచ్చి కళ్ళుమూసుకొని, తలని వెనక్కి వాల్చాడు.

తలుపు తట్టిన చప్పుడు. మనోజ్ తటాలున లేచాడు. కదలకుండా అలాగే నిలబడ్డాడు.

కాఫీ ఆర్డరిచ్చి అట్టేసేపు కాలేదు! ఎవరొచ్చారు? బెల్టులోపల దోపుకున్న కత్తిని ఒకసారి తడుముకొని గుమ్మంవైపు అడుగులేశాడు. తలుపుమీద మళ్ళీ చప్పుడైంది. తలుపుకి దూరంగా ఆగాడతను.

మనోజ్ ఊపిరి బిగబట్టాడు. తను జాగ్రత్తగా, చాలా జాగ్రత్తగా వుండాలి. అతని వేళ్ళు డోర్ హాండిల్ చుట్టూ బిగుసుకున్నాయి. ఒక్క ఊపులో హాండిల్ ని తిప్పుతూ బలంగా తలుపుని లాగాడతను. అదేక్షణంలో బెల్టులోంచీ కత్తిని ఇవతలికి లాగిన అతని కుడిచెయ్యి తొడ వెనక దాగింది.

గుమ్మంలో నిలబడ్డ వ్యక్తిని నమ్మలేనట్టు చూస్తూ

ఆశ్చర్యంతో నోరు తెరిచాడు మనోజ్.

"హలో!" ఇందులేఖ కంఠంలో వీణలు పలికాయి.

అప్రయత్నంగా తలుపుని బార్లా తెరిచి, మనోజ్ విగ్రహంలా నిలబడిపోయాడు. చిరునవ్వు ఇందులేఖ ముఖాన్ని, తూర్పు ఆకాశాన్ని సూర్యోదయంలా వెలిగిస్తోంది. ఎర్రటి పెదవుల సందులోంచీ తెల్లటి పళ్ళు దానిమ్మగింజల్లా మెరుస్తున్నాయి. పెదవులమీది నవ్వు ఆమె విశాల నేత్రాల్లోకి పాకిందని అతను గుర్తించాను. ఫ్రేములో ఇంపుగా ఇరుక్కున్న రవివర్మ చిత్రసుందరిలా ఆమె ద్వారబంధంలోంచీ అవుపిస్తోంది.

"హలో....లోపలికి....రండి.." తెప్పరిల్లిన మనోజ్ ఆహ్వానించాడు.

చిత్రసుందరికి జీవం వచ్చింది. ఇందులేఖ గుమ్మం దాటి గదిలోకి అడుగుపెట్టింది. తలుపు మూసి మనోజ్ చకచకా సోఫాముందు నిలబడ్డాడు.

"కూర్చోండి!" అన్నాడు నవ్వుతూ.

ఇందులేఖ కూచుంది. ఎదురుగా కుర్చీలో కూచుని మనోజ్ ఆమెని ఆశ్చర్యంతో చూస్తూండిపోయాడు.

"మిమ్మల్ని ఎలా పట్టుకోగలిగానని ఆశ్చర్యపోతున్నారా?" ఇందులేఖ నవ్వుతూ ప్రశ్నించింది.

మనోజ్ చిన్నగా నిట్టూర్చాడు. "నన్ను యెవరూ ఫాలో కాలేదనుకున్నాను. చాలా జాగ్రత్తగా తిరుగుతూ వచ్చాను....కానీ ఉండాల్సినంత జాగర్తగా లేనని మీ రాక చెప్తోంది!"

ఇందులేఖ నవ్వింది. "మీకోసం నేను వెతుకుతున్నాను. కానీ, ఆ శ్యక్తి లేకపోతే మిమ్మల్ని పట్టుకోగలిగేదాన్ని కాను ..."

మనోజ్ ఆశ్చర్యంగా కళ్ళు పెద్దగా చేశాడు....

"ఆ... వ్యక్తి?"

ఇందులేఖ తలాడించింది. "నాలుగైదురోజులుగా ఒక వ్యక్తి మా ఇంటికి దూరంగా నిలబడి, అతి తెలివిగా ఇంటివేపు చూస్తూన్నాడు. మొదట్లో గుర్తించలేక పోయినా, రెండో రోజు అతన్ని అనుమానించాను. అతను ఎందుకు అక్కడ మాటువేశాడు? ఎవరతను? దొడ్డిదారిగుండా, నాలుగిళ్ళ అవతలున్న నా స్నేహితురాలింటికి వెళ్ళి, దాక్కుని అతను చూడకుండా అతన్ని చూడసాగేను. నా స్నేహితురాలి నూరీ డ్రెస్ తగిలించుకొని, అతన్ని ఫాలో చేశాను. మూడురోజులు అతన్ని తోకలా, దూరంగా అంటిపెట్టుకున్నాక, ఇవాళ ఉదయం అతను నన్నిక్కడికి తీసుకొచ్చాడు.

"ఇందులేఖా..అతను..అతనెలా వున్నాడు?" మనోజ్ అడ్డొస్తూ అడిగాడు.

"సన్నగా పొడుగ్గా వున్నాడు. నెరిసిపోయిన జుట్టు."

మనోజ్ ఆశ్చర్యంతో విన్నాడు. మెల్లిగా చిరునవ్వాడు.

"మిస్టర్ మనోజ్, అతను మీకు తెలుసా?" ఇందులేఖ ప్రశ్నించింది.

నిట్టూరుస్తూ మనోజ్ తలాడించాడు. అతని కళ్ళు రాళ్ళలాగా అయ్యాయి. "తెలుసు...అతను...నా...మన శత్రువు!"

ఇందులేఖ విశాల నేత్రాలు ఇంకా పెద్దగా అయ్యాయి. ఆమె పిడికిళ్ళు బిగుసుకోడం మనోజ్ గమనించాడు. ఇందులేఖ అతన్ని యేదో అడగబోయింది. మనోజ్ తటాలున లేచాడు,

"అతనెక్కడున్నాడు?" అతని కంఠంలో ఆవేశం ఆత్రంగా ధ్వనించింది.

"తెలీదు. పొద్దుటే మీరు వెళ్ళిన టాక్సీని కారులో ఫాలో చేశాడు. చాలా దూరంనుంచీ నేను టాక్సీలో వెంబడించాను. ఎక్స్‌టెన్షన్‌లో వున్న ఏదో ఇంటికి మీరు వెళ్ళారు. అది చూశాక అతను కార్లో తిరిగి వెళ్ళిపోయాడు. నాకు మీరు కావాలి. అంచేత అతన్ని నేను వెంబడించలేదు.." ఇందులేఖ సన్నటి కంఠంతో చెప్పింది.

"అడ్వొకేట్ రంగనాథ్ ఇంటికెళ్ళాను..ఒక వ్యక్తి చేతికి ధరించిన గొలుసు నా చేతికి వచ్చింది. రంగనాథ్ భార్యని గాయపరచిన వ్యక్తి చేతికి గొలుసు ధరించినట్టు ఆమె గుర్తించింది. గొలుసుని ఆమెకి చూపించాను. దాన్ని ఆమె పోల్చింది.." మనోజ్ ఆగాడు. తలుపు మీద వేళ్ళ కణుపులు చప్పుడు చేశాయి.

మనోజ్ ఇందులేఖవైపు ఒకసారి చూసి, గబగబా గుమ్మంవేపు కదిలాడు. అతను వెనకభాగంలో పట్టుకున్న కత్తిని ఆమె ఆశ్చర్యంతో చూసింది.

"ఎవరు?" మనోజ్ బిగ్గరగా అడిగాడు.

"రూమ్ సర్వీస్."

కత్తిని బెల్టులో దోపుకొని మనోజ్ తలుపు తెరిచాడు. హోటల్ బాయ్ కాఫీ ట్రేతో బైట నిలబడ్డాడు. ట్రే అందుకొని మనోజ్ అతన్ని వెళ్ళమన్నాడు.

హోటల్ బాయ్ కదలకుండా నిలబడి మనోజ్‌వైపు అదోలా చూశాడు.

"అరగంట క్రితం మీకోసం ఎవరో వచ్చారు సార్. మీ గదిముందు నిలబడి వుంటే చూశాను. మీరు లేరని

ఆయనకు చెప్పాను. ఆయన తలాడించి వెళ్ళిపోయాడు. మీరెప్పుడొస్తారనికూడా అడగలేదు.."

మనోజ్ నుదురు చిట్లించాడు. "ఆయన ఎట్లా ఉన్నారు?"

"తెల్లని జుట్టు సార్. సన్నగా పొడుగ్గా వున్నారు సార్."

"ఓహ్...ఆయనా? ఓకే....థాంక్యూ!" మనోజ్ ఉద్రేకాన్ని అతిప్రయత్నంలో అణచుకుంటూ అన్నాడు. తలుపు మూసి, గొళ్ళెం పెట్టి గదిలోకి నడిచాడు. సోఫా ముందున్న టీపాయ్‌మీద ట్రేని పెట్టాడు. ఇందులేఖ అతన్ని చిరునవ్వుతో చూస్తోంది.

మనోజ్ మాట్లాడకుండా మంచంవేపు కదిలాడు. ఫోమ్ బెడ్ కిందికి చేతుల్ని పోనిచ్చి తడుముతూ వుండిపోయాడు. బెడ్‌ని పైకెత్తి కంగారుగా మంచంమీదా, బెడ్ అడుగుభాగంలో చూశాడు. బెడ్ కింద వుంచిన రెండు రివాల్వర్లు లేవు! ఫోమ్‌లో తయారుచేసిన కన్నంలో తను జాగ్రత్తగా దాచిన రివాల్వర్ ఆ వ్యక్తి కంటపడనందుకు అతను సంతోషించాడు.

మనోజ్ చేతిలోంచీ బెడ్ కిందికి జారింది. బిగించిన పిడికిళ్ళతో, విగ్రహంలా నిలబడిపోయాడు. తనకి సప్లై చేసిన రివాల్వర్‌లో బాటు, తన రివాల్వర్ని, బాబ్జీ చేతిలోంచీ తను తీసుకున్న రివాల్వర్ని విరూపాక్షరావు శిష్యుడు కాజేశాడు! పళ్ళు కొరుక్కుంటూ మనోజ్ వెనక్కి తిరిగాడు. మెల్లిగా సోఫాముందుకు నడిచాడు.

ఇందులేఖ మొహం ప్రశ్నార్థకంగా మారింది. "మిస్టర్...మనోజ్...ఏం జరిగింది?"

మనోజ్ ఆమెవైపు చిరునవ్వు నవ్వుతూ కుర్చీలో కూచున్నాడు. పాట్ లోని కాఫీని కప్పుల్లో పోశాడు. ఒక కప్పు ఆమెకి అందించాడు.

"ఇందులేఖా, మీకు కనపించిన తెల్లజుట్టు వ్యక్తి రివాల్వర్లని కాజేశాడు! అక్కణ్నుంచీ మన కంటే ముందు తిరిగొచ్చి, కార్యం చక్కబెట్టేసి పారిపోయాడు...." మనోజ్ కోపాన్ని దిగమింగుతూ అన్నాడు.

ఇందులేఖ ఆశ్చర్యంగా, ఆదుర్దాగా చూసింది. "గుడ్ గాడ్!"

మనోజ్ చిన్నగా నవ్వాడు. "డోంట్ వర్రీ. కాఫీ తాగండి!"

ఇందులేఖ కాఫీ తాగేసి, కప్పుని ట్రేలో పెట్టింది. అతన్ని అదోలా చూసింది.

"మిస్టర్ మనోజ్, ఆ వ్యక్తి మా యింటి ముందు ఎందుకు కాపు వేశాడు?"

"వాళ్ళకి కనిపించకుండా నేను మాయమయ్యాను. మీ ఇంటికి వస్తానేమో అన్న ఆశతో అక్కడతను కాచుక్కూచున్నాడనుకోవాలి...." మనోజ్ సాలోచనగా అన్నాడు.

ఇందులేఖ అర్థం కానట్టు చూసింది. మనోజ్ కుర్చీలో వెనక్కి వాలి సిగరెట్ వెలిగించాడు.

"మిస్ ఇందులేఖా, మీ యింటి నుంచీ తిరిగొచ్చాక చాలా కథ నడిచింది....అదంతా వింటే మీకు కొంత వరకూ అర్థమవుతుంది...." మనోజ్ ఆగాడు. ఇందులేఖ కనుబొమలు ఎక్కుపెట్టిన విల్లులా వొంపులు తిరిగాయి.

"ఆ రోజు తెల్లజుట్టు వ్యక్తి, మరొకడూ నన్ను బల

కంఠంగా, విరూపాక్షరావు ఆ స్థానానికి తీసుకెళ్ళారు....” మనోజ్ సిగరెట్ పీలుస్తూ తగ్గుస్వరంలో ప్రారంభించాడు.

అతను చెప్పిందంతా ఇందులేఖ మౌనంగా, చెవులు రిక్కించి వింది. ఆమె మొహంమీద ఆశ్చర్యం ఉలితో చెక్కినట్టు కనిపిస్తోంది.

“అయితే, మీరు ఎవర్ని శిక్షించాలనుకున్నారో ఆ దుర్మార్గుల్నే చేతులారా రక్షించారన్నమాట!” అందామె మెల్లిగా. అతనిపట్ల సానుభూతి ఆమె కంఠంలో ప్రతిధ్వనించింది.

మనోజ్ నిస్సహాయంగా నిట్టూర్చాడు. “దటీజ్ ది ట్రాజెడీ!”

“అతను...ఆ విరూపాక్షరావు చాలా ధైర్యంగా, తెలివిగా వ్యవహరించి, మీరు అన్వేషించేవాళ్ళ దగ్గరికే మిమ్మల్ని పంపించాడు. ఎందుకని?” ఇందులేఖ ప్రశ్నించింది.

“రెండు కారణాలతో అతను ఆ పని చేశాడని నేను ఊహిస్తున్నా. ఒకటి: ఆ విధంగా చేయడంవల్ల జరిగిన అన్యాయానికీ, దారుణాలకీ అతను కారకుడు కాడన్న అభిప్రాయం నాలో కాంక్రీటులా స్థిరపడుతుంది. రెండు: శత్రువుల పిడికిలిలో చిక్కిన తన అనుచరులకి విముక్తి లభిస్తుంది....”

“యూ ఆర్ రైట్!” ఇందులేఖ అంది.

“ఊహించని విధంగా, అతని శిష్యుడు—బాబ్జీ—అతని విరోధుల తూటాకి గురికావడం మూలంగా నిజం నాకు తెలిసింది. ప్రాణాలు వదిలేముందు బాబ్జీ నిజం చెప్పేశాడు.... లేకపోతే నేను గుడ్డిగా విరూపాక్షరావుని

నమ్మి కసాయికొట్టుకి చేరుకొనేవాణ్ని!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

"బాబ్జీ మీకు అసలు సంగతి చెప్పాడని అతనికి ఎలా తెలుసు?" ఇందులేఖ ప్రశ్నించింది.

మనోజ్ చిరునవ్వుతో చూశాడు. "తెలివైన ప్రశ్న అడిగారు. బాబ్జీ గాయపడ్డప్పుడు ముందు పరుగెడుతున్న అతని అనుచరుడు చాటునుంచీ అంతా విన్నాడని నేను యిప్పుడు నిశ్చయంగా చెప్పగలను. అప్పట్లో నాకు అనుమానం రాలేదు. ప్రాణం కోసం అతను కారులో ఉడాయించాడని మాత్రం అనుకొన్నాను. బాబ్జీ తమ రహస్యాన్ని చెప్పేశాక, అతను నా నుంచీ కూడా పారిపోయాడు. తన గురువుకి అంతా విన్నవించుకొన్నాడు. అందుకే విరూపాక్షరావు నా కోసం వేట ప్రారంభిం భించాడు. నేను ప్రాణాల్తో వుంటే అతనికి ప్రమాదం!"

ఇందులేఖ గాభరాగా చూసింది. "ఏం చేస్తారు?"

"అతను మనల్ని వేటాడేలోగా, అతన్ని మనం వేటాడాలి!" మనోజ్ నవ్వుతూ అన్నాడు.

ఇందులేఖ అర్థమైనట్టు తలాడించింది. "అతన్ని మీరు కలుసుకొన్నారుగా? అతనెక్కడుంటాడో మీకు తెలుసు...."

మనోజ్ తల అడ్డంగా ఆడించాడు. "లాభంలేదు. ఆ రోజు వాళ్ళు కళ్ళకి గంతలు కట్టి, కార్లో ఎన్నో మలుపులు తిప్పి, ఎన్నో రోడ్లు కొట్టి ఎక్కడికో తీసుకెళ్ళారు. సిటీ లిమిట్సుకి అవతల అని నాకు అప్పట్లో

అనుమానం కలిగింది. ఆలోచిస్తే అది నిజం కాదని అనిపిస్తోంది...."

"కానీ అతని పేరూ అదీ మీకు తెలుసు...." ఇందురేఖ అడ్డు తగిలింది, ప్రోత్సహిస్తున్నట్టు.

"విరూపాక్షరావుగా అతను తనని నాకు పరిచయం చేసుకొన్నాడు. అది అతని అసలు పేరు అయివుండదు! అయితే హోటల్ విక్రమ్ మేనేజర్ కి అతనితో యేదో సంబంధం వుంది. కానీ నేను అటు వేపు వెళ్ళలేను...." మనోజ్ నిరుత్సాహంగా అన్నాడు.

ఇందురేఖ అతన్ని సానుభూతితో చూసింది. "అయితే యేం చేయాలనుకొంటున్నారు?"

"అన్వేషణ!" మనోజ్ స్పష్టంగా అన్నాడు.

"మీ అన్వేషణని హోటల్ విక్రమ్ తో ప్రారంభించడం మంచిదని నేననుకుంటున్నా...." ఇందురేఖ సాలోచనగా అంది.

మనోజ్ తల అడ్డంగా ఆడించాడు. "హోటల్ మేనేజర్ నన్ను సైకియాట్రిస్టు సంజీవరావుకి అప్పగించేస్తాడు!" అన్నాడు నవ్వుతూ.

ఇందురేక అర్థంకానట్టు చూసింది. క్షణకాలంలో ఆమె కళ్ళల్లో ఏదో మార్పు వచ్చింది.

"సంజీవరావు.... డాక్టర్ సంజీవరావు....ఆయన మీ అన్నగారి కేసులో విట్నెస్ అనుకుంటా...." అందామె ఏదో గుర్తు చేసుకుంటూ.

మనోజ్ ఆమెని మెప్పుగా చూశాడు. రంగనాథ్ నుంచీ తను సంపాదించిన సాక్షుల లిస్టులోని పేర్లని దాదాపు మరిచిపోయాడు! సంజీవరావు వాళ్ళ అడ

మన్నట్టు కోర్టులో అబద్దాలాడాడా? అతనికి వాళ్ళతో ఏదేనా సంబంధం వుందా? సంబంధం లేకపోతే మేనేజర్ సుర్నాధం అప్రయత్నంగా అతని పేరుని యెందుకు ఉచ్చరించాడు? మనోజ్ కళ్ళు మెరిశాయి. అతను ఉద్రేకంతో ఆమెని చూశాడు.

"ఇందులేఖా, థాంక్యూ వెరీమచ్. నేను దాదాపుగా మరిచిపోయిన పేరునీ, వ్యక్తినీ గుర్తు చేశావు. అప్పట్లో అతన్ని నేను కల్సుకోలేదు....ఇప్పుడు అతన్ని కల్సుకోవడం మంచిదనిపిస్తోంది. అతను నాకు దారి చూపిస్తాడు!"

ఇందులేఖ లేచింది.

"మిస్టర్ మనోజ్.... వెళ్ళొస్తాను, జాగ్రత్తగా వుండండి" అందామె.

"థాంక్యూ. పదండి, ఇంటిదగ్గర దిగబెడతాను...." అంటూ మనోజ్ కదిలాడు.

"వొద్దు నే వెళ్ళగలను. వాళ్ళు చూస్తారు" ఇందులేఖ మెల్లిగా అంది.

మనోజ్ ఆగి, ఆమెవైపు నవ్వుతూ చూశాడు. "ఎవరో చూస్తారనీ, ఏదో చేస్తారనీ భయపడినంత కాలం మనం ఏమీ సాధించలేం. కమాన్!"

ఇందులేఖ నవ్వుతూ కదిలింది.

• • •

మనోజ్ మూసిన తలుపు ముందు ఆమె వెనకే నిలబడ్డాడు.

ఇందులేఖ పర్సులోంచి తాళంచెవి తీసి తాళం తెరి

చింది. తలుపు తెరిచి లోపలికి అడుగుపెట్టి అతనివేపు తిరిగి చూసింది.

"వెళ్ళొస్తాను...." మనోజ్ నవ్వుతూ అన్నాడు.

"లోపలికి రండి. టీ తాగి వెళ్దురుగానీ" ఇందులేఖ ఆహ్వానించింది. క్షణకాలం తటపటాయించి అతను గుమ్మం దాటాడు. తలుపు మూసి, గొళ్ళెం పెట్టి ఇందులేఖ అతన్ని దాటి హాల్లోకి నడిచింది.

"కూచోండి. క్షణంలో వస్తా...." అంటూ ఆమె పక్క గదివేపు అడుగులేసింది. మనోజ్ సోఫాలో కూచుని, టీపాయ్ మీదున్న ఆంగ్లపత్రికని అందుకుని తిరగేయడం ప్రారంభించాడు.

"నాయనమ్మా...." గదిలోంచీ ఇందులేఖ కంఠం అతనికి వినిపించింది. ఇందులేఖ తన నాయనమ్మని రెండు మూడుసార్లు పిల్చింది. మనోజ్ ఒకసారి ఆ గదివేపు చూశాడు. ఇందులేఖ మంచంమీద పడుకున్న వృద్ధురాల్ని కదుపుతోంది.

"నాయనమ్మా!" ఇందులేఖ కంఠం కంగారుగా, బిగ్గరగా ధ్వనించింది.

మనోజ్ అదిరిపడి లేచాడు. గదివేపు గబగబా నడిచాడు. గదిలో మంచంమీద, నాయనమ్మ పక్కనే ఇందులేఖ కూచుంది. ఆమె చెయ్యి వృద్ధురాలి చెంపను తడుపుతోంది.

"నాయనమ్మా...." ఇందులేఖ కంఠంలో ఏడుపు ధ్వనిస్తోంది.

మనోజ్ ముసలామె మొహంలోకి పరిశీలనగా చూశాడు.

ముడతలు పడిన మొహంమీద యేదో ప్రశాంతత ప్రత్యక్షమవుతోంది. నిద్రలో అవుపించే ప్రశాంతత కాదది. మనోజ్ వంగి ముసలామె చేతిని పట్టుకున్నాడు. అతని వేళ్ళు ఆమె నాడికోసం వెతుకుతున్నాయి. సన్నటి కర్రలా వున్న ముసలామె చెయ్యి అతని చేతిలోంచీ మంచంమీదికి జారింది. అతని చూపులు ఇందులేఖ వైపు తిరిగాయి. ఆమె ఆందోళనతో అతన్నే చూస్తోంది.

“అయామ్ సారీ....నాయనమ్మ....వెళ్ళిపోయింది..,” అన్నాడతను వణికే కంఠంతో.

ఇందులేఖ కళ్ళల్లోంచీ అశ్రువులు కాలువలుగా పారాయి. తటాలున ఆమె తన నాయనమ్మ శరీరంమీద వాలిపోయింది. వెక్కి వెక్కి యేడుస్తున్న ఆమె వీపు ఎగిరెగిరి పడుతోంది. మనోజ్ ఆమెని దీనంగా నిస్సహాయంగా చూస్తూ వుండిపోయాడు. క్షణాలు గడుస్తున్నాయి. పక్క గదిలో ఫోన్ మోగడం ప్రారంభించింది.

మనోజ్ జోరుగా నడిచాడు. పక్కగదిలో ప్రవేశించి రిసీవర్ని తీసి చెవికి ఆనించాడు.

“యస్....”

“మనోజ్, నీకూ, నీతో చెట్టాపట్టాలేసుకు తిరగాలనుకుంటున్న అన్నారావు కూతురికీ చివరిసారిగా వార్నింగ్ యివ్వాలనుకున్నాం. ముసలామెలా మీ'ద్దరూ వెల్లకిలా పడ్డాక యేడవడానికి యెవరూ వుండరు! ఆ పిల్లకి బుద్ధి చెప్పు. గుల్లలో నత్తలా బతకమను. తోక ముడుకొని నువ్వు వెళ్ళిపో!”

ఏదో బొంగురు కంఠం మనోజ్ చెవిలో కర్కశంగా అంది. అటువేపు రిసీవర్ పడేసిన శబ్దం ఆ మాటలకి ఫుల్ స్టాప్ పెట్టినట్టుంది.

మనోజ్ అలాగే నిలబడిపోయాడు. అతని శరీరం కళతప్పి వణుకుతోంది. రాక్షసులు! పసికందులాంటి ముసలిదాన్ని నిర్దాక్షిణ్యంగా చంపేశారు! రిసీవర్ చుట్టూ అతని వేళ్ళు బిగుసుకున్నాయి. వణుకుతున్న చేత్తో రిసీవర్ని పడేసి మనోజ్ బరువుగా, వేడిగా నిట్టూర్చాడు. గోళ్ళతో రక్కి, కెలికి ఆ నరరూపరాక్షసుల గుండెల్ని ఇవతలికి లాగిపారేయాలనిపిస్తోందతనికి.

ఆగ్రహాన్ని, ఆవేశాన్ని దిగమింగుతూ అతను ఇవతలికి నడిచాడు.

గదిలో ప్రాణంలేని తన నాయనమ్మ శరీరంమీద పడి యింకా ఏడుస్తూనే వుంది. మనోజ్ దిక్కుతోచని వాడిలా ఆమెనే చూస్తూ నిలబడ్డాడు. ఒక అమాయకపు రాలు దీనంగా యేడుస్తోంది. ఆమె యేడవడానికి ఒక విధంగా కారకుడతనే. ఆమె అసహాయత అతని హృదయాన్ని జాలితో నింపుతోంది.

"ఇందులేఖా..." అతని కంఠం వణికింది. ఇందులేఖ తల ఎత్తలేదు. అతన్ని చూడలేదు.

అప్రయత్నంగా మనోజ్ ఆమె వీపుమీద చెయ్యి వేశాడు.

"ఇందూ...." అతని కంఠం బొంగురుపోయింది.

ఇందులేఖ తటాలున తలెత్తి చూసింది. కన్నీళ్ళతో ఆమె మొహం పూర్తిగా తడిసింది. కళ్ళు ఎర్రబడ్డాయి. మెల్లిగా లేచి, నిలబడి రెండు అరచేతుల్లో బుగ్గల్ని

తుడుచుకుందామె. చెమటతో తడిసి, ఎర్రటి కళ్ళతో వున్న అతని మొహంలోకి బలహీనంగా చూసింది.

"ఇందూ....అయామ్ సారీ...." మనోజ్ కంఠం వణికింది.

"ఫోన్........ఎవరు?" ఇందురేఖ కంఠం తీరగా వుంది.

మనోజ్ నుదుర్ని అరచేత్తో తుడుచుకున్నాడు. నాలుకతో ఆరిపోయిన పెదవుల్ని తుడుచుకున్నాడు. నిజం చెప్పి ఆమెని కంగారు పెట్టడానికి అతనికి మనస్కరించడంలేదు. కానీ దయనీయంగా తన మొహంలోకి, కళ్ళల్లోకి చూస్తున్న ఆమె అమాయక నేత్రాలని చూస్తూ నిజాన్ని అబద్ధంతో కప్పిపుచ్చడం అన్యాయంగా, అసాధ్యంగా అనిపిస్తోందతనికి.

వణుకుతున్న తన ఎడమచేతిని ఆమె భుజమ్మీద వేశాడతను.

"....వాళ్ళే...." మనోజ్ అతికష్టంమీద అన్నాడు.

ఇందురేఖ కళ్ళు వెడల్పుగా అయ్యాయి. అయోమయంగా చూసిందామె.

"ఇందూ....మనిద్దర్ని హెచ్చరించడానికి...ఆ దుర్మార్గులు....బామ్మని....బామ్మని...." మనోజ్ వాక్యాన్ని పూర్తిచేయలేకపోయాడు.

ఇందురేఖ మొహంలోకి రక్తం పూర్తిగా క్షణంలో ఇంకిపోయింది. పెదవులు అదరసాగేయి. రెండుచేతుల్తో కణతల్ని గట్టిగా నొక్కుకుందామె. విపరీతమైన భయం ఆమె కళ్ళల్లో కొట్టొచ్చినట్టు ప్రత్యక్షమవుతోంది. మెల్లిగా ఆమె కనురెప్పలు మూతలుపడ్డాయి. వశం తప్పి

నట్లు ఆమె శరీరం ఊగింది.

తూలిపడబోతున్న ఇందులేఖ భుజాలచుట్టూ రెండు చేతుల్నీ వేసి, అసంకల్పితంగా దగ్గరగా లాక్కున్నాడు మనోజ్. ఆమె తలని తన భుజమ్మీదకి చేర్చుకున్నాడు.

మనోజ్ ఎర్రటి కళ్ళు శూన్యంలోకి చూస్తున్నట్టు రెప్పపాటు మరిచిపోయి అలాగే వుండిపోయాడు. అతని హృదయంలో కసి, ద్వేషం, పగ, ప్రతీకారం మంటలా మండుతున్నాయి. భయంకరమైన ఆ మంట అతని కళ్ళల్లో ఎర్రగా ప్రతిఫలిస్తోంది.

అచేతనంగా మంచంమీద పడున్న వృద్ధవనితలా వాళ్ళిద్దరూ, అచేతనంగా చాలాసేపు నిలబడిపోయారు. ముందుగా ఇందులేఖ తెప్పరిల్లింది. అతని చేతుల్నించి విడిపించుకుని, కొంచెం దూరంగా జరిగింది.

"ఇందూ, బామ్మను ఇంట్లో వదిలి బైటతాళం వేసి వచ్చావా?" అప్రయత్నంగా తన నోట్లోంచీ దొర్లిన ఏకవచనాన్ని అతను గమనించలేదు.

"నాయనమ్మ ఎక్కడికీ కదలదు. బైటికి వెళ్ళినప్పుడల్లా తాళం వేసుకు వెళ్ళమనేది...." ఉబుకుతున్న కన్నీటిని ఆపుకుంటూ అందామె.

మనోజ్ తలపంకించాడు. చేతి వెనక భాగంలో నుదుర్ని తుడుచుకున్నాడు.

"బాబాయికి ఫోన్ చేయండి....67131" ఇందులేఖ మళ్ళీ అంది. "బాబాయి పేరు చిన్నారావు."

మనోజ్ టెలిఫోన్ వున్న గదిలోకి నడిచాడు.

చల్లటి గాలి వీస్తోంది. నీరెండలో పార్కులోని చెట్ల ఆకులూ, గడ్డి మెరుస్తున్నాయి. గాలికి కదులుతున్న ముంగురుల్ని ఇందురేఖ పైకి తోసుకుంది. ఆమె మొహంలో మునుపటి ఉల్లాసం, ఉత్సాహం లేవు. మనోజ్ ఆమెని పరీక్షగా చూశాడు.

"ఇందూ...."

ఆమె రెప్పలెత్తి ప్రశ్నార్థకంగా చూసింది.

"నువ్వు ఒంటరిగా వుండటం క్షేమంకాదు."

"క్షేమం కాకపోయినా ఒంటరిగానే బతకాలి!"

ఇందురేఖ చిన్నగా నవ్వింది. అది రాణించని నవ్వు.

"మీ బాబాయిగారింట్లో వుండటం మంచిది" మనోజ్ సలహా యిచ్చాడు.

ఇందురేఖ తల అడ్డంగా ఊగింది. రింగులు ఆమె చెంపలకి బంగారు మలాము పూశాయి. "లాభంలేదు. పిన్నికీ మాకూ మొదట్నుంచీ చుక్కెదురే. అందుకే నాయనమ్మ నాతోనే వుండిపోయింది. బాబాయి మంచివాడే. కానీ ఆయన మంచితనం పిన్నిముందు ఓడిపోతూనే వుంటుంది!"

మనోజ్ నిట్టూర్చాడు. ఇందురేఖ అతన్ని చూసింది. అతను పచ్చికను చూస్తున్నాడు.

"మనోజ్...." ఆమె మెల్లిగా పిల్చింది. ఆమెకి సంభవించిన కష్టం వాళ్ళిద్దర్నీ సహజంగా దగ్గర చేసింది. ఒకరొకరు బహువచనంలో గౌరవించుకోడం నాయనమ్మ మరణించిన రోజే మానేశారు. ఏకవచనం ఇద్దరి మధ్యా స్నేహాన్ని పటిష్టం చేసింది.

మనోజ్ ఆమె వైపు చూశాడు.

"పదిహేనురోజులుగా నీ కార్యక్రమాన్ని పూర్తిగా మరిచిపోయావ్!" అందామె నవ్వుతూ.

మనోజ్ మళ్ళీ నిట్టూర్చాడు. "ఏం చేయాలో తోచడంలేదు."

"మనోజ్!" ఇందులేఖ కంఠంలో ఆశ్చర్యం.

"వెతికిపట్టి, ఆ దుర్మార్గుల్ని పిచ్చికుక్కల్ని చంపినట్టు చంపగలను! కానీ నాకు కావాల్సింది ప్రతీకారం తీరడం మాత్రమే కాదు. అన్నయ్య నిరపరాధి అని నిరూపించబడాలి. ఆయన ఆ నరకంలోంచి బైటపడాలి!" మనోజ్ ఉద్రేకంతో అన్నాడు.

"నిరూపించు!" ఇందులేఖ నవ్వుతూ అంది.

మనోజ్ ఆమె కళ్ళల్లోకి చూశాడు. "ఇందూ మనం నిరూపించే నిజాన్ని చూడ్డానికీ, వినిపించే సత్యాన్ని అంగీకరించడానికి చట్టం మనతో సహకరించాలి! జరిగిందంతా చూస్తోంటే చట్టం సహకరిస్తుందన్న నమ్మకం నాకు లేదు!" అన్నాడు విరక్తిగా.

ఇందులేఖ ఆశ్చర్యంగా చూసింది.

"ఇందూ, ఇవాళ్టి పేపరు చూశావా?" మనోజ్ ప్రశ్నించాడు.

"లేదు. ఏం?"

"పదిహేను రోజుల క్రితం మరణించిన బాబ్జీ శవం వారంరోజుల క్రితం పోలీసువాళ్ళకి కనిపించింది. అతని ఛాతీమీదున్న పచ్చబొట్టూ, అతని శవాన్ని పోల్చడంలో పోలీసులకి ఉపయోగించాయి. బాబ్జీకి పెద్ద రికార్డుంది. అతనిమీద రెండు మర్డర్ కేసులున్నాయి. అతన్ని

పాత పగతో మనోజ్ అనే యువకుడు హత్య చేసినట్టు పోలీసులకి ఇన్ఫర్మేషన్ అందింది. నిన్నటుంచీ మనోజ్ కోసం పోలీసులు వెతుకుతున్నారు...."

"గుడ్ గాడ్!" ఇందులేఖ గాబరాగా అరిచింది.

"నేనున్న హోటల్ గదిని పోలీసులు ఇవాళ ఉదయం సోదా చేశారు. ఇప్పుడో, అప్పుడో వాళ్ళు నా కోసం నీ యింటికి వస్తారు!" మనోజ్ చిన్నగా నవ్వాడు.

"మనోజ్!"

"పోలీసుల నుంచీ తప్పించుకు తిరుగుతూ అనుకున్న దాన్ని నేను సాధించడం అంత సులభం కాదు. వాళ్ళ యెదుట పడి నిజం చెప్పి నమ్మించడం అంత సులభం కాదు!"

ఇందులేఖ కాసేపు మౌనంగా కూచుంది. ఉన్నట్టుండి ఆమె కళ్ళు మెరిశాయి.

"మనోజ్, కమాన్!" అంటూ ఆమె తటాలున లేచి నిలబడింది.

"ఎక్కడికి?" మనోజ్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఒక వ్యక్తిదగ్గర కెళ్దాం. ఆయనకూతురు నాతో కాలేజీలో చదువుకుంది. ఆయన మనకి సాయం చేయొచ్చు...." ఇందులేఖ సాలోచనగా అంది.

• • •

చిన్న గేటు తోసుకుంటూ ఇందులేఖ తోటలోకి ప్రవేశించింది. మనోజ్ ఆమెని మౌనంగా వెంబడించాడు. తోటలో రకరకాల పూల మొక్కలున్నాయి. తోట మధ్యలో రెండంతస్థుల ఇల్లు అందంగా వుంది.

పోర్టికో ముందు ఆగి ఇందులేఖ అటూ యిటూ చూసింది. వడివైపున పూలమొక్కల మధ్య వొంగి నుంచున్న వ్యక్తివేపు గబగబా అడుగు వేసింది. మనోజ్ ఆమె వెనకాలే కదిలాడు.

ముందుకి వంగి, గులాబీ మొక్కలి పరిశీలిస్తున్న వ్యక్తి వెనుక ఇందులేఖ ఆగింది.

"అంకుల్...."

ఆ వ్యక్తి తటాలున లేచి, వెనుదిరిగాడు. పల్చటి తెల్లటి జుట్టు. ఆరోగ్యంగా మెరుస్తున్న మొహం. నీలం రంగు పాంటులోకి టక్ చేసిన ఫుల్ నెక్ బనియన్ లోంచీ కండరాలు బలిష్టంగా అవుపిస్తున్నాయి. పళ్ళ మధ్య యిరుక్కున్న బ్రయర్ పైప్. మనోజ్ అతన్నే చూస్తోన్నాడు.

"హై యంగ్ లేడీ! హౌ డూ యూ డూ" అరిచాడతను హుషారుగా.

"నెవర్ బెటర్, అంకుల్!" ఇందులేఖ నవ్వింది.

"నైస్! రంజన ఢిల్లీ వెళ్ళింది. నీకు చెప్పకుండా ఉడాయించిందా?" నవ్వుతూ అడిగా డతను.

"రంజన నాతో చెప్పకుండా ఎక్కడికీ వెళ్ళదుగా! మీతో పనుండి వచ్చాను, అంకుల్!"

"వ్హాట్!" అన్నాడతను నవ్వుతూ.

"ఇక్కడకాదు; అక్కడ!" ఇందులేఖ నవ్వుతూ మేడపైకి చెయ్యి చూపించింది. "అంకుల్, అయాం సారీ.... దిసీజ్ మై ఫ్రెండ్ మనోజ్ ....మనోజ్ దిసీజ్ అంకుల్ జయసింహా, రిటైర్డు మేజర్, ఇండియన్ ఆర్మీ!"

మనోజ్ అప్రయత్నంగా ఆటెన్షన్‌లో నిలబడి శెల్యూట్ చేశాడు. జయసింహా ఆశ్చర్యంతో కళ్ళెగ రేస్తూ మనోజ్ వైపు చెయ్యి చాచాడు. మనోజ్ చేతిని ముందుకు చాచాడు.

"గ్లాడ్ టూ సీ యూ యంగ్ మాన్! ఆర్ యూ ఇన్ ది ఆర్మీ?" జయసింహా ప్రశ్నించాడు.

"యస్సర్!"

"వెరీగుడ్. భారత రక్షకదళం ఎలా వుంది?" జయసింహా నవ్వుతూ అడిగాడు.

"ఆత్మస్థైర్యంతో వుంది సర్!"

జయసింహా పకపక నవ్వాడు. మనోజ్ అతన్ని రెప్ప వేయకుండా చూశాడు.

"అయామ్ సారీ సర్ .... మిమ్మల్ని పోల్చుకోలేక పోయాను...."

"ఇట్సాల్ రైట్. రిటైరయి తొమ్మిదేళ్ళయింది. నాతో పనిచేసిన వాళ్ళే నన్ను పోల్చలేనంతగా వయసు నన్ను మార్చేసింది!"

"అంకుల్ ...." ఇందురేఖ మెల్లిగా అంది.

"యస్ ....ఓ.హో .లెటస్‌గో..కమాన్!" అంటూ జయసింహా ఇంటివేపు దారితీశాడు.

టీ తాగేసి, కప్పుని కింద పెట్టి ఇందురేఖ జయసింహాని చూసింది. జయసింహా మనోజ్‌ని ఆర్మీకి సంబంధించిన, తనకి అర్థంకాని ప్రశ్నల్తో ముంచెత్తేస్తున్నాడు.

"అంకుల్.."

మనోజ్‌ని మరేదో అడగబోతున్న జయసింహా ఆమె వైపు తిరిగాడు.

"సారీ యంగ్ లేడీ! చెప్పు!" అన్నాడు నవ్వుతూ.

"అంకుల్..నాన్న ప్రమాదంలో మరణించాడని అంతా అనుకున్నాం. కానీ అది రోడ్డు ప్రమాదం కాదు."

"వాట్?" జయసింహా అరిచాడు.

"మనోజ్ అన్నగారు నిష్కారణంగా మర్డర్ కేసులో ఇరికించబడ్డారు. ఆయన్ని డిఫెండ్ చేయాలనుకున్నాడు నాన్న. ఆ మర్నాడే నాన్న కార్ని ఏదో ట్రక్కు గుద్దేసింది. అడ్వొకేట్ కరుణాకర్ కేస్ గురించి మీరు చదివే వుంటారు.." ఇందురేఖ ఆగింది.

"చదివాను."

"ఆ కరుణాకర్ తమ్ముడే మనోజ్."

"ఐసీ..." జయసింహా తలాడిస్తూ అన్నాడు.

"అంకుల్, నాయనమ్మ ఈ మధ్యే పోయింది."

"అయామ్ సారీ...నాకెందుకు చెప్పలేదు?" జయసింహా నొచ్చుకుంటూ అన్నాడు.

"ఇబ్బంది పెట్టడం దేనికని చెప్పలేదు. అంకుల్, కరుణాకర్ గారికి సహాయం చేయాలనుకున్నందువల్ల నాన్న మరణించాడు. ఆయన తమ్ముడితో స్నేహం చేసి, అతనికి సహాయం చేయాలని నేను అనుకోవడంవల్ల నాయనమ్మ చనిపోయింది. వాళ్ళు ఆ విధంగా నాకూ, మనోజ్‌కీ వార్నింగ్ ఇచ్చారు!"

జయసింహా నమ్మలేనట్టు చూశాడు. "వాళ్ళు..ఇందూ, 'వాళ్ళు' ఎవరు?"

"అంకుల్, మనోజ్ కథంతా వివరంగా చెప్తాను. మీనుంచీ అతనికో సహాయం కావాలి. అది కూడా

చెప్తాను. మనోజ్‌ని నేను హృదయపూర్వకంగా నమ్ముతున్నాను. మీరు నన్నమ్మొచ్చు దయచేసి అంతా వినండి. ఈలోగా ఆంటీతో మాట్లాడివస్తాను" అంటూ ఇందులేఖ నిలబడింది. చెప్పమన్నట్టు మనోజ్ వైపు ఓసారి చూసి గదిలోంచి మెట్లవైపు నడిచింది.

మనోజ్ ప్రారంభించాడు. పైప్ పీలుస్తూ జయసింహ ఏకాగ్రతతో వినసాగేడు.

"ఇన్‌క్రెడిబుల్! హారిబుల్!" అంతా విన్నాక జయసింహ అరిచాడు.

ఆరిపోయిన పైప్ వెలిగించి, కళ్ళు చిట్లిస్తూ మనోజ్‌నీ అతనికి కొంచెం దూరంలో అదే సోఫామీద కూచున్న ఇందులేఖనీ మార్చి మార్చి చూశాడు. అతని నుదురుమీద నాగేటిచాళ్ళలా గీతలు పడ్డాయి.

"మనోజ్, నువ్వు చెప్పిందంతా నమ్మలేకుండా వున్నాను!" జయసింహ మళ్ళీ తనే అన్నాడు.

"నమ్మలేనంతటి యథార్థం అంకుల్, అది!" ఇందులేఖ కల్పించుకుని అంది. జయసింహ తల ముందుకీ వెనక్కీ ఆడింది.

"అమెరికన్ క్రైమ్ రిపోర్టు చదివినట్టుంది. ఇదంతా వింటూంటే ఇండియాకి శత్రువులు ఇంటిలోనే వున్నారనిపిస్తోంది!"

"చక్కగా చెప్పారు సార్!" మనోజ్ ఉద్రేకంతో అన్నాడు.

"ఇందూ, నా సహాయం కావాలన్నావ్. ఏమిటది?" జయసింహ ప్రశ్నించాడు.

"మనోజ్ నిజాన్ని నిరూపించే ప్రయత్నంలో వున్నాడు. అతనికి పోలీస్ డిపార్టుమెంట్ సహకారం కావాలి" అంది ఇందురేఖ.

"ఇందూ, నన్నేం చేయమంటావ్?"

"మనోజ్ మీదికి పోలీసులు ఎగబడకుండా చూడండి. యథార్థాన్ని వెలికితీయడంలో అతనికి సహాయపడేలా చూడండి. ఐ జీ.గారు మీకు చాలా సన్నిహితుడని నాకు తెలుసు. అందుకే మనోజ్‌ని తీసుకువచ్చాను.." ఇందురేఖ గబగబా అంది.

జయసింహ తలని ఆడించాడు. "యూ విల్ బీ ఆస్కింగ్ ఫర్ టూ మచ్...మనోజ్ హత్య చేయలేదని నేను వాళ్ళకి గ్యారంటీ ఇవ్వాల్సివుంటుంది..."

ఇందురేఖ అతన్ని నవ్వుతూ చూసింది. "అంకుల్, నా గురించి మీకు తెలుసు. మనోజ్ నిరపరాధి అని నేను మీకు గ్యారంటీ ఇస్తున్నాను. హత్యలు చేసిన వ్యక్తిని నేను పెళ్లాడాలనుకుంటానా అంకుల్?"

మనోజ్ ఉలిక్కిపడి, తలతిప్పి ఆశ్చర్యంగా ఇందురేఖవైపు చూశాడు. ఆమె తనవైపు చూడ్డంలేదు....

జయసింహ క్షణకాలం ఇందురేఖని తదేకంగా చూశాడు. అతని పెదవులు నవ్వుతో విచ్చుకున్నాయి. "వెరీగుడ్! వెరీగుడ్! చెప్పలేం? బెస్టాఫ్ లక్!" అంటూ లేచి నిలబడ్డాడు. గదిలోంచీ కదలబోతూ మనోజ్ వైపు చూశాడు.

"మనోజ్ ...."

మనోజ్ ఇందురేఖమీంచీ చూపుల్ని జయసింహ వైపు తిప్పాడు.

"యంగ్ మాన్, యూ ఆర్ లక్కీ! ఇందూ తెలివైన పిల్ల. బీ హాపీ అండ్ కీప్ హర్ హాపీ!" జయసింహ ఉత్సాహంగా అన్నాడు. మనోజ్ మాటలు మరచిపోయిన వాడిలా అతన్ని చూశాడు.

"మీరిక్కడే కూచోండి. అయిదునిమిషాల్లో వస్తా" అంటూ జయసింహ గదిలోంచీ ఇవతలికి నడిచాడు.

మనోజ్ ఇందురేఖవైపు తిరిగాడు. ఆమె అతనివైపు చూడ్డంలేదు. పెదవుల చివర్లలో చిరునవ్వు తొంగి చూస్తోంది. కావాలనే ఆమె తనవైపు చూడ్డంలేదని మనోజ్ గ్రహించాడు.

"ఇందూ...." అతని కంఠం వణికింది.

ఇందురేఖ తలతిప్పి ఏమిటన్నట్టు చూసింది. చిరునవ్వుని దాచుకోడానికి ప్రయత్నిస్తోందామె.

"ఇందూ....నువ్వన్నది నిజమా?" మనోజ్ తడబడుతూ ప్రశ్నించాడు.

"ఏమిటన్నాను?" ఇందురేఖ అమాయకంగా అడిగింది.

"....అదే.... పెళ్ళి...."

"యంగ్ మాన్, ఇందూ అబద్ధాలాడదు!" ఇందురేఖ కిలకిల నవ్వింది.

మనోజ్ ఆవేశంతో ఆమె దగ్గరగా జరగబోయాడు. ఇందురేఖ చెయ్యెత్తి వారించింది.

"అప్పుడే బోర్డర్ దాటే ప్రయత్నం చేయొద్దు. మేజర్ గారు వస్తున్నారు. తోటంతా రాండ్లు కొట్టిస్తారు!" అంది మళ్ళీ నవ్వుతూ. ఆమెతో శృతి కలపబోయి, అప్పుడే గదిలోకి వస్తున్న జయసింహను చూసి

మాశాడు.

జయసింహ సోఫాలో కూచుని ఇద్దరివైపూ గంభీరంగా చూశాడు.

"పరిస్థితి ఆయనకి వివరించాను. నామాటని ఆయన నమ్ముతున్నారు. మనోజ్, ఈ క్షణంనుంచీ పోలీసులు నీకోసం వేటాడరు. పొద్దుటే నువ్వు క్రైమ్‌బ్రాంచ్ చీఫ్ ఆత్మారామ్‌ని కల్సుకో. నీకు తెలిసిందంతా—నాకు చెప్పిందంతా—అతనికి వినిపించు. అతను నీకు సహకారాన్ని అందిస్తాడు. అనుకున్నది సాధించు. తరవాత కనిపించు...."

"థాంక్యూ వెరీమచ్ సర్, మీ మేలు...." మనోజ్ ప్రారంభించాడు.

"ఫర్గెటిట్. నీ నిజాయితీని ఇందూ సర్టిఫై చేసింది. ఆమెకి ధన్యవాదాలు చెప్పుకో!" జయసింహ నవ్వుతూ అన్నాడు

మనోజ్ మెల్లిగా లేచాడు. ఇందులేఖవైపు వొకసారి చూసి జయసింహవైపు చూపుల్ని తిప్పాడు.

"సార్ ....ఇందూ ఆ ఇంట్లో వొంటరిగా వుంటానంటోంది....కొంతకాలం తన బాబాయి గారింట్లో వుండమని మీరు ఆమెకి...."

జయసింహ అరచెయ్యెత్తి అతన్ని వారించాడు. నవ్వుతూ మనోజ్‌వైపు చూశాడు. "మనోజ్ ఎవరి ఇంట్లోనో వుండమని ఆమెకి చెప్పే అధికారం నాకులేదు. ఈ క్షణంనుంచీ ఇందూ నా ఇంట్లో వుంటుంది. షీ విల్ బీ సేఫ్ హియర్! నాన్నా, నాయనమ్మా ఇద్దరూ వెళ్ళిపోయాక ఆమె అక్కడ వుండటం మంచిదికాదు...."

"అంకుల్ ...."

"డోంట్ అబ్జెక్ట్! ఎలాగా ఎల్లుండి రంజన తిరిగొస్తోంది. ఇక్కడే హాయిగా వుండు" జయసింహ ఉషారుగా అన్నాడు.

"సార్ .... థాంక్స్ ఎ లాట్ .... వెళ్ళొస్తాను ...." మనోజ్ కంఠంలో సంతోషం ధ్వనిస్తోంది.

జయసింహ అతనివైపు చూడలేదు. "ఇందూ, కిందికెళ్ళు. ఆంటీకి చెప్పు ఈ పూట మనోజ్ కూడా మనతో బాటే భోంచేస్తాడు" అన్నాడు పైప్‌ని నోట్లో పెట్టుకుంటూ.

ఇందురేఖ ఉషారుగా కిందికి పరుగెట్టింది.

*　　　*　　　*

ప్రైవేట్ టాక్సీ ఆగింది. ఇంజన్ ఆఫ్ చేయబడింది. డోర్ తోసుకుని మనోజ్ కిందికి దిగాడు.

గేటు తోసుకుని, కాంపౌండు మధ్యలో వున్న భవనంవైపు చకచకా నడిచాడు.

క్షీణచంద్రుడు మసక వెలుతురుతో పరిసరాల్ని వెలిగించడానికి వ్యర్థప్రయత్నం చేస్తున్నాడు. పోర్టికోలో వున్న కార్ని చుట్టుకుంటూ మనోజ్ వరండా మెట్లెక్కి తలుపు ముందు నించున్నాడు. భుజానికి వేళ్ళాడుతున్న బాగ్‌ని సర్దుకుంటూ కాలింగ్ బెల్ బటన్ మీద చూపుడు వేలిని నొక్కి పెట్టాడు. లోపలెక్కడో బెల్ మోగుతోంది....

రెండు నిమిషాలు గడిచాయి. హాల్లో లైట్లు వెలిగినట్లు మనోజ్ గుర్తించాడు. అడుగుల చప్పుడు మూసిన తలుపు వెనకనుంచీ మెత్తగా ధ్వనించింది. తలుపు తెరవబడలేదు. కిటికీ రెక్క తెరిచిన శబ్దం వినిపించింది మనోజ్‌కి.

"ఎవరది?" బొంగురు కంఠం విసుగ్గా అడిగింది.

"ఎమర్జెన్సీ. విరూపాక్షరావుగారు పంపించారు. తొందరగా తలుపు తెరవండి!" మనోజ్ తలుపు ముందు నుంచీ కదలకుండా అన్నాడు.

కాసేపట్లో తలుపు తెరుచుకుంది. వరండాలో లైటు వెలిగింది.

"వాటీజ్ దిస్? టైమెంతయిందో తెలుసా?" నైట్ డ్రెస్‌లో వున్న వ్యక్తి గద్దించాడు.

"లెటస్ గెట్ ఇన్, డాక్టర్!" అంటూ మనోజ్ గడప ముందుకి జరిగాడు.

"ఎవర్నువ్వు?" అపరిచితుడైన మనోజ్‌ని అనుమానంగా చూస్తూ అన్నాడు డాక్టర్ సంజీవరావు.

మనోజ్ మాట్లాడకుండా అతన్ని భుజంతో తోసుకుంటూ చొరవగా లోపలికి జొరబడ్డాడు. తూలిపడబోయిన డాక్టర్ సంజీవరావు నిలదొక్కుకుని నిప్పులు కక్కుతూ చూశాడు.

"గెటౌట్!"

మనోజ్ చెయ్యి చటుక్కున జేబులోంచీ ఇవతలికి వచ్చింది. మెరుపులా కదుల్తూ డాక్టర్ పొట్టవైపు దూసుకెళ్ళింది. అప్రయత్నంగా మూలిగాడు.

మనోజ్ అతని కళ్ళల్లోకి నవ్వుతూ చూశాడు. అతని ఎడమచెయ్యి తలుపుని మూసేసింది.

పొట్టలోకి గుచ్చుతున్న రివాల్వర్‌ని డాక్టర్ సంజీవరావు కంగారుగా చూశాడు. అతని కళ్ళల్లోని ఆగ్రహాన్ని భయం తరిమేసింది. గుటకలు మింగాడతను.

అతని కళ్ళల్లోకే నిర్లక్ష్యంగా చూస్తూ మనోజ్

సేఫ్టీ కాచ్ ని రిలీజ్ చేశాడు. డాక్టర్ ఉలిక్కిపడ్డాడు.

"డాక్టర్, రివాల్వర్ కొస నీ కిడ్నీని గుచ్చుతోంది. తిక్క వేషాలేస్తే ట్రిగ్గర్ని కౌగిలించుకున్న నా వేలు కదులుతుంది!"

"నీకు....నీకు..ఏం కావాలి?" డాక్టర్ సంజీవరావు కంఠం వణికింది. చెమటతో తడుస్తున్న అతని మొహం లోకి మనోజ్ నవ్వుతూ చూశాడు.

"నీ కన్సల్టింగ్ రూమ్‌లోకి పద, డాక్టర్!" అన్నాడు మనోజ్. రివాల్వర్ కొస డాక్టర్ని ముల్లు కర్రలా గుచ్చింది. "చేతులు ఆకాశంలోకి ఎత్తు!"

సంజీవరావు చేతుల్ని పైకెత్తేశాడు. మనోజ్ ఎడమ చేత్తో భుజం పట్టుకుని విసురుగా అతన్ని వెనక్కి తిప్పాడు. అదే క్షణంలో రివాల్వర్ డాక్టర్ డొక్కలోకి జరిగింది.

డాక్టర్ సంజీవరావు హిప్నటైజ్ చేయబడినవాడిలా కన్సల్టింగ్ రూమ్‌లోకి నడిచాడు. తలుపుని తోయడానికి ఉపయోగించిన చేతిని వెంటనే పైకెత్తేశాడు. మనోజ్ తలుపు పక్కనే వున్న స్విచ్చి నొక్కాడు.

మనోజ్ ఒక్క చూపుతో గదినంతటినీ అంచనా వేశాడు. అతని చెయ్యి డాక్టర్ని మరి కొంచెం ముందుకి తోసింది. మందులూ, సిరెంజిలూ పెట్టిన టేబుల్ దగ్గరగా డాక్టర్ని ఆపాడతను.

"చేతులు అలాగే వుంచి నా వైపు తిరుగు!" మనోజ్ ఆజ్ఞాపించాడు.

సంజీవరావు వెనక్కి తిరిగి చెమటలు కక్కుతూ, గుటకలు మింగుతూ చూశాడు. అతని కళ్ళల్లో భయం,

ఆశ్చర్యం పాముల్లా పెనవేసుకున్నాయి.

మనోజ్ డాక్టర్ని తీక్షణంగా చూశాడు.

"డాక్టర్, ఈ క్షణంనుంచీ రెండుసార్లు ఏదీ నేను చెప్పను. నీనుంచీ ఇమీడియేట్ రెస్పాన్స్ లేకపోతే, తూటా నీ గుండెలో దొల్చుకుపోతుంది. అర్థమైందా?" మనోజ్ కంఠం నిర్దాక్షిణ్యంగా ధ్వనించింది. డా॥ సంజీవ రావు గుడ్లు మిటకరించాడు. "మి... స్ట ....ర్ నువ్వు.... ఎ....వ... రు....? నీకు ఏం కావాలి?"

"డాక్టర్, అడ్వొకేట్ కరుణాకర్ని ఉరికంబం ఎక్కించడానికి నువ్వు కొన్ని మెట్లు నిర్మించావు. ఎందుకు?" మనోజ్ ప్రశ్నించాడు. అతని ఎడమచెయ్యి సంచీలోకి వెళ్ళి, ఇవతలికి వచ్చింది. సంచీ స్ట్రాప్ని కొంచెం సర్దుకున్నాడతడు.

డాక్టర్ కళ్ళు కొత్త భయంతో నిండాయి. నాలుక కొన అతని పెదాల్ని తడివింది. మనోజ్ కుడిచేతిలోని రివాల్వర్ బిగుసుకుంటోంది.

"....చెప్తాను!" డా॥ సంజీవరావు బొంగురుగా అన్నాడు.

మనోజ్ మాట్లాడకుండా చూశాడు.

"అది....అది... నా డ్యూటీ...." డా॥ సంజీవరావు మెల్లిగా అన్నాడు.

మనోజ్ చిరునవ్వు నవ్వాడు. "డాక్టర్, నిజం చెప్పావ్!! ఆల్ రైట్..కరుణాకర్; గీతను శారీరకంగా అనుభవించాడనీ, అతనికి వీర్యస్ఖలనం జరిగిందనీ కోర్టులో తప్పుడు వాఙ్మూలం ఇచ్చావు. ఎందుకు?"

డా॥ సంజీవరావు కళ్ళలో భయం విశ్వరూపం ధరిం

చింది. బట్టతలమీంచీ చెమట కాలువలుగా సాగింది.

“నేను.... నేను....నిజమే చెప్పాను....”

“నువ్వు అబద్ధం చెప్తున్నావ్! కోర్టులో వచ్చి అబద్ధం చెప్పావు. కరుణాకర్ ఆ సమయంలో లైంగిక సంపర్కం పొందలేదు! ఆ సంగతి నీక్కూడా తెలుసు. నిజం చెప్పు!” మనోజ్ గద్దించాడు.

డా॥ సంజీవరావు పెదిమలు వణికాయి.

“....అలా.... చెప్పమన్నారు....” మూసిన గదిలో ఇరుక్కున్న కుందేలులా చూస్తూ అన్నాడు సంజీవరావు.

“ఎవరు?” మనోజ్ హుంకరించాడు.

సంజీవరావు ఎర్రటి కళ్ళతో చూశాడు. మనోజ్ కళ్ళలోని నిశ్చయాన్ని క్షణంలో అర్థంచేసుకున్న అతను చెప్పేశాడు.

“డాక్టర్, అయితే కరుణాకర్ ఆరోజు గీత చేరాడు, ఎవర్నీ శారీరకంగా అనుభవించలేదని నీకు తెలుసు. అవునా?” మనోజ్ ప్రశ్నించాడు.

“... తెలుసు.”

“తప్పుడు సాక్ష్యం ఇచ్చినందుకు నీకెంత ముట్టింది? ఐ వాంట్ ట్రూత్!”

ఇబ్బందిగా చూస్తూ గుటకలు మింగాడు సంజీవరావు.

“ఏ....మీ....అయిదు వేలిచ్చారు. దాంతోపాటు నా ప్రాణంకూడా ఇచ్చారు. అలా చెప్పకపోతే నన్ను చంపేస్తామన్నారు!” సంజీవరావు కంఠం వణికింది.

“ఎవరు?”

"అతని తరఫున ఇద్దరు వ్యక్తులు నన్ను కలుసుకున్నారు. వాళ్ళు...."

"డాక్టర్, ఆ వ్యక్తికి పొటాసియం సైనైడ్ నువ్వే ఇచ్చావు. అవునా?"

సంజీవరావు దీనంగా చూశాడు. "నన్ను బెదిరించారు. వాళ్ళ దుర్మార్గానికి భయపడ్డాను. వాళ్ళిద్దరికీ సైనైడ్ ఇచ్చాను...."

"డాక్టర్, వాళ్ళిద్దరూ ఎలా వున్నారు?"

డా॥ సంజీవరావు బొంగురు గొంతుకతో వర్ణించాడు.

"నువ్వు సప్లై చేసిన సైనైడ్ అమాయకురాలైన గర్భవతిని దారుణంగా చంపిందని నీకు తెలుసా?" మనోజ్ పళ్ళు కొరుకుతూ అడిగాడు.

సంజీవరావు విగ్రహంలా చూస్తూ వుండిపోయాడు. మనోజ్ అతన్ని తీక్షణంగా చూశాడు.

"డాక్టర్, ఆమె ఓవర్ డోస్ పొటాసియం సైనైడ్ కారణంగా మరణించిందనీ, ఆర్నెల్ల గర్భిణి అలా చావడం హారిబుల్ గా వుందనీ కోర్టులో డ్రమెటిక్ గా నువ్వు అన్నావు! అప్పుడు ఆ సైనైడ్ నీ సప్లై అని నీకు అనిపించలేదా?"

"....అనుమానం కలిగింది. కానీ....ఐవాజ్ హెల్ప్ లెస్...." సంజీవరావు మెల్లిగా అన్నాడు.

"డాక్టర్, వాళ్ళు నిన్ను ఎక్కడ కలుసుకున్నారు?"

"ఇక్కడే .... అయితే ఇక్కడేం మాట్లాడలేదు. ఇద్దరు వ్యక్తులు నన్ను అతని దగ్గరకు తీసికెళ్ళారు...."

"ఎక్కడికి?" మనోజ్ అడ్డొస్తూ అడిగాడు.

డా॥ సంజీవరావు చెప్పాడు. మనోజ్ అప్రయత్నంగా తలపంకించాడు. తిన్నగా డాక్టర్ కళ్ళలోకి చూశాడు.

"డాక్టర్, నిజం చెప్పావు. ఇప్పుడు నువ్వు నాతో ఒకచోటికి వస్తున్నావు...."

"ఎక్కడికి?" నత్తి నత్తిగా అరిచాడు సంజీవరావు.

"ఇందాకా నువ్వు అప్పచెప్పిన నిజాలన్నింటినీ కాగితంమీద రాసి సంతకం చేస్తావు...." మనోజ్ అతని ప్రశ్నను వినిపించుకోనట్టు అన్నాడు.

"నో!" సంజీవరావు కంగారుగా అరిచాడు.

మనోజ్ వెటకారంగా నవ్వాడు.

"ప్లీస్ ....నన్ను ఇరికించొద్దు .... నీకు అవసరమైంది చెప్పాను ...." సంజీవరావు ప్రాధేయపడ్డాడు.

"డాక్టర్, చదువుకున్న నీకు చట్టం తెలుసు. నిజం చెప్పి అప్రూవర్ గా మారిపోడం ఎంత ఆరోగ్యకరమో ఆలోచించు! కమాన్!"

"నో నో నో!" సంజీవరావు పిచ్చివాడిలా అరిచాడు. "ఇది బైటికి పొక్కితే వాళ్ళు నన్నూ నా కుటుంబాన్నీ సర్వనాశనం చేస్తారు! వద్దు ....నన్ను వొదిలెయ్.... ప్లీస్ ...."

"డాక్టర్, డోంట్ బీ ఏ ఫూల్! అప్రూవర్ గా మారిపో. పోలీసుల ముందు అంతా కక్కెయ్. వాళ్ళు నీకు ప్రొటెక్షన్ కల్పిస్తారు...."

"నో! ఆ వ్యక్తి అరి తేరినవాడు. పోలీసుల్నే కొనేస్తాడు! వద్దు...."

మనోజ్ అతన్ని చిరునవ్వుతో చూశాడు. అతని

చెయ్యి సంచీలోకి వెళ్ళింది. క్షణకాలం తరవాత ఇవతలికి వచ్చింది.

“వస్తాను!” సంజీవరావు కంఠం బొంగురుగా సంచీలోంచీ ధ్వనించింది. ఇందాకా ఆ గదిలో జరిగిన సంభాషణ సంచీలోంచీ వినిపించసాగింది.

సంజీవరావు ఉలిక్కిపడుతూ, అనుర్ధాగా చూశాడు. అతన్ని ఎగతాళిగా చూస్తూ నవ్వాడు.

“డాక్టర్, నేను అడిగినదానికంతా సమాధానాలు చెప్పేసి నా పీడ వదిలించుకోవాలనుకున్నావ్. రేపొద్దున బుకాయించవచ్చునీ నువ్వు ఆలోచించుకుని వుంటావు. అందుకే మన ‘ప్రశ్నలు - సమాధానాల్ని’ రికార్డు చేశాను!”

“నో!” సంజీవరావు కీచుగా అరిచాడు.

“డాక్, ఇప్పుడైనా వస్తావా?” మనోజ్ నవ్వుతూ అడిగాడు.

“నో! చచ్చినా రాను!” డా॥ సంజీవరావు మొండి ధైర్యంతో అరిచాడు.

“డాక్టర్, నీ స్టేట్‌మెంట్ ఒక నిరపరాధి చట్టానికి బలి అవకుండా అడ్డుకుంటుంది. డాక్టర్లు ప్రాణాలు పోస్తారు. కానీ నువ్వు స్వార్థంకోసం ఒక అమాయకుడిని బలిపశువుగా చేశావు! రామాయణంలో ఆంజనేయుడు లక్ష్మణుడిని కాపాడ్డానికి సంజీవపర్వతాన్ని మోసుకెళ్ళాడు. ఈరోజు నా అన్నయ్యను కాపాడ్డానికి సంజీవరావుని నేను మోసుకెళ్తాను. మోసుకెళ్ళేముందు, నీ బట్టతలని రివాల్వర్ పిడితో రాముకీర్తన పాడించి, స్పృహలేని స్థితిలోకి పంపిస్తాను....”

# "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాది పాటు పత్రిక లేదా సప్లమెంట్ బహుమతిగా పంపుతాము.

# "హోమ్ డెలివరీ"

'హోమ్ డెలివరీ' సభ్యులకు 'అపరాధ పరిశోధన' పత్రిక మరియు సప్లిమెంట్ కాపీలు వాటి అసలు ధరకే అందజేయబడతాయి. అంతేకాదు - వారికి పత్రికలను ప్రతి నెలా రిజిష్టరు లేదా బుక్ పోస్టులో పంపుతాము.

ప్రతి 6 నెలలకు ఒకసారి అంటే - జనవరి మరియు జులై నెలల పత్రికలు మాత్రం V. P. ద్వారా పంపబడతాయి. దానికి మీరు అర్ధ సంవత్సర చందా రు. 60/-లు చెల్లించవలసి వుంటుంది. పోష్టు ఖర్చులన్నీ మేమే భరిస్తాము. పత్రికల ఖరీదుకు మించి మీరు పైసా చెల్లించ నవసరంలేదు.

'హోమ్ డెలివరీ' వల్ల పత్రికలు మీకు మరింత త్వరితంగా, గ్యారంటీగా అందుతాయి. ఇంకా నెలనెలా, రెండేసి నెలలకు V. P. ద్వారా తెప్పించుకునే సౌకర్యంకూడా వుంది.

మరి - మీరు చేయవలసిందల్లా వెంటనే రు. 10/-లు పంపి శాశ్వతంగా 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరటమే.

పూర్తి వివరాలకై 'అపన' చూడండి!



"కరుణాకర్ నీ అన్నయ్యా?" డా॥ సుందరరావు అరిచాడు ఆశ్చర్యంతో.

"వెనక్కి తిరుగు!" రివాల్వర్ని అతని చెవిలో ఆన్చి అరిచాడు మనోజ్.

డాక్టర్ మెల్లిగా వెనక్కి తిరిగాడు.

"వద్దు....కొట్టకు! ప్లీజ్!" ఏడుపు గొంతుతో అరిచాడు.

"చేతులు వెనక్కి పెట్టు!" మనోజ్ గర్జించాడు.

డాక్టర్ అప్రయత్నంగా చేతుల్ని వెనక్కి వుంచుకున్నాడు. మనోజ్ రివాల్వర్ని రాగిచెంబులాంటి డాక్టర్ బట్టతలమీదికి సుత్తిలా ఎత్తాడు.

"ఆగు!"

వెనకనుంచీ వచ్చిన హెచ్చరిక విని మనోజ్ ఉలిక్కిపడ్డాడు. అసంకల్పితంగా రివాల్వర్ని డాక్టర్ కణతకి ఆనించి, తలతిప్పి వెనక్కి చూశాడు.

తలుపు ఎప్పుడు తెరుచుకుందో అతనికి తెలీదు. తెరిచిన తలుపుముందు లావుగా పొట్టిగా వున్న స్త్రీ నిలబడింది. ఆమె కళ్ళు తదేకంగా మనోజ్నే చూస్తున్నాయి. ఆమె మెల్లిగా వాళ్ళవైపు అడుగువేసింది.

"బాబూ, ఆయన్ని ఇటువైపు తిప్పు. కావాలంటే రివాల్వర్ అలాగే వుంచుకో. కానీ ట్రిగ్గర్ నొక్కకు!" అందామె, దగ్గరగా ఆగి.

మనోజ్ ఆమె ధైర్యాన్ని మెచ్చుకోకుండా వుండలేకపోయాడు. అతని ఆజ్ఞతో డాక్టర్ ఇటువైపు తిరిగాడు. ఆమె నిప్పులు కక్కే కళ్ళతో అతన్ని చూసింది.



మా వద్ద సాంఘిక నవలలు, డిటెక్టివ్‌లు, బాల సాహిత్యం; నాటకములు, వైద్య, విద్య మరియు స్కూలు, కాలేజి విద్యార్థులకు అచ్చుపుస్తకములు, ఎక్సర్‌సైజు పుస్తకములు, హిందీ, ఇంగ్లీషు నవలలు లభించును.

నేడే కేటలాగుకై వ్రాయండి.

## శ్రీ గణేశ్ బుక్ హౌస్

(బుక్ డిస్ట్రిబ్యూటర్స్ & స్టేషనరీ)

టౌన్‌హాల్ రోడ్డు—రాజమండ్రి - 1

"ఇందాకటి మీ సంవాదం అంతా నిజమా?" హుంకరించిందామె.

"లలితా...." డా॥ సంజీవరావు మూలిగాడు.

"సమాధానం చెప్పండి! అతనికి మీరు చెప్పిందంతా నిజమా?" హుంకరించింది లలిత, సంజీవరావు భార్య.

సంజీవరావు రెప్పలు కిందికి వాలాయి. "ని..జ.. మే."

"సిగ్గులేదూ?" లలిత అడసింహంలా గర్జించింది. మెల్లిగా మనోజ్ వైపు చూపులు తిప్పింది.

"అబ్బాయ్, ఆయన వస్తారు. స్టేట్ మెంట్ ఇస్తారు. మీతో బాటు నేనూ పోలీసుల దగ్గరకు వస్తాను...."

"లలితా!" సంజీవరావు అరిచాడు.

"ఏం?" ఆమె గద్దించింది.

"లలితా, నీకు తెలీదు .... వాళ్ళు చంపేస్తారు!" డాక్టర్ కంఠంలో కంగారు.

"ఎవడో చంపుతాడన్న భయంతో అనుక్షణం చస్తూ ఎంతకాలం బతుకుతారు? ఇలాంటి పాడుపని చేస్తారని నేను ఊహించలేదు కోరుకూసుకుని అప్రూవర్ అవండి. చేసిన పాపాన్ని కాస్తయినా ప్రక్షాళనం చేసుకోండి! అబ్బాయ్, పద!" లలిత గంభీరంగా అంది.

మనోజ్ ఆమెవైపు చిరునవ్వుతో చూశాడు. "థాంక్యూ మేడం!"

"లలితా, నీకేమన్నా పిచ్చెక్కిందా? నీకు.."సంజీవరావు బొబ్బలెట్టడం ప్రారంభించాడు.

లలిత నిప్పులుకక్కుతూ చూసింది. "సరే! మీరు రానక్కర్లేదు. ఇతనితో నేనొక్కర్తే వెళ్తాను. ఇతను రికార్డు చేసిందంతా నిజమే అనీ, స్వయంగా మీ

అంతట మీరే, మీ కంఠంతోటే అంతా అఘాయిం చారనీ పోలీసువాళ్ళకి ప్రమాణపూర్వకంగా చెప్పి, నేనే స్టేట్ మెంట్ రాసి, సంతకం చేస్తాను. అవసరమైతే బోనెక్కి మీ నిర్వాకం చాటింపువేస్తాను!"

"లలితా!" సంజీవరావు బొంగురుగా అరిచాడు.

"ఈ లలితా సహస్రనామం మానేసి మర్యాదగా వస్తారా, లేదా?" లలిత అరిచింది.

"బాబూ, పద. నన్ను తీసుకెళ్ళు. పోలీసాఫీసరు దగ్గరకెళ్దాం!" లలిత నిర్లక్ష్యంగా అరిచింది.

మనోజ్ రివాల్వర్ని తీసేశాడు. లలిత వుండగా, డాక్టర్ సంజీవరావుని కంట్రోల్ చేయడానికి రివాల్వర్లు అక్కర్లేదు.

"కమాన్!" లలిత అరిచింది మళ్ళీ. మనోజ్ చిరునవ్వుతో కదిలాడు. లలిత అతని పక్కనే ఠీవిగా నడవసాగింది.

చెమటపు కక్కుతున్న సంజీవరావు తోక తెగిన అల్సేషియన్‌లా, తలవాల్చుకుని వాళ్ళని వెంబడించాడు.

కాసేపట్లో వాళ్ళు ముగ్గురూ ఎక్కిన కార్ని, స్టీరింగ్ వెనక కూచున్న ఇందురేఖ స్టార్ట్ చేసింది....

(ఇంకా వుంది)

